అపరాధ పరిశోధన అనుబంధం— 74

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## బలవంతుడైన నేరస్థుడు

రచన : వసుంధర

## లాల్ అండ్ జాన్ గోడదూకిన హంతకి

రచన: సికిందర్

## చంద్రహారం

రచన: వాణిశ్రీ

## నలుగురు గూండాలు

రచన: టెంపోరావ్

పొగమంచు — రెండవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్ 74
ఫిబ్రవరి, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. పీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# బలవంతుడైన నేరస్థుడు!

## వసుంధర

రాఘవేంద్ర ఆగి మరొక్కసారి పరీక్షగా చూశాడు.

అది కొత్త పర్సు కాబోలు. తళతళా మెరుస్తోంది.

రాఘవేంద్ర అటూ ఇటూ చూశాడు. ఎక్కడా జనంలేరు. తటపటాయిస్తూనే అతనాపర్సు తీశాడు. ఒక సారి పర్సు విప్పి చూశాడు. అందులో వందరూపాయల నోట్లు దొంతర్లుగా ఉన్నాయి.

రాఘవేంద్రకు కలిగిన సంతోషమింతా అంతా కాదు. విధి కరుణించి తనకీ డబ్బు ప్రసాదించి ఉండాలి. లేక పోతే డబ్బు అవసరం పీకలమీదికి వచ్చినపుడు, తనకు డబ్బు సంపాదించే మార్గం మరొకటి కనిపించక అసహాయుడై తిరుగుతున్నపుడు ఇలా పర్సు దొరకడమేమిటి?

రాఘవేంద్ర పర్సులో డబ్బు లెక్క పెట్టాడు. అందులో వందనోట్లు ఇరవైవున్నాయి. మొత్తం రెండువేల ఆరు వందల పన్నాలుగు రూపాయ లున్నాయి. దెబ్బతో తన దరిద్రం తీరిపోతుంది. తన జీవిత చక్రం అద్భు

తంగా తిరుగుతుంది.

రాఘవేంద్రది చాలా మామూలు కథ. ఓ మధ్య తరగతి గుమస్తాకి ఉన్న నలుగురు సంతానంలో అతను ప్రథముడు. ఎలాగో బియ్యే అయిందనిపించాడు. ఉద్యోగం అతని కుటుంబానికి ఎంతో అవసరం.

ఇలాంటి పరిస్థితుల్లో అతనికో మంచి అవకాశం వచ్చింది. ప్రయివేటు కంపెనీలో నెలకు ఎనిమిదివందల రూపాయల ఉద్యోగం. అది కావడానికి ప్రయివేటు కంపెనీయేగానీ—అందులో ఉద్యోగం లభిస్తే పోతుందన్న బాధ ఉండదు. ఉద్యోగస్థులకు బలమైన ట్రేడ్ యూనియన్ ఉంది. జీతాలు ఖచ్చితంగా ప్రతి నెలా మొదటి తారీఖున వస్తాయి. ఏటా ఒక నెల జీతం బోనసుగా వస్తుంది. ఈ ఉద్యోగం దొరకడం అంత సులభంకాదు. కానీ ఆఫీసులో రాఘవేంద్ర తండ్రి ఎలాగో ఓ మనిషిని పట్టాడు. అంతా బాగానే వుంది. ఉద్యోగానికి రెండువేల రూపాయలు లంచం కావాలి.

రాఘవేంద్ర తండ్రికి పరపతి ఉందిగానీ అది డబ్బును పుట్టించలేదు. తాకట్టు పెట్టడానికీ, అమ్మడానికీ ఆయనకు స్థిరచరాస్తులు లేవు. అప్పుచేద్దామన్నా అప్పటికే పదివేలదాకా ఉంది. ఆ పదివేల రూపాయలూ ఆయన ఏడెనిమండుగురి దగ్గర్నుంచి చేబదులుగా తీసుకున్న చిల్లర ముత్తాల ఘనపరమాణం. వాళ్ళు తప్ప ఆయన కింకెవ్వరూ సాయపడరు. వాళ్ళకింక ఆయనకు సాయపడే శక్తిలేదు.

ప్రస్తుతానికి డబ్బులేదనీ—ఉద్యోగంలో చేరగానే వాయిదాల పద్ధతిమీద తీర్చుకుంటాననీ రాఘవేంద్ర తండ్రి ఆ మనిషిని కోరాడు.

“ఏదో మంచివాడివని నీకు ఇంత చవగ్గా ఒప్పు

కున్నానుగానీ—ఇంత మంచి ఉద్యోగానికి పదివేలన్నా జనం ఎగరేసుకుంటూ వస్తారు. నాకు అర్జంటుగా డబ్బు అవసరమై నిన్ను ఛార్జి చేస్తున్నానుగానీ లేకపోతే నీకు ఉత్తకే ఉద్యోగ మిప్పించి ఉండేవాడిని. ఇంక రెండే రెండ్రోజులు గడువు. డబ్బు సమకూర్చలేకపోతే ఉద్యోగం ఆశ వదులుకోవచ్చు. అయినా నాదో సలహా. ఉద్యోగానికి రెండువేలైనా లంచం సమకూర్చలేనివాళ్ళు ఆ ప్రయత్నాలు చేయకూడదు. మరో దారి వెతుక్కుంటే మంచిది—బ్రతకడానికి!"—అంటూ ఆ మనిషి రాఘవేంద్ర తండ్రికి ఖచ్చితంగా చెప్పేశాడు.

చేసేదిలేక రాఘవేంద్ర తండ్రి ఆ ఆశ వదులుకున్నాడు. రాఘవేంద్రకు కలిగిన నిరుత్సాహమింతా అంతా కాదు. అదృష్టం అంత దగ్గరగా వచ్చి తనను పరిహాసించి వెంటనే వెనక్కు వెళ్ళిపోతుందని అతడనుకోలేదు.

అయితే ఇంకా ఒక రోజు గడువుండగానే ఈ డబ్బు దొరికింది. తనకంటే అదృష్టవంతుడు వేరే ఉండడు.

అప్పుడే రాఘవేంద్ర కింకో అనుమానం వచ్చింది. డబ్బు దొరికిందని తను ఎంతగానో ఆనందిస్తున్నాడు. కానీ అది పోగొట్టుకున్న వాడెంత దురదృష్టవంతుడో! అతను తన డబ్బును పోగొట్టుకుని ఎంతగా కుమిలిపోతున్నాడో?

అప్రయత్నంగా రాఘవేంద్ర పర్సు మరోసారి తెరిచి చూశాడు. అందులో పర్సు యజమాని చిరునామా లేకపోతే అతనికి కాస్త మనశ్శాంతి ఉండేది. తను అసహాయుడు కాబట్టి ఆ పర్సును తన దగ్గరే వుంచుకున్నాడు

కానీ ఎడ్రస్ తెలిస్తే అసలు మనిషికి అందజేసి ఉండే వాడినని సంతృప్తిపడొచ్చు. కానీ అతని కా సంతృప్తి మిగలకుండా అందులో పర్సు స్వంతదారు చిరునామా ఉంది. చాలా స్పష్టంగా వుంది. అతను కావాలనుకుంటే ఆ పర్సును స్వంతదారు కందజేయవచ్చు.

రాఘవేంద్ర బాగా ఆలోచించాడు. ఈ పర్సు అతనెలాగూ పోగొట్టుకున్నాడు. ఇది ఏ బురదగుంటలోనే పడివుంటే ఎవరికీ దక్కకుండా పోయుండేది. ఎవరికి దక్కినా అది స్వంతదారు కివ్వాలని అనుకోరు. అందువల్ల ఆ డబ్బు తను వాడుకోవడమే మంచిది. అయినా తను ఇలాంటి బాధలు పెట్టుకోకూడదు. ఇంత డబ్బు పర్సులో పెట్టుకుని అజాగ్రత్తగా పారేసుకున్నవాడు పేదవాడై ఉండడు. బాగా ఉన్నవాడై వుంటాడు. అలాంటి వాడికీ డబ్బు లెక్కలోని కాదు.

ఈ ఆలోచన రాఘవేంద్ర మనసుకు అట్టే తృప్తి నివ్వలేదు. ఆ అడ్రసును బట్టి ఆ మనిషి ఇంటికి వెళ్ళి చూస్తే తప్ప అతని మనసుకు శాంతికలిగేలా లేదు. అందుకని అతను ఆ అడ్రస్ వెతుక్కుంటూ బయల్దేరి ఓ ఇల్లు చేరాడు.

అప్పుడు రాఘవేంద్ర మనసు శాంతించింది. చాలా ఖరీదైన బంగళా అది. ఇంటి చుట్టూ పెద్ద ప్రహరీ గోడ. గోడకో గేటు—ఆ గేటు దగ్గర ఓ వాచ్‌మన్!

రాఘవేంద్ర చూస్తూండగా వాచ్‌మన్ లేచి నిలబడి గేటును బార్లా తెరిచాడు. ఒక అందమైన కారు గేట్లోంచి బయటకు వచ్చి తుర్రుమని దూసుకుపోయింది.

ఆ కారులో ఎవరున్నారో రాఘవేంద్ర చూడలేదు. కానీ ఆ ఇంట్లో మనుష్యులకు రెండువేల రూపాయ లో

పెద్ద మొత్తంకాదు. ప్రస్తుతానికి డబ్బుతో తన అవసరం గడుపుకోవచ్చు.

అయితే అసలు యజమాని ఎవరో తెలిసి కూడా డబ్బు వెనక్కివ్వకపోతే తను దొంగే అవుతాడు. ఉద్యోగంలో చేరాక ఈ డబ్బును వెనక్కు ఇచ్చేయాలి. అప్పుడే తన మనస్సుకు శాంతి లభిస్తుంది.

రాఘవేంద్ర నిట్టూర్చి కదిలాడు.

## 2

"దేవీ! నేను నీకేవిధంగా సాయపడగలను?" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"కాసేపు వెళ్ళి మీ ఆఫీసు గదిలో కూర్చుని...." అంది పద్మావతీదేవి.

"నిన్ను వదిలి క్షణమైనా బ్రతకలేని దురదృష్టవంతుడను. ఇక్కడే వుంటాను. ఆఫీసు గదికి వెళ్ళలేను.... నువ్వు వెళ్ళమన్నా వెళ్ళను...." అన్నాడు వెంకన్న.

"మీరు వెళ్ళకపోతే వంటకాదు. ఆ పైన మీ ఇష్టం—" అంది పద్మావతి.

"నువ్వెదురుగా నిలబడి నాకేసి చూస్తే ఆ చూపులోంచి వంకాయలు పుట్టుకొస్తాయి. మనిద్దరి శరీరాలూ ఇంకా దూరంగానే ఉన్నందుకవి బెంగపడి ముక్కలై పోతాయి. నీ కోపంలోంచి ఉప్పు కారం పుట్టుకురాగా నా విరహం వాటిని వుడకబెడుతుంది. అప్పుడు నేను నిన్ను సమీపించి, దగ్గరగా తీసుకుని ఇలా....ఇలా.... ముద్దు పెట్టుకుంటే...." అన్నాక మాటలు ఆగిపోయాయి. పద్మావతి కోపాన్ని నటించింది కానీ భర్తను విడిపించుకో లేదు.

వెంకన్న ఒక్క క్షణం అనంతరం—"వంకాయ

కూరతో అన్నం తిన్న అనుభూతి కలిగింది....”
అన్నాడు.

పద్మావతి అతనివంక దీనంగా చూసి—“మహాశయా! నాదొక్క కోరిక....” అంది.

“అనుగ్రహించాను—ఏమిటో చెప్పు!” అన్నాడు వెంకన్న.

“మీ దక్కరుండున్నా వంట చేస్తాను కానీ ఒక్క షరతు. మీరు కవిత్వం మాత్రం చెప్పవద్దు. ఇంత భయంకరమైన కవిత్వం ఏ ఆడదీ భరించలేదు....” అంది పద్మావతి.

“నా కవిత్వం భయంకరమా? ఎంత అవమానం?” అన్నాడు వెంకన్న బాధగా.

“అవును మహాశయా! అధరాల్లో అమృతమని కవులు చక్కగా వర్ణిస్తే వంకాయ కూరతో పోలుస్తున్నారు మీరు. వినడానికి ఎబ్బెట్టుగా వుంది—” అంది పద్మావతి.

“దేవీ! అమృతం రుచి మనకు తెలియనిది. నాకు తెలిసిన రుచుల్లో వంకాయ కూరదే అమోఘమైనది. అమృతమంటే నాకదే గుర్తొస్తుంది. అదీకాక పూర్వ కవుల్ననుకరించడం నా కిష్టముండదు. ప్రతి దాంట్లో కొత్తదనం కావాలి. ఉదాహరణకు నీ అందమైన చేయి అరటి మొటలా వుంది. నీ చేతి వేళ్ళు ములక్కాడల్లా వున్నాయి. కూరేల, పులుసేల—నువ్వుండగా....” అని అతనింకా ఏదో అనబోతుండగా పద్మావతీ దేవి చెవులు మూసుకుని-“నేనే పరమ పతివ్రతనైతే ఈయన వెంటనే ఆక్కణ్ణించి వెళ్ళిపోవాలి—” అంది.

వెంటనే వంటింట్లో టెలిఫోన్ మ్రోగింది. విసుక్కుంటూ రిసీవర్ ఎత్తాడు వెంకన్న. ఫోన్లో సీతమ్మ కంఠం మ్రోగింది—“ఓ పెద్దమనిషి మీ కోసం ఎదురు

చూస్తున్నాడు. త్వరగా రండి—"

"ఏ పాతివ్రత్యం బంగారం కాను...." అని భార్యను విసుక్కుని త్వరగా అక్కణ్ణించి ఆఫీసు నదికి చేరు కున్నాడు. భార్య పాతివ్రత్య ప్రభావంలో సృష్టించబడ్డ ఆ పెద్దమనిషిని చూడాలని అతనికి ఆత్రుతగా కూడా వుంది.

అతను ఆఫీసులోకి రాగానే—"ఈయనే డిటెక్టివ్ వెంకన్న!" అ టూ సీతమ్మ పరిచయం చేసింది.

ఆ పెద్దమనిషి చేయి ముందుకు చాచి—"మీ పేరు విన్నాను. చూడ్డం ఇదే ప్రథమం. నా పేరు నరసింహం-" అన్నాడు.

"మీ పేరు నేనూ విన్నాను. చూడ్డం ఇదే ప్రథమం-" అన్నాడు వెంకన్న.

నరసింహం నతుక్కుమని—"నా పేరు విన్నారా? ఎప్పుడు?—ఏ సందర్భంలో?" అన్నాడు ఒక డిటెక్టివ్ తన పేరు గురించి ముందుగానే వినివుండడం అతనికంత ఇష్టంగా వున్నట్లు లేదు.

"నరసింహం పేరు చాలామందికి ఉంటుంది కదండీ. ఆ పేరు విన్నాను. అంతే!" అని నవ్వాడు వెంకన్న.

నరసింహం కూడా మొహమాటానికి నవ్వి—"మీరు చాలా చమత్కారంగా మాట్లాడతారు. మరి మీ పరి శోధన ఎలా వుంటుందో కానీ—" అని—"చాలా ముఖ్య మైన పనిమీద మీ సాయంకోరి వచ్చాను—" అన్నాడు.

"చెప్పండి!" అన్నాడు వెంకన్న. అసిస్టెంట్స్ సీతమ్మ, రాజమ్మ—ఇద్దరూ నోట్సు రాసుకోవడానికి సిద్ధంగా వున్నారు. అందమైన వాళ్ళ ముఖాలవంక ఓ.

పర్యాయం చూసి నిట్టూర్చి చెప్పడం ప్రారంభించాడు నరసింహం:

"మూడు నెలల క్రితం నేను పర్సు పోగొట్టుకున్నాను. అందులో రెండు వేలకు పైగా క్యాషుంది. డబ్బు పోగొట్టుకున్న రెండుమూడ్రోజులకు ఆ విషయం మరిచి పోయాను. అయితే నిన్నటి దినం ఓ తమాషా జరిగింది. నిన్న నాకు రెండువందల రూపాయలు మనియార్డరు వచ్చింది. అందులో పంపిన మనిషి చిరునామా వుంది కానీ అది సరైనదికాదని తెలిసింది. తర్వాత ఓ ఉత్తరం వచ్చింది. అది కూడా తీసుకొచ్చాను. మీరు చూడండి..." అంటూ ఓ వుత్తరం అందించాడు నరసింహం.

వెంకన్న దాన్ని పైకి చదివాడు—"గౌరవనీయులైన నరసింహంగారికి నమస్కారాలు. అనుకోకుండా మీ పర్సు నాకు దొరికింది. అందులోని డబ్బు నన్ను ఉద్యోగిసుణ్ని చేసింది. పర్సులో మొత్తం రెండువేల ఆరు వందల పద్నాలుగు రూపాయలున్నాయి. మీ డబ్బును ఆయాచితంగా తీసుకోవడం నా కిష్టంలేదు. అందుకే ప్రతినెలా మీకు రెండువందలు చొప్పున పంపి మీ బాకీ తీర్చుకుంటాను. వెంటనే తీసుకువచ్చి మీ డబ్బు వెనక్కి ఇవ్వనందుకు నాకు సిగ్గుగానే వుంది. ఏది ఏమైనా మీకు నా కృతజ్ఞతలు—

ఉత్తరం చివర సంతకం లేదు.

"చాలా తమాషాగా వుంది. ఈ రోజుల్లో ఇలాంటి వాళ్ళుంటారని నేనూహించలేను..." అన్నాడు వెంకన్న.

"నాకు అతని అడ్రసు కావాలి...." అన్నాడు నరసింహం.

"ఎందుకు?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

"నమ్మకమైన సెక్రటరీ కోసం ప్రయత్నిస్తున్నాను నేను చాలా కాలంగా. ఇలాంటి కుర్రవాడు దొరికితే అది నా అదృష్టమే అనుకుంటాను. ఇది దేవుడు నా కిచ్చిన అపూర్వావకాశం. మీరీ వుత్తరం ఆధారంతో ఈ కుర్రవాడి ఆచూకీ తీసి నాకు తెలియబరచాలి...." అన్నాడు నరసింహం.

"మనియార్డరు రసీదు కూడా వుంటుందిగదా—" అన్నాడు వెంకన్న సాలోచనగా.

"వుంది కానీ దానిమీద 200 రూపాయలు అన్న అంకె తప్ప మరే వివరాలూ లేవు...." అన్నాడు నరసింహం నిస్పృహగా.

"మనియార్డరు ఏ పోస్టాఫీసునుంచి చేయబడిందో చూడలేదా?" అన్నాడు వెంకన్న.

"అది నాకు స్ఫురించలేదు. కానీ రెమిటర్ అడ్రస్ మాత్రం నోట్ చేసుకున్నాను. అది తప్పు అడ్రస్ అని తెలుస్తూనే వుంది. కావాలంటే అది చెబుతాను...." అంటూ నరసింహం జేబులోంచి ఓ చిన్న కాగితం తీసి వెంకన్నకు అందించాడు.

"మరి ఫీజు...." అన్నాడు వెంకన్న.

"ప్రస్తుతానికి రెండువేలు. కుర్రాడు దొరికితే ఇంకో మూడువేలు...." అన్నాడు నరసింహం.

"రెండువేల ఆరువందల పద్నాలుగు రూపాయలున్న పర్సు పోయింది. అది తీసుకున్న కుర్రాడి ఆచూకీ కోసం అయిదువేలు ఖర్చు. చాలా తమాషాగా వుంది...." అన్నాడు వెంకన్న.

నరసింహం రెండువేలు ఇచ్చి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

# 3

"ఒకసారి కేసు వివరాలు చెప్పండి!" అన్నాడు వెంకన్న.

ముందుగా సీతమ్మ తను రాసిన నోట్సు చదివింది. తర్వాత రాజమ్మ చదివింది. ఇద్దరి నోట్సూ ఒక్కలాగే వున్నాయి. వెంకన్న తృప్తిగా తలాడించి—"ఇప్పుడు పరిశోధన ఎలా మొదలుపెట్టాలో ఒకరి తర్వాత ఒకరు చెప్పండి!" అన్నాడు.

"అన్ని పోస్టాఫీసుల్లోనూ వాకబుచేస్తే కొంత సమాచారం తెలియొచ్చు—" అంది సీతమ్మ.

"మళ్ళీ నెల అతనింకో మనియార్డరు చేయొచ్చుగదా! ప్రతి పోస్టాఫీసులోనూ నరసింహంగారి పేరున రెండోం దలు మనియార్డరు చేయడానికెవరైనా వస్తే మనకు ఫోన్ చేసి తెలియజెప్పమంటే సరిపోతుంది-" అంది రాజమ్మ.

క్లయంట్సు వచ్చినపుడు తయారుచేసిన నోట్సు ఒక్కలాగే ఉండవచ్చునేమోగానీ స్వంత అభిప్రాయాల దగ్గరకు వచ్చేసరికి సీతమ్మ, రాజమ్మ ఎన్నడూ ఏకీభవించరు. అది వెంకన్నకు ఉపయోగకరంగానే వుంటుంది. ఒకే విషయాన్ని రకరకాల కోణాల్లో ఆలోచించడాని కతనికి సాధ్యపడుతుంది.

"సీతమ్మ అయిడియా మరీ చప్పగా వుంది కానీ రాజమ్మ అయిడియా కాస్త బాగుంది. ఎటొచ్చీ అతను మళ్ళీ డబ్బు పంపాలి. అందుకు పోస్టాఫీసుకే రావాలి—" అన్నాడు వెంకన్న సాలోచనగా—"నాకైతే ఇంకో దారి కనబడులోంది—"

"ఏమిటది?" అన్నారు సీతమ్మ, రాజమ్మ కుతూహలంగా ఒకేసారి.

"నరసింహం మూడు నెలల క్రితం పన్ను పోగొట్టు కున్నాడు. అంటే ఆ తర్వాతనే ఈ మునిషికుద్యోగం వచ్చి వుండాలి. ఈ ఊళ్ళోని ఆఫీసులన్నీ గాలించాలి. అందులో కొత్తగా రిక్రూటైన వాళ్ళందర్నీ ఓ కంట కనిపెట్టాలి...."

"అంతేకాదు. వుద్యోగాని కతనికి డబ్బు అవసరమైంది. అంటే లంచమిచ్చాడన్నమాట. డబ్బు అతను స్వయంగా ఇచ్చివుంటాడనుకోను. ఎవరో అతనికి సాయపడి వుంటారు. డబ్బు తీసుకుని వుద్యోగం ఇప్పించగల వాళ్ళు ఊళ్ళో ఎంతమంది లేరు. ఆ విధంగా మనం బయలుదేరితే పని సులభం కావచ్చు—" అంది సీతమ్మ.

"శభాష్!" అని మెచ్చుకున్నాడు వెంకన్న. అతను ఏదో గుర్తుచేసుకోవడానికి ఆలోచిస్తున్నాడు.

"కేసుకు తలా తోకా లేదనుకున్నాను. అప్పుడే రెండూ ఏర్పడిపోతున్నాయి...." అంది రాజమ్మ ఆశ్చర్యంగా.

## 4

ఆ మూడు నెలల కాలంలోనూ ఊళ్ళో జరిగిన కొత్త ఎపాయింట్ మెంట్ల గురించి వెంకన్న వాకబు చేశాడు. గవర్న మెంట్ ఆఫీసుల్లో చాలావరకూ రిక్రూట్ మెంట్ జరగలేదు. ఒక ఆఫీసులో ఒక క్లర్కు రెండు నెలల క్రితం జేరాడు. అతనికింకా జీతం రానేరావడంలేదు.

బ్యాంకుల్లో అప్పాయింటైనవారో పదిమంది దాకా వున్నారు. అందులో నలుగురు బాగా వళ్ళువాచినవాళ్ళు. లంచం స్వయంగానే ఇచ్చుకోగలరు. మిగతా ఆరుగురూ మధ్యతరగతివాళ్ళు. అయితే అందులో ఇద్దరు అమ్మాయిలు. కాబట్టి నలుగురే మిగిలారు.

ప్రయివేటు కంపెనీల్లో జేరినవాళ్ళు ఓ పాతికమంది దాకా వున్నారు. అందులోనూ అయిదుగురు ఆడపిల్లలు. మిగతా ఇరవైమందిలో పదిమందికి జీతం నాలుగొందలే! అందులోంచి రెండువందలు తీసి అనవసరంగా కొత్త బాధ్యతను తగిలించుకునే తెలివితక్కువ వాళ్ళుండరు. ఆ విధంగా పదిమంది మిగిలారు. ఈ పదిమందిలోనూ ఏ ఒక్కడైనా అయుండవచ్చు—కలియుగ ధర్మాత్ముడు,

మొత్తం పద్నాలుగురు మనుషులు తేలారు.

డబ్బు తీసుకుని ఉద్యోగా లిప్పించగలవాళ్ళు కొంత మంది వెంకన్నకు ఎరుకే! అయితే అతనే వెడితే వాళ్ళేమీ చెప్పకపోవచ్చు. వాళ్ళ గురించి తెలుసు కునేందుకు వెంకన్న ఓ వుపాయం పన్నాడు. ఓ నిరు ద్యోగి కుర్రాణ్ని సంపాదించి వాడిని ఈ పద్నాలుగురు కొత్త వుద్యోగస్తుల మీదికీ ఉసిగొల్పాడు.

అతగాడు వెళ్ళిచుట్టూ తిరిగి తను ఎంత డబ్బైనా ఇవ్వగలననీ—వుద్యోగం కావాలనీ—తనకు సహకరించ మనీ—కోరాడు. ఆరుగురు కుర్రాళ్ళు తమకేమీ తెలియదు పొమ్మన్నారు. ఎనమండుగురు మాత్రం కొందరి పేర్లు సూచించారు. నిరుద్యోగి ఆయా మనుషుల్ని కలుసు కున్నాడు. కొందరు ప్రస్తుతానికేం పని జరగదన్నారు. ఇద్దరు మనుషులు మాత్రం అయిదువేలు తీసుకొస్తే రెండు నెలల్లో పని జరుగుతుందన్నారు. ఈ వివరాలన్నీ ఎప్పటి కప్పుడు నిరుద్యోగి వెంకన్నకు అందజేశాడు.

వెంకన్న ఆ ఎనమండుగురు కుర్రాళ్ళమీద ఓ కన్ను వేశాడు. నరసింహానికి రెండువందలు మనియార్డరు చేస్తూ రాఘవేంద్ర అతనికి దొరికాడు. వెంకన్న రాఘవేంద్రను

కలుసుకుని మాట్లాడాడు. అసలు సంగతి అతనికి తెలిసింది.

"నా గురించి నరసింహంగారు అంత శ్రమ తీసుకున్నారా?" అన్నాడు రాఘవేంద్ర ఆశ్చర్యంగా.

"ఈ రోజుల్లో దొరకనిది నీతి, నిజాయితీ. అవి నీ దగ్గరున్నాయి. ఎవరైనా సరే నీవంటి వారిపట్ల ఆకర్షితులౌతారు. ఆయన నీకు సెక్రటరీ వుద్యోగం ఇవ్వాలని అనుకుంటున్నాడు—" అన్నాడు వెంకన్న.

"నా వునికి ఆయనకు తెలియడం ఇష్టంలేదు. మీరంటున్న నీతి, నిజాయితీ నాకు నిజంగా వున్నట్లయితే ఆ పర్సు ఆయనకు వెంటనే అందజేసి వుండేవాణ్ణి. తప్పు చేసిన అనుభూతి నాకుంది. అయినా ఈ రోజుల్లో అసలైన నీతిపరుడికి విలువలేదు. అడుసు తొక్కి కాలు కడుక్కునే వాడికే గౌరవమెక్కువ—" అన్నాడు రాఘవేంద్ర.

వెంకన్న క్షణం ఆలోచించి—"నీ వునికిని ఆయనకు తెలియబర్చకపోతే పరిశోధకుడిగా నాకు చెడ్డ పేరు వస్తుంది. అందువల్ల నీ వునికిని తెలియజేయక తప్పదు. అయితే నీకు చక్కటి వుద్యోగముంది. ఇది వదులుకుని ఆయన దగ్గరకు వెళ్ళడం కూడా తెలివితక్కువే. నీ పేరుతో మరో వ్యక్తిని పంపిస్తే నీ వునికి రహస్యంగా వుంటుంది. ఓ నిరుద్యోగికి వుద్యోగమూ లభిస్తుంది—" అన్నాడు.

"నా పేరుతో అంటే?"

"అంటే నీ పేరు కాదు. మనిషూర్డరు చేసిన వ్యక్తి రాఘవేంద్ర కాదు. మరో సుందరం. ఇందుకు నీకు అంగీకారమే కదా!" అన్నాడు వెంకన్న.

# 5

"మిస్టర్ సుందరం-బాగా గుర్తుంచుకో. నువ్వు రాధా లైఫ్ ఇన్స్టిట్యూట్‌లో గత నాల్గు నెలలుగానూ పని చేస్తున్నావు. ఆ వుద్యోగం సంపాదించడానికి ఓ అజ్ఞాత వ్యక్తికి రెండువేలిచ్చావు. ఆ డబ్బు నీకు నరసింహంగారి పర్సులో దొరికింది. ఆ డబ్బు తిరిగిచ్చేయాలని నిర్ణయించుకున్నావు. మనియార్డరు చేస్తున్నావు. ఈ కథ చెప్పడంలో ఎక్కడా తడబడకూడదు. రాధా లైఫ్ ఇన్స్టిట్యూట్ ప్రొప్రయిటర్ సీతారామయ్య నాకు స్నేహితుడు. ఆయనకు నేనంతా చెప్పి వుంచాను...." అన్నాడు వెంకన్న.

"చాలా చాలా థాంక్స్ సార్! మీ వల్ల నాకీ వుద్యోగం దొరికితే మా ఇల్లు మళ్ళీ నిలబడుతుంది. మీ పేరు చెప్పుకుని పది కాలాలపాటు బ్రతుకుతాం—" అన్నాడు సుందరం.

వెంకన్న మందహాసం చేసి ఫోన్ డయల్ చేసి— "హలో—నరసింహం గారేనా, నేను....డిటెక్టివ్ వెంకన్నను మాట్లాడుతున్నాను. మీరు కోరిన మనిషి దొరికాడు. పేరు సుందరం. నాకు మిగతా మూడువేలూ పంపించే ఏర్పాటు చేయండి. అతనిప్పుడే బయల్దేరి మీ దగ్గరకు వస్తున్నాడు. వివరాలన్నీ అతని నోటే స్వయంగా విందురుగాని. బొత్తిగా వివరాలు తక్కువగా వున్నందువల్ల కేసుకు కాస్త కాలం పట్టింది—...." అన్నాడు. అవతలనుంచి నరసింహం చెప్పింది విని—"మీ కాంప్లిమెంట్సుకు థాంక్స్—" అని ఫోన్ పెట్టేసి— "నువ్వు వెళ్ళొచ్చు. ఐ విష్‌యూ బెస్టాఫ్ లక్—" అన్నాడు.

సుందరం వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన వెంటనే ఓ మనిషి వచ్చి వెంకన్నకు మూడువేల రూపాయలు అందజేసి నరసింహం పంపినట్లు చెప్పి వెళ్ళిపోయాడు. వెంకన్న తృప్తిగా నిట్టూర్చాడు.

సరిగ్గా ఇంకో అరగంటలో వెంకన్నకు ఫోన్ కాల్ వచ్చింది—"హలో!" అన్నాడతను.

"నేను—సీతారామయ్యను మాట్లాడుతున్నాను...."

"ఏమిటి—విశేషం?"

"నీ మాటమీద నేను చిక్కుల్లో పడ్డాను. ..నరసింహం దగ్గర్నుంచి నాకో ఫోన్ కాల్ వచ్చింది. ఎవరి రికమెండేషన్ మీద నేను సుందరాని కుద్యోగం ఇచ్చానో చెప్పమంటున్నాడు. నేను రికమెండేషన్లకు లొంగే మనిషిని కాదనీ, మెరిట్ చూసి సుందరాని కుద్యోగం ఇచ్చాననీ చెప్పి ఫోన్ పెట్టేశాను...." అన్నాడు సీతారామయ్య.

"అలాగా—ఇందులో చిక్కేముంది?"—అన్నాడు వెంకన్న.

"నరసింహం మళ్ళీ ఫోన్ చేశాడు. సుందరం ఈ వుద్యోగం కోసం రెండువేలు లంచమిచ్చాడని అంటున్నాడు. అది మీకే ఇచ్చాడా లేక మరో వ్యక్తికిచ్చాడా అని తెలుసుకోవాలని అడుగుతున్నాను. మీరు నిజం చెప్పకపోతే విషయం చాలాదూరం వెడుతుందని బెదిరించాడు. మాట మర్యాదగానే వున్నా బెదిరింపు వుంది. ఇప్పుడు నేనేం చేయాలి?"

"భయపడుతున్నావా?"

"పెద్దమనుషుల్తో వ్యవహారం. ఇందులో భయం

ప్రసక్తిలేదు. నేనూ పెద్దమనిషిగా చెలామణీ అవుతున్న వాణ్ని. ఇప్పుడు అనవసరంగా నా పరువు వీధి కెక్కుతుందేమోనని భయపడుతున్నాను...." అన్నాడు సీతారామయ్య.

"నువ్వేమీ భయపడకు. అంతా నేను చూసుకుంటాను. నువ్వు మాత్రం నీ మాటమీద నిలబడు. ఆయన బెదిరింపుకు భయపడి రకరకాల మాటలు చెబితే అనుమానం పెరిగి లేనిపోని గొడవలొస్తాయి. నీకేమీ తెలియదని మెరిట్ మీదే వుద్యోగమిచ్చానని చెప్పు...." అన్నాడు వెంకన్న.

ఫోన్ పెట్టేసి వెంకన్న ఆలోచనలో పడ్డాడు. తనూహించని పరిణామం ఇది. నరసింహం సీతారామయ్యకు ఫోన్ చేస్తాడని ఏమాత్రం ఊహించివున్నా అతణ్నిందులో ఇరికించి వుండేవాడు కాదు. ఒక్క క్షణం ఆలోచించి వెంకన్న మళ్ళీ నరసింహానికి ఫోన్ చేసి—"హలో—నరసింహంగారేనా—నమస్కారమండీ. మీరు పంపిన డబ్బు అందింది. చాలా థాంక్స్—" అన్నాడు.

"మీకూ నమస్కారం. ఇందులో థాంక్స్ ఏముంది లెండి. మీరు నా పని చేశారు. నేను మీకు డబ్బు ఇచ్చాను—"

"అది నిజమేలెండి. చిన్న అనుమానం. రాధా టైప్ ఇన్స్టిట్యూట్ ప్రొప్రయిటర్ సీతారామయ్య నాకు స్నేహితుడు. మీరు అతడికి ఫోన్ చేసి సుందరం గురించి రికమెండేషన్ చేసిందెవరో చెప్పమని అడుగుతున్నారట. ప్రతి ఆఫీసుకీ ఏవో రహస్యాలుంటాయి. మీరు ఇలా ఆయన్ను నిర్బంధించడం బాగోలేదు. నా కారణంగానే కదా సుందరం మీ దగ్గరకు వచ్చాడు. ఏదో స్నేహ

ధర్మంమీద నాకాయన సాయపడితే—మీ రాయన్ని బ్బంది పెడుతున్నారు—" అన్నాడు వెంకన్న.

"ఇందులో ఇబ్బంది ఏముందండీ—సీతారామయ్యగారు మీ స్నేహితుడు కాబట్టి నిక్కచ్చి మనిషే అయుండాలి. ఆయన ఎవరి రికమెండేషన్ మీదో సుందరానికి వుద్యోగం ఇచ్చారు. ఆ మనిషి కారణంగానే కదా సుందరం నా డబ్బుకు కక్కుర్తి పడ్డాడు. సుందరంలాంటి నిజాయితీపరుడ్ని కూడా కలుషితపరిచే ఆ స్వార్థపరుణ్ని పిలిచి కాస్త గడ్డెట్టాలనిపించింది. నీతికీ నిజాయితీకీ అన్యాయం జరిగితే సహించలేను నేను. మీరూ, సీతారామయ్యగారూ కూడా అంతేనని నా విశ్వాసం. ఏమంటారు?" అన్నాడు నరసింహం.

"నిజమేననుకోండి. కానీ ఏ విషయంలోనూ మరీ అంత పట్టుదల ఉండకూడదు. వుదాహరణకు మీ ఐశ్వర్యమంతా నీతీ, నిజాయితీలపైనే ఆధారపడిందని చెప్పలేం కదా—ఏమంటారు?"—అన్నాడు వెంకన్న.

"ఇంతకీ మీరేమంటారు?"—అన్నాడు నరసింహం.

"ఏంలేదు! మీ క్కావలసిన మనిషి దొరికాడు కాబట్టి అంతతో తృప్తిపడి ఊరుకోండి. మళ్లీ మీరు పరిశోధనలకు దిగకండి—" అన్నాడు వెంకన్న.

"పోనీ ఇంకో పదివేలిస్తాను. నా తరఫున మీరే పరిశోధించి చెబుతారా—సుందరం దగ్గర డబ్బు తీసుకున్న ఆ అజ్ఞాతవ్యక్తి ఎవరో?"—అన్నాడు నరసింహం.

"ఈ కేసులో నాకింక ఇంట్రస్టులేదు. మీరు కూడా ఇంట్రస్టు తీసుకోవడం నా కిష్టంలేదు—" అన్నాడు వెంకన్న.

అవతల ఫోన్ వెంటనే క్లిక్‌మంది. ఇంకో పది నిము

హాల్లో వెంకన్న ఆఫీసుకు సుందరం హడావుడిగా పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"అలా కూర్చో—ఏం జరిగింది?"-అన్నాడు వెంకన్న.

సుందరానికి ఆయాసం తీరడానికి కొంత సమయం పట్టింది. తేరుకున్నాక—"నా దగ్గర లంచం పుచ్చుకున్న అజ్ఞాత వ్యక్తి ఎవ్వరో చెప్పక తప్పదు. నరసింహాంగారు చాలా పట్టుదలగా వున్నాడు. వుద్యోగం మాటటుంచి అంతా నా ప్రాణం మీదకు వచ్చినట్లుంది-" అన్నాడు.

వెంకన్న క్కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు. ఈ నరసింహాం వ్యవహారం విచిత్రంగా వుంది. తన డబ్బు తిరిగిచ్చేసిన వాడికోసం అయిదువేలు ఖర్చుపెట్టాడు. మంచితనాన్ని సన్మానిస్తానన్నాడు. ఇప్పుడు లంచం తీసుకున్న మనిషిని తెలుసుకోవడం కోసం పదివేలైనా ఖర్చుపెట్టడానికి సిద్ధంగా వున్నాడు. చెడ్డతనాన్ని శిక్షిస్తానంటున్నాడు. ఇంతేనా—ఇందులో ఇంకేమైనా వుందా? వుంటే ఏమైవుంటుంది?

"నేనేం చేయాలో చెప్పండి-" అన్నాడు సుందరం.

వెంకన్న బాగా ఆలోచించి—"ఇది చాలా రహస్యమని చెప్పు. అయినా తప్పదంటే మనూరి ఎమ్మెల్యే గారి పేరు చెప్పేసేయ్—" అన్నాడు.

"నరసింహాంగారు ఎమ్మెల్యేగారికి ఫోన్ చేస్తే?"—అన్నాడు సుందరం కంగారుగా.

"నరసింహానికి దమ్ములు చాలవు. నీకేం భయంలేదు. నేనున్నాను వెళ్ళు...." అన్నాడు వెంకన్న.

సుందరం భయంగానే అక్కణ్నించి కదిలాడు. వెంకన్న ముఖం కూడా అంత తృప్తిగాలేదు. ఎక్కడో

ఏదో లింకు మిస్సయిందనీ అది తన బుర్రకు తట్టడంలేదనీ అతను గ్రహించాడు.

తన అసిస్టెంట్సువైపు తిరిగి—"జరుగుతున్న కథ మొత్తం ఫాలో అవుతున్నారా?" అనడిగాడు.

సీతమ్మ, రాజమ్మ తలలూగించారు.

"అయితే ఒకసారి మీరు రాసిన నోట్సు చదవండి!" అన్నాడు.

ఇద్దరి నోట్సూ ఒక్కలాగే వున్నాయి.

"రాఘవేంద్ర చేసిన ఒక మంచి పని నాకు అయిదు వేలు సంపాదించి పెట్టింది. అంతవరకూ బాగానే వుంది కానీ మంచిపని చేస్తున్నాననుకుంటూ సుందరాన్ని ప్రమాదంలో ఇరికించడం లేదుగదా—" అని అస్పష్టంగా గొణిగాడు వెంకన్న. ఆ గొణుగుడు సీతమ్మ, రాజమ్మల నోట్సులోకి వెళ్ళిపోయింది.

## 6

"నమస్కారమండీ!-నా పేరు సూర్యనారాయణ!" అన్నాడాయన.

చూస్తూనే ఆయన్ను గుర్తుపట్టాడు వెంకన్న-"మీరు రాఘవేంద్ర తండ్రి కదూ?"

"అవునండి. వాణ్ని కలుసుకుందుకు మీరు ప్రత్యేకంగా మా ఇంటికి వచ్చారు. నిన్న వుదయం ఆఫీసుకని వెళ్ళి ఇంతవరకూ వాడింటికి రాలేదు. ఏం జరిగిందో తెలియక ఇంటిల్లిపాదీ కలవరపడుతున్నాం. వాడి ఆఫీసులో వాకబుచేయగా నిన్న సాయంత్రం అయిదు గంటలకు వాడు ఆఫీసు వదిలినట్లు తెలిసింది-" అన్నాడు సూర్యనారాయణ.

వెంకన్న ముఖంలో కంగారు కనిపించింది. రాఘ

వేంద్ర మాయమయ్యాడు. ఎందుకు, ఎలా?

నిన్న సుందరం, నరసింహం దగ్గరకు వెళ్ళాడు. తర్వాత మళ్ళీ తన దగ్గరకు రాకపోతే ఏ సమస్యా లేదను కున్నాడు. రాఘవేంద్ర మాయమైన సమస్య దీనికి సంబంధించినదేనా?

"మీరేమనుకుంటున్నారు?"-అన్నాడు వెంకన్న.

"మీరు డిటెక్టివ్. ఏ కారణంవల్లనో మీరు మా వాణ్ని కలుసుకున్నారు. అందుకే నేను మీ దగ్గరకు వచ్చాను. మా వాణ్ని మాయంచేసే అవకాశముంటే అది మీకే తెలియాలి...." అన్నాడు సూర్యనారాయణ.

"సరే—మీరు వెళ్ళండి. మీ వాడు క్షేమంగానే వుంటాడని నాకు తోస్తోంది. తొందరపడి పోలీసు రిపోర్టివ్వకండి. సాయంత్రంలోగా ఏ విషయమూ నేను మీకు చెబుతాను—" అన్నాడు వెంకన్న.

సూర్యనారాయణ దిగులుగా వెళ్ళిపోయాడు. వెంకన్న ఒక పర్యాయం కేసును నెమరువేసుకున్నాడు. హఠాత్తుగా అతడి బుర్రలో ఏదో మెదిలింది—"రాజమ్మ! నీ నోట్సు ఒకసారిలా ఇవ్వు—" అన్నాడు.

రాజమ్మ ఇచ్చిన నోట్సును శ్రద్ధగా చూసి అతను ఒక నంబరు డయల్ చేశాడు.

"హలో! నేను రామరాజుని మాట్లాడుతున్నాను...." అంది అవతల కంఠం.

"డిటెక్టివ్ వెంకన్న హియర్!"

"నమస్కారమండీ. వెంకన్నగారూ—ఏమిటి పని?" అన్నాడు రామరాజు.

"ఒక చిన్న విషయం. నాతో మీరు అబద్ధం చెప్ప కూడదు. రాఘవేంద్ర అనే పేరుగల యువకుడివద్ద

రెండువేలు తీసుకుని వుద్యోగం ఇప్పించారు కదూ?" అన్నాడు వెంకన్న.

"అవును. ఈ వివరాలు మీ కెందుకావలసి వచ్చాయి?" అన్నాడు రామరాజు ఆశ్చర్యంగా.

"మీకు నరసింహం అనే ఆయన ఫోన్ చెయ్యొచ్చు. లేదా మిమ్మల్నాయన వ్యక్తిగతంగా కలుసుకోవచ్చు. ఏది జరిగినా నాకు తెలియబర్చండి...." అన్నాడు వెంకన్న.

"ఆ నరసింహం ఎవరు? అసలు సంగతేమిటి?"— అన్నాడు రామరాజు.

"అన్నీ తర్వాత చెబుతాను. ముందు నేను చెప్పినట్లు చేయండి. మీ మేలుకోసమే చెబుతున్నాను—" అని వెంకన్న ఫోన్ పెట్టేసి తన అసిస్టెంట్సు వంక చూసి— "ఏం జరిగిందీ అర్ధమైందా మీకు....?" అనడిగాడు.

"నరసింహం ఏ విధంగానో సుందరం అబద్ధం చెప్పినట్లు గ్రహించి బెదిరించి నిర్బంధించి నిజం కక్కించి వుంటాడు. అప్పుడు రాఘవేంద్రను బలవంతంగా ఇంటికి తీసుకెళ్ళి వుంటాడు. అతని ద్వారా లంచం తీసుకున్న మనిషి అసలు పేరు తెలుసుకుంటాడు...." అంది సీతమ్మ.

"తెలుసుకుని ఏం చేస్తాడు?" అంది రాజమ్మ.

"నువ్వే చెప్పు—" అన్నాడు వెంకన్న.

"ఏముంది—దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ-అంతే!" అంది రాజమ్మ.

వెంకన్న తల అడ్డంగా ఊపి—"కథంత సింపుల్ కాదు. పోగొట్టుకున్న డబ్బు రెండువేల చిల్లర కోసం అతను పదిహేను వేలుదాకా ఖర్చు చేయడానికి సిద్ధపడ్డాడు. అంటే అతనికి నమ్మకమైన సెక్రటరీ అవసరం ఎంతైనా

వున్నదన్న మాట!" అన్నాడు.

"బాస్!" అంది సీతమ్మ—"పోగొట్టుకున్న డబ్బు కోసం ఆయన ఎంత డబ్బైనా ఖర్చుచేయడానికి సిద్ధంగా వున్నాడంటే ఆ డబ్బు ఆయనకు అంత విలువైనదన్న మాట. బహుశా సెంటిమెంటల్ ఎటాచ్‌మెంట్ కావచ్చు—"

వెంకన్న ఆలోచనలో పడ్డాడు.

"సీతమ్మ చెప్పింది నిజమే బాస్! ఆ డబ్బు ఎవరికి చేరిందో ఆ మనిషికోసమే నరసింహం వెదుకుతున్నాడు. లంచం పట్టిన మనిషి గురించి ఆరా తీయడంలోని అంతరార్థమదేనేమో!" అంది రాజమ్మ.

వెంకన్న చటుక్కున లేచి నిలబడి-"వెరీ వెల్ సెడ్ రాజమ్మా!" అన్నాడు.

# 7

వెంకన్నను చూసి ముఖం ఇంత చేసుకుని—"మా వాడి ఆచూకీ అప్పుడే తెలిసిందాండీ—" అన్నాడు సూర్యనారాయణ.

"మీవాడికేం భయం లేదుకానీ చిన్న ప్రశ్న! కొద్ది నెలల క్రితం మీవాడికో పర్సు దొరికింది. అందులో రెండువేల ఆరువందల పద్నాలుగు రూపాయలున్నాయి. అందులో రెండువేలు మీరు రామరాజుగారికిచ్చి మీ వాడికి వుద్యోగం సంపాదించుకున్నారు. మిగతా డబ్బు ఏం చేశారు? మీవాడికి దొరికిన ఆ పర్సు ఇంకా ఇంట్లో వుందా?" అన్నాడు వెంకన్న.

ముందు కాస్త తటపటాయించినా సూర్యనారాయణ చివరకు నిజం చెప్పాడు. ఆ పర్సును వారు మహాలక్ష్మి అంశగా భావించి దేవుడి గదిలో మందిరంలో వుంచారట,

అవసరార్ధం రెండు వేల రూపాయలు మాత్రం తీసుకుని మిగతా డబ్బును అందులోనే ఉంచారుట.

"నాకా పర్సు కావాలి. నా పరిశోధనకు అది చాలా అవసరం. మీకు అంతే డబ్బుతో వున్న ఇంకో పర్సు నిస్తాను. వుంచుకోండి—" అన్నాడు వెంకన్న.

సూర్యనారాయణ కాపని నచ్చలేదు. ఆ పర్సుతో పాటు లక్ష్మికూడా తన ఇల్లు వదలి వెళ్ళిపోతుందని భయపడ్డాడు. వెంకన్న ఆయనకు నచ్చజెప్పి ఆ పర్సు తీసుకుని తన ఆఫీసుకు వెళ్ళిపోయాడు. ఆఫీసులో అతను ఆ పర్సునూ అందులోని డబ్బునూ పరీక్షించాడు. రెండింటిలోనూ వింత ఏమీ కనబడలేదు.

అయినా తన వెర్రిగానీ పర్సులోని డబ్బులో వింత ఏముంటుంది?

మరి నరసింహం ఇంత హడావుడి దేనికి చేస్తున్నట్లు?

వెంకన్న ఆలోచిస్తూండగా టెలిఫోన్ మ్రోగింది. అది రామరాజు దగ్గర్నుంచి! నరసింహం దగ్గర్నుంచి అతనికి ఫోన్ కాల్ వచ్చిందట. రాఘవేంద్ర ఏ నోట్లయితే తన కిచ్చాడో అవి ఏంచేసిందీ చెప్పమన్నాట్ట.

"ఏం చేశానని చెప్పావూ?" అన్నాడు వెంకన్న.

"ఖర్చు చేసేనని చెప్పాను...." అన్నాడు రామరాజు.

"నిజంగా ఖర్చు చేసేశావా?"

"లేదు-ఆ డబ్బు నా ఇనప్పెట్టెలో భద్రంగా వుంది...." అన్నాడు రామరాజు.

"ఖర్చు చేసేశానంటే నరసింహం ఏమన్నాడు?"

"ఓసారి నిట్టూర్చి ఫోన్ పెట్టేశాడు-" అన్నాడు రామరాజు.

"అయితే నేను మీ దగ్గరకొస్తున్నాను. ఆ నోట్లు నా క్కావాలి-" అన్నాడు వెంకన్న.

"ఎలా గుర్తుపడతారు?"-అన్నాడు రామరాజు ఆశ్చర్యంగా.

"గుర్తుపట్టడంలో కష్టమేముంటుంది? ఆ డబ్బంతా ఓ కట్టలా వుంటుంది కదా-"

"అలా లేదు వెంకన్నగారూ-ఈ డబ్బును నేను ఇనపెట్టెలో రహస్యపు టరలో దాస్తూంటాను. అందులో చిల్లరనోట్లు పడేయడమే కానీ కట్టలు కట్టివేయడం నాకు అలవాటు లేదు-" అన్నాడు రామరాజు.

వెంకన్న క్షణం ఆలోచించి-"ఆ నోట్లును నేను గుర్తుపట్టగలననుకుంటాను. మీ ఇంటికి వస్తాను. అభ్యంతరమా?" అన్నాడు.

"అభ్యంతర మెందుకు? సరికి సరే ఇచ్చి ఆ నోట్లు తీసుకు వెడతారుగా?" అన్నాడు రామరాజు.

వెంకన్న సమాధానంగా నవ్వేసి ఫోన్ పెట్టేసి వెంటనే బయల్దేరి రామరాజు ఇంటికి వెళ్ళాడు.

"అసలు కథ ఏమిటండీ-" అన్నాడు రామరాజు ఆశ్చర్యంగా.

"అదంతా తర్వాత చెబుతాను. మీ ఇనప్పెట్టె దగ్గరకు తీసుకెళ్ళండి నన్ను...." అన్నాడు వెంకన్న.

ఓ సారి రామరాజు ఇంట్లో పదివేలు పోయాయి. రెండు రోజుల్లో పరిశోధించి ఆ డబ్బు సంపాదించి రామరాజు కందజేశాడు వెంకన్న. అప్పట్నించీ వాళ్ళిద్దరికీ మంచి పరిచయం ఏర్పడింది. రామరాజు డబ్బు తీసుకుని వుద్యోగాలిప్పించగలవాడని వెంకన్నకు తెలుసు.

అప్పుడప్పుడు వెంకన్న అతని దగ్గరకు మనుషుల్ని కూడా పంపుతూంటాడు.

ఇద్దరూ ఇనప్పెట్టె దగ్గరకు వెళ్ళారు. రామరాజు రహస్యపు అరతీసి వెంకన్న ముందు పెట్టాడు. ఆ ఇనప్పెట్టె రహస్యం వెంకన్నకు పూర్తిగా తెలుసు. డబ్బు పోయినాక వెంకన్న తనకు తెలిసిన షాపుల్లో స్పెషల్ గా ఆర్డర్ చేసి ఈ పెట్టె తయారు చేయించాడు.

వెంకన్న అందులోని వందరూపాయల నోట్లను శ్రద్ధగా పరిశీలించసాగాడు. రామరాజు వెంకన్న ఉద్దేశ్యమేమిటో అర్థంకాక అతని వంకనే ఆశ్చర్యంగా చూడసాగాడు. వున్నట్లుండి వెంకన్న కళ్ళు మెరిశాయి. అతను వాటిలోంచి నోట్లు ఏరసాగాడు. కాసేపటికి అందులోంచి ఇరవై నోట్లు వేరే వచ్చాయి. వాటి సాన్నే వేరే ఇరవై నోట్లు వెంకన్న రామరాజుకిచ్చి—"అరలో చాలా డబ్బుంది-మీ ఆదాయం చాలా బాగున్నట్లుంది-" అన్నాడు.

"ఏదో మీ దయవల్ల-" అని నవ్వాడు రామరాజు.

వెంకన్న ఆ నోట్లు తీసుకుని తిన్నగా ఇంటికి వెళ్ళాడు. సీతమ్మకూ, రాజమ్మకూ వాటిని చూపించి— "ఈ నోట్లమీద ఏదో సందేశం వుంది. అదేమిటో మీరు తెలుసుకోవాలి—" అన్నాడు. వాళ్ళిద్దరూ ఆత్రుతగా వాటిని చూశారు.

ప్రతి నోటుమీదా ఏవో ఇంగ్లీషు అక్షరాలున్నాయి. వాటికి సరైన అర్థం రావడంలేదు.

సీతమ్మ ముందుగా ఆ నోట్లమీదున్న అక్షరాలన్నింటినీ ఓ కాగితంమీద రాసింది.

AD, AA, I, RA, AO, U, AD, A, AR, U, IT, N, M, IG, AL, ST, T, E, K, GI

"బాస్-వీటిల్లో ఏదో సందేశం వుందని మీరెందుకు భావిస్తున్నారు?—" అంది రాజమ్మ.

"నోట్లమీద సాధారణంగా ఎవరైనా సంతకాలు పెడుతూంటారు. అప్పుడప్పుడు అత్యవసర పరిస్థితుల్లో చిన్న చిన్న లెక్కలు చేస్తూంటారు. కానీ ఇలాంటి అక్షరాలు అరుదు. ఈ అక్షరాల్లో యేదో సందేశముండి వుండాలి. ఆ సందేశం నరసింహానికి చాలా ముఖ్యమైనదై వుండాలి. అందుకే రాఘవేంద్రపై ఆసక్తి చూపించాడు. అది నేనాయన మంచితనంగా భావించాను. ఇప్పుడు ఆ సందేశం నేను తెలుసుకోవాలి-" అన్నాడు వెంకన్న.

ఒకే దస్తూరితో ఇరవై నోట్లమీద అలాంటి ఇంగ్లీషు అక్షరాలు రాసి వున్నాయి. అవి సరిగ్గా ఇరవై నోట్లుండడమే తమ బాస్ అనుమానానికి అర్థాన్నిస్తోందని సీతమ్మ, రాజమ్మ గ్రహించారు. అయితే ఈ అక్షరాలలోంచి-సందేశాన్ని గ్రహించడం ఎలా?

కాసేపు ఆలోచించాక రాజమ్మ నవ్వింది-"ఈ అక్షరాల్లో సందేశముందని అనుమానించాలి కానీ అది గ్రహించడం ఎంత సేపు?"-అంది సీతమ్మ వంక చూసి.

"ఎలా?"

"వాటిని వరుస క్రమంలో పెట్టి చూడడమే!"

"ఆ క్రమం ఎలా తెలుస్తుంది?"- అంది సీతమ్మ.

"ఇంకా స్ఫురించలేదా నీకు? నోట్లను వరుసక్రమంలో పెడితే సరి...."

సీతమ్మ బుర్ర ఇంకా పనిచేయలేదు—"ఈ నోట్ల నంబర్లు వరుసక్రమంలో లేవే?"-అంది.

"నీ కీ వేళ యేమైంది? 6, 7, 8, 9 అని వుంటేనే వరుసక్రమం అవుతుందా? 7, 16, 23, 37, 410 కూడా వరుస క్రమమే అవుతుంది. చిన్న అంకె ముందు, ఆ తర్వాత దానికంటె పెద్ద అంకె....అలా ఎరేంజ్ చేసుకుంటూ వెడితే........?" అని నవ్వింది సీతమ్మ.

వెంటనే సీతమ్మ నాలిక్కొరుచుకుంది. కానీ క్షణాల మీద అక్షరాలను పేర్చింది.

U, AD, ST, I, U, AL, T, GI, A, K, AA, E, IT, IG, AD, N, AO, AR, M, RA

చదివి నిట్టూర్చింది రాజమ్మ. ప్రయత్నం ఫలించలేదు. ఇట్నించి అటు చదివినా అట్నించి ఇటు చదివినా అర్థవంతమైన వాక్యమేదీ తయారుకాలేదు.

"ఇదంత సింపుల్ కోడ్ కాదు. దీనర్థం తెలుసుకోవడం మనవల్ల కాదేమో-" అంది రాజమ్మ.

"అలాగే అనిపిస్తోంది-" అంది సీతమ్మ.

"మీ వల్ల కాలేదా?" అన్నాడు వెంకన్న.

సీతమ్మ తాము చేసిన ప్రయత్నాలు వివరించి ఆ కాగితం చూపించింది. ఆ అక్షరాలున్న కాగితాన్ని కాస్త తీవ్రంగా పరిశీలించాడు వెంకన్న. క్షణంలో అతని కళ్ళు మెరిశాయి- "వెరీగుడ్ మీరు చాలా బాగా ఆలోచించారు."

రాజమ్మ అతనివంక ఆశ్చర్యంగా చూసి - "సందేశం తెలిసిందా?" అంది.

"ఇంత స్పష్టంగావుంటే తెలియకేం చేస్తుంది? నోట్లను మీరు పెరిగే సంఖ్యలో అమర్చారు. తరిగే సంఖ్యలో అమర్చి చూడండి." అన్నాడు వెంకన్న.

"బాగానే వుంది. మేము అలాగా చూశాం. ఏం

తెలియలేదు.'' అంది రాజమ్మ.

''అలా కాదు. రాసింది అటూ ఇటూ చదవడం కాదు. నేను చెప్పిన క్రమంలో మళ్ళీ అక్షరాలు రాయండి.''

సీతమ్మ వెంటనే అలా చేసింది. ఆమెకు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు.

**RA, M, AR, AO, N, AD, IG, IT, E, AA, K, A, GI, T, AL, U, I, ST, AD, U.**

''రామారావునడిగితే ఆ కాగితాలు ఇస్తాడు.....'' అని చదివి....''మైగాడ్ ....ఇది తెలుగా?''అందిరాజమ్మ.

''అందుకే అటూ ఇటూ చదివినా మీకు సందేశం తెలియలేదు'' అని నవ్వి ''ఇప్పుడీ రామారావు ఎవరో తెలుసుకోవాలి....'' అన్నాడు వెంకన్న.

# 8

నరసింహం ఆ వుత్తరాన్ని మరోసారి చదువుకున్నాడు.

''డియర్ నరసింహం-నీ క్కావలసిన ఆ నోట్లు నా దగ్గరున్నాయి. హోటల్ ప్రకాష్‌లో ఇరవై ఏడో నంబరు గదికి రా. పదివేల రూపాయలు నాకివ్వు. రామరాజు దగ్గర్నుంచి సంపాదించిన ఆ ఇరవై వంద రూపాయల నోట్లు నీకు నేనిస్తాను....'' అని రాసివుందందులో.

నరసింహం తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. తనకానోట్లు అవసరమని ఎవరికి తెలిసింది? ఎలా తెలిసింది? ఉత్తరం రాసిన వ్యక్తి ఆ నోట్లు ఎలా సంపాదించాడు.

ఏది ఏమైనా తను రిస్కు తీసుకోవాలి! ఆ నోట్లను సంపాదించాలి. ఎట్టొచ్చి తను హోటల్ ప్రకాష్‌కి వెడుతున్నట్లు యెవ్వరికీ చెప్పకూడదు. ఒంటరిగా ఈ పని

సాధించుకు రావాలి!

ఆయన ఓ వందరూపాయల నోట్ల కట్టను జేబులో కుక్కుకుని కార్లో హోటల్ ప్రకాష్ చేరుకున్నాడు. ఇరవై ఏడో నంబరు గది చేరుకున్నాడు. తలుపు నెమ్మదిగా తోశాడు.

"ఎస్-కమిన్ అండ్ బోల్టు ది డోర్" అన్నమాటలు వినిపించాయి.

నరసింహం చుట్టూ చూశాడు. ఎక్కడా మనిషి కనబడలేదు. ఆయన తలుపు వేశాడు.

"పదివేల రూపాయలూ టీపాయ్‌మీద పెట్టు.... గుడ్.... పెట్టావు కదా? ఇప్పుడు టీపాయ్‌మీదున్న రైల్వే టైంటేబుల్‌లో నీకావలసిన నోట్లున్నాయి. తీసుకో-నీ డబ్బు వెనక్కు తీసుకుందుకు ప్రయత్నించావా రివాల్వర్ నీకు గురిపెట్టబడి వుంది. నిష్కారణంగా చచ్చిపోతావు. ఊఁ....దట్స్‌గుడ్....అదిగో నీ ముఖంలో వెలుగు....అవి నీకావలసిన నోట్లేగదా....మరి వెళ్ళు.... తలుపుతీసుకొని దగ్గరగా జేరవేసి వెళ్ళు. నన్ను తెలుసుకుందుకు ప్రయత్నించకు. ప్రమాదం. నువ్వు కొద్ది రోజులుగా చేస్తున్న హడావిడి గమనించి ఈ నోట్లు సంపాదించి నీకిచ్చాను. దట్సాల్. నేనో వ్యాపారిని. ఈ క్షణం తర్వాత నా గురించి మర్చిపో...."

నరసింహం ఆ మాటలు వింటూ ఆ ప్రకారం చేస్తూ ఆ గదిలోంచి బయటపడ్డాడు. ఆయనకప్పుడు ఆ వ్యక్తి గురించిన కుతూహలం లేదు. పదివేలు పోయాయన్న బాధ లేదు. తన నోట్లు దొరికాయి. ఎంతో విలువైన తన నోట్లు తనకు దొరికాయి.

ఆయన త్వరగా యిల్లు చేరుకున్నాడు. తన యింట్లో

నిర్బంధంలో ఉన్న రాఘవేంద్రనూ, సుందరాన్నీ వదిలి పెట్టాడు.

ఆ ఇద్దరూ వెళ్ళిపోయిన పదినిముషాలకు నరసింహానికి ఫోన్ వచ్చింది. "హలో!" అన్నాడాయన.

"నేను, రామారావుని మాట్లాడుతున్నాను...." అంది అవతలి కంఠం.

"రామారావెవరు?" అన్నాడు నరసింహం ఆశ్చర్యంగా.

"నేనే!" అన్న తర్వాత నవ్వు కూడా వినిపించింది.

"ఏ రామారావు?" అన్నాడు నరసింహం మరొక్కసారి.

"ఎంతమంది రామారావులు తెలుసు నీకు?" వెటకారంగా అంది అవతల కంఠం.

"నా ఎరికలో రామారావు అన్నవాడు లేడు. నా పేరు నరసింహం. నువ్వు పొరపాటున ఇక్కడికి ఫోన్ చేశావేమో-"

"నేనెప్పుడూ పొరపాటు పడను."

"అయితే నీ గురించి వివరంగా చెప్పు."

"అన్నీ నీకే తెలుసు. నేనేమీ చెప్పను! రాత్రి ఎనిమిది గంటలకు మరోసారి ఫోన్ చేస్తాను. అప్పటికి నేనెవరో గుర్తు వస్తే మళ్ళీ మనం మాట్లాడుకోవచ్చు." అంది అవతలి కంఠం

"హలో!" అని నరసింహం ఏదో మాట్లాడబోయాడు కాని అవతల క్లిక్‌మంది.

# 9

"నా ప్రయత్నాలు నేను చేశాను. నరసింహానికి రామారావు గురించి తెలిసినట్లు లేదు. ఆయన పరిస్థి

యసుల్లో ఆ పేరుగల వారెవ్వరూ ఉన్నట్లు లేదు. ఇంత వరకూ దొరకిన దానితో తృప్తిపడి ఈ కేసు విషయం ఇంతటితో మరిచిపోతే బాగుండుననిపిస్తోంది.” అన్నాడు వెంకన్న.

“మంచిదే మరి” అన్నారు రాజమ్మ, సీతమ్మ ఏక కంఠంతో.

“కానీ ఆ రామారావెవరో, ఆ నోట్లకోసం నరసింహం ఎందుకంత ప్రయత్నం చేశాడో తెలుసుకోకుండా వదిలేస్తే నాకు నిద్రపట్టదే మరి!” అన్నాడు వెంకన్న.

“మీకు నిద్ర పట్టకపోయినా పరవాలేదు. పెళ్ళయిన వారు. ఆ వివరాలు తెలికుండా ఉంటే మాకూ నిద్ర పట్టదు మరి” అంది రాజమ్మ.

“ఈ కేసు పేరు చెప్పి యిప్పటికి చాలా డబ్బు ముట్టింది. కాబట్టి కాస్త దేశసేవ చేద్దాం....”

సీతమ్మ గంభీరంగా ముఖం పెట్టి “మనం పని చేసే కేసులు రెండు రకాలు. ఒకటి డబ్బుకోసం. రెండు దేశంకోసం. నరసింహం దగ్గర డబ్బుతీసుకుని దేశంకోసం పనిచేయడం వరకూ బాగానే ఉంది. కానీ అందువల్ల నరసింహానికి ఇబ్బంది కలిగితే?” అంది.

“దేశం ఫస్టు. మొహమాటాలు నెక్స్ట్....” అన్నాడు వెంకన్న.

“అయితే ఏం చేయాలో ఆజ్ఞాపించండి!” అంది రాజమ్మ.

“నేను రెండుసార్లు ఫోన్ చేసికూడా ఆ రామారావెవరో తెలుసుకోలేకపోయాను. నువ్వు ప్రయత్నించి

తెలుసుకోగలవా?" అన్నాడు వెంకన్న.

"అసలా రామారావనేవాడున్నాడని మీరెందుకు భావిస్తున్నారు? మొత్తం అందులో ఉన్నదంతా కోడ్ ఏమో?" అంది సీతమ్మ.

"నీ పాయింటు చాలా బాగుంది. కానీ అలా అనుకోవడం మనం కేసులో ముందడుగు వేయడానికి ఎంత వరకూ సహకరిస్తుందో చెప్పు...." అన్నాడు వెంకన్న.

"కేసులో ముందడుగు వేయడంకంటే ఆ వేసే ముందడుగు తప్పుదారి పట్టకుండా ఉండడం ముఖ్యం" అంది సీతమ్మ.

"నిజమే" అని ఆలోచనలో పడ్డాడు వెంకన్న.

సరిగ్గా అప్పుడే టెలిఫోన్ మ్రోగింది. "హలో! డిటెక్టివ్ వెంకన్న అసిస్టెంట్ రాజమ్మను మాట్లాడుతున్నాను...." అంది రాజమ్మ. అంటూనే ఆమె ఫోన్ వెంకన్నకు అందించింది.

ఫోన్ చేసింది అజంతా హోటల్ ప్రొప్రయిటర్ శంకరన్. ఆయన యింట్లో చోరీ జరిగిందట. అర్జంటుగా రమ్మనమనీ, పోలీసులకీ విషయం చెప్పవద్దని అంటున్నాడాయన.

వెంకన్న హడావుడిగా బయల్దేరి వెళ్ళాడు.

"కొంప మునిగిపోయింది సార్. ఒకటికాదు. రెండు కాదు. లక్షరూపాయలు పోయాయి" అంటూ గుండెలు బాదుకున్నాడు శంకరన్.

వెంకన్న అతన్ని ఓదార్చి ముందు వివరాలన్నీ ఆరా తీశాడు.

శంకరన్ ఇనప్పెట్టెకు చాలా రక్షణ లున్నాయి. ముందుగా నంబర్స్‌లో ఒక వాచ్ ఉంది. ఆ నంబర్స్‌ను

ఒక ప్రత్యేకమయిన క్రమంలో ఉంచి ఆ వాచ్ తిప్పితే అప్పుడు తాళం పనిచేస్తుంది. తాళంలో తలుపు తీశాక లోపల ఇంకో తలుపు ఉంది. దానికీ అదే ఏర్పాటు. ఈ రెండు విషయాల్లో ఏం పొరపాటు జరిగినా బర్గలర్ అలారం మ్రోగుతుంది. రాత్రి బర్గలర్ అలారం మ్రోగ లేదు. ఇనప్పెట్టె తలుపులు వేసినవి వేసినట్లే వున్నాయి. ఉదయం చూసుకుంటే డబ్బు తక్కువైంది.

"ఎవరో నమ్మకస్థులే తీసి ఉండాలి!" అన్నాడు వెంకన్న.

"అవును. కాని యింట్లో నా భార్య, కూతురు తప్ప యింకెవ్వరూ లేరు. అవకాశం కూడా వాళ్ళకు తప్ప మరెవ్వరికీ లేదు. కానీ యింత డబ్బు వాళ్ళేం చేసుకుం టారు? వాళ్ళకు నావల్ల ఏ లోటూ జరగడంలేదు. ఏ పరిస్థితుల్లోనూ వాళ్ళను అనుమానించలేను...." అన్నాడు శంకరన్.

"చాలా దురదృష్టం. మీరు మరికాసిని వివరాలందజేస్తే కానీ నేను మీకు సాయపడలేను...." అన్నాడు వెంకన్న ఆలోచిస్తూ.

"ఇంక నేనివ్వగలిగిన సమాచారమేముంది?" అన్నాడు శంకరన్ ఏడుపు ముఖం పెట్టి.

"పోలీసుల్ని పిలవకుండా నన్ను పిలిచారు. కారణం?" అన్నాడు వెంకన్న.

"నల్లధనం-మీకు తెలియందేముంది?" అన్నాడు శంకరన్.

"చూస్తూ చూస్తూ నల్లధనాన్నెవరూ ఇనప్పెట్టెలో పెట్టుకోరు. ఎప్పుడైనా పోలీసులు రెయిడ్ చేస్తే పట్టు బడతామన్న భయముంటుంది. కాబట్టి అది నల్లధనం

కాదు. అదీకాక మీ జోంట్లకు లక్షరూపాయల నల్లధనం ఓ లెక్కలోదికాదు." అన్నాడు వెంకన్న.

"అనవసరంగా నన్నుమానించకండి మీకేమిసందేహా లున్నా అడగండి. ఆ డబ్బు నాకు చాలా ముఖ్యం. ఇది దొంగ చేసినపనికాదు. నా శత్రువు లెవరో చేసినపని. ఈ డబ్బుపోతే నా ప్రాణాలు పోతాయి." అన్నాడు శంకరన్.

"ముందుగా ఓసారి నన్ను మీ వాళ్ళతో మాట్లాడ నివ్వండి" అన్నాడు వెంకన్న.

శంకరన్ భార్య మహాలక్ష్మి దగ్గర్నుంచి వెంకన్నకు పనికొచ్చే సమాచారమేమీ దొరకలేదు. శంకరన్ కూతురు మాధవి మాత్రం "మీరు నన్నాట్టే ప్రశ్నించనవసరం లేదు. ఆ డబ్బు నేనే తీశాను" అంది.

"ఎందుకని?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యపోయి.

"నేను రజనీకాంత్ అనే అతన్ని ప్రేమించాను. నాన్నకు అతనంటే ఇష్టం లేదు. ఇంట్లోంచి ఓ లక్ష రూపాయలు తీసుకుని అతన్తో వెళ్ళిపోవాలనుకున్నాను. రాత్రి ఆ డబ్బు తీశాను. ఉదయం నాన్న లబోదిబో మంటున్నాడు. అదాయన డబ్బు కాదట. ఎవరోయిచ్చా రట. ఎవరికో యివ్వాలట. సాయంత్రంలోగా ఆ డబ్బు దొరక్కపోతే ఆయన ప్రాణాలు పోతాయట. ఈ వివ రాలు తెలియగానే నాకు భయంవేసింది. కానీ నేనే తీశానని చెప్పడానికి భయం వేసింది. ఇంకమీదట దొంగ తనం యెప్పుడు జరిగినా నన్నే అనుమానిస్తారు. ఆ డబ్బు నేను మీకిస్తాను. నాన్నకు అందజేయండి. తెలివితక్కు వగా దొంగతనం చేశాను. ఇందులో నా పేరు బయట పడనీకండి" అంది మాధవి.

"నాతో ధైర్యంగా నిజం చెబుతున్నావు. నేను నీ గురించి మీ నాన్నకు చెబితే?" అన్నాడు వెంకన్న.

"చెబితే కొంప మునిగేదేమీ లేదు. మీరు చాలా మంచివారనీ, గొప్పవారనీ విన్నాను. అందుకే మిమ్మల్ని నమ్మి ఈ డబ్బు మీకు అప్పజెపుతున్నాను...." అంటూ మాధవి పరుపు అడుగునుంచి వందరూపాయల నోట్లకట్టలు సరిగ్గా పదితీసి వెంకన్నకు అందించింది. వెంకన్న ఆ నోట్లను చూసి ఆశ్చర్యపడ్డాడు.

అవన్నీ పాత నోట్లు. ప్రతి కట్టలోనూ వందనోట్లున్నాయి. వాటిపైన తెల్లగా కాళీ వున్నచోట ఇంగ్లీషు అక్షరాలున్నాయి. అవి తనకు పరిచితమైనదే. సరిగ్గా ఇలాంటివాటికోసమే నరసింహం రాఘవేంద్రను వేటాడడానికి ప్రయత్నించాడు.

వెంకన్న ఆ నోట్ల కట్టల్ని జేబులోకి తోసేసి మళ్ళీ శంకరన్‌ని కలుసుకుని-"ఇటీవల నగరంలోకి ఓ దొంగ వచ్చాడు. ఎటువంటి ఇనప్పెట్టెనైనా తెరవగల సామర్థ్యం వాడికుంది. వాడు నాకు తెలుసు. వాడు దోచేది నల్లధనాన్నే కాబట్టి నేనూ అట్టే పట్టించుకోలేదు. వాడ్ని నేను విచిత్ర పరిస్థితుల్లో పట్టుకొని వదిలేశాను. నీ డబ్బు వాడే తీసివుంటాడు. ఇంకో గంటలో మీకు ఫోన్ చేసి చెబుతాను. వాడిదగ్గర డబ్బు దొరికితే నేను మీకు సాయపడగలను. ఫీజు ఏమాత్రం ఇవ్వగలరు?" అన్నాడు.

"డబ్బు దొరికితే ఎంతైనా యిస్తాను. మీరడగడమే తరువాయి...." అన్నాడు శంకరన్.

వెంకన్న తనింటికి వెళ్ళిపోయాడు. ఆ నోట్ల కట్టలను పరిశీలించి చూశాడు. అన్నింటిమీదా ఇంగ్లీషు అక్షరా

లున్నాయి. ఇదివరలో తను నరసింహాని కిచ్చిన నోట్లమీద ఉన్న విధంగానే ఆ అక్షరాలున్నాయి. ప్రతి కట్టలోనూ అయిదు సందేశాలు. అన్నింటి అర్థమూ ఒకటే! "రామా రావు నడిగితే ఆ కాగితాలు ఇస్తాడు."

దీని భావమేమి?

ఈ సందేశానికి అర్థమేమీ లేదు. ఇది ఎవరికో కోడ్ గా ఉపయోగపడుతోందన్న మాట?

ఎవరికి?-యెందుకు?

ఇందులో శంకరన్ పాత్ర ఏమిటి?

వెంకన్న విషయాన్ని కాసేపు తన అసిస్టెంట్సుతో చర్చించాడు. ఉపయోగపడే విషయమేదీ తేలకపోయినా శంకరన్ ద్వారా ఈ మిస్టరీ ఛేదించాలని అనుకున్నాడు. కొంతసేపు ఆగి చెప్పిన ప్రకారమే వెంకన్న శంకరన్ కు ఫోన్ చేసి డబ్బు దొరికిందనీ, అందుకు ప్రతిఫలంగా రెండు వేలు కావాలనీ చెప్పాడు. ఉరకలు పరుగులమీద శంకరన్ వచ్చి డబ్బిచ్చి తన డబ్బు తీసుకుని వెళ్ళి పోయాడు. వెంకన్నను శంకరన్ ఇంకేమీ ప్రశ్నలు వేయ లేదు. వెంకన్న కూడా శంకరన్ ని ఇంకేమీ అడగలేదు.

ఇప్పుడు వెంకన్నను వేధిస్తున్న సమస్య ఒక్కటే! శంకరన్ కీనోట్లు యెవరిస్తున్నారు? ఈ నోట్లను శంకరన్ యెవరికిస్తున్నాడు? ఈ నోట్లను యెవరు, యెందుకు వాడు తున్నారు?

వెంకన్న శంకరన్ మీద కన్ను వేశాడు. రెండు రోజులపాటు ఆయన్ను నీడలా వెంటాడాడు. అనుమానా స్పదమైన విశేషాలేమీ తెలియలేదు. చాలా మామూలుగా ఉంది శంకరన్ ప్రవర్తన.

వెంకన్నకు మతిపోతున్నట్లుంది. దోషం లేనట్లో తనకు

తెలుసు. కాని వారు తలపెట్టిన దోషం తనకు తెలియదు. వాళ్ళు తన కళ్ళముందే మసలుతూ తనకు పట్టుబడడం లేదు. నిర్భయంగా తన సాయం తీసుకుని కూడా తమ రహస్యాలు దాచగలుగుతున్నారు. ఇదంతా యెలా సాధ్యపడుతోంది?

నరసింహం, శంకరన్-వీళ్ళిద్దరూ తనకు తెలిశారు. ఏదో సంస్థ తరఫున ఇద్దరూ పనిచేస్తున్నారు. వాళ్ళెంత తెలివిగా పనిచేస్తున్నారంటే వాళ్ళిద్దరూ కలుసుకోగా తానెప్పుడూ చూడలేదు.

నిస్పృహలో ఈ కేసును మరచిపోదామా అనికూడా వెంకన్న అనుకున్నాడు కానీ అది తన వృత్తికే సవాల్ అనిపించింది-"ఎవరూ ఫీజు యివ్వడంలేదు కాబట్టి నేను ఈ విషయం శ్రద్ధగా పనిచేయడంలేదు. నేను పూర్తిగా డబ్బుమనిషినై పోయానా? డబ్బు లభిస్తే తప్ప ఏ కేసునూ సరిగా పరిశోధించలేనా?" అని వెంకన్న బాధపడ్డాడు. ఈ బాధ కలిగేక అతనిలో పట్టుదల పెరిగింది. బుర్రకు మరింత పదును పెట్టాడు.

శంకరన్ హోటల్ ప్రొప్రయిటర్. అతని హోటల్ అజంతా ఆ వూళ్ళో బాగా పేరున్నది. శంకరన్‌తో వ్యవహారాలు నడిపేవారు స్వయంగా ఆయన్ను కలుసుకో నవసరంలేదు. అజంతా హోటల్ మేనేజర్ అశోక్ కుమార్ ఉన్నాడు. అతన్ని ఊరి పెద్దలు చాలామంది కలుసుకుంటూంటారు. అశోక్‌కుమార్ శంకరన్‌ని కలుసు కుంటాడు. ఇంతకాలమూ తను అశోక్‌కుమార్, శంక రన్‌ల మధ్య లావాదేవీలు చూశాడు కానీ అశోక్ కుమార్ ఇతరులతో పెట్టుకునే లావాదేవీల విషయం పట్టించుకోలేదు. ఈ విషయం స్ఫురించగానే వెంకన్న

అశోక్‌కుమార్ మీద కన్ను వేశాడు.

సుమారు నాలుగు రోజుల నిఘా అనంతరం వెంకన్న కృషి ఫలించింది.

# 10

వెంకన్న మారువేషంలో అజంతా హోటల్‌లో బస చేశాడు. ఎప్పుడూ అశోక్‌కుమార్‌ని ఓ కంట కని పెడుతూండేవాడు. ఒక రోజున ఒక మనిషి వచ్చి-"నా దగ్గర ఓ చెక్ వుంది డబ్బు మార్చుకుందుకు టైమ్ లేదు చెక్కు తీసుకుని డబ్బిస్తారా" అని అడిగాడు.

"ఎంత?" అన్నాడు అశోక్‌కుమార్.

"రెండువేలు" అన్నాడా మనిషి.

అశోక్‌కుమార్ ఒకక్షణం ఆలోచించి-"వన్ పర్సెంట్ కమిషన్ అవుతుంది. ఇరవై రూపాయలు యివ్వండి-" అన్నాడు.

ఆ మనిషీ చెక్కుతోపాటు ఇరవై రూపాయలు యిచ్చాడు. అశోక్‌కుమార్ అతనికి వందరూపాయ నోట్లు ఇరవై తీసి యిచ్చాడు. ఆ మనిషి వాటిని జేబులో పెట్టుకున్నాడు.

ఈ దృశ్యం వెంకన్న కళ్ళబడింది. అతను ఆ మనిషిని అనుసరించసాగాడు.

ఆ మనిషి తిన్నగా ఓఇంటికి వెళ్ళాడు. అతను లోపలకు వెళ్ళిన అయిదు నిమిషాలకు వెంకన్న తనూ ఆ ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు.

ఆ మనిషి వచ్చి తలుపు తీసి వెంకన్నను చూసి "ఎవరు మీరు?" అని అడిగాడు.

"రామారావు నడిగితే ఆ కాగితాలు ఇస్తాడు." అన్నాడు వెంకన్న.

"మీరేమంటున్నారో నాకర్థం కావడం లేదు." అన్నాడామనిషి ఆశ్చర్యంగా.

"నన్నోసారి లోపలకు రానిస్తారా?" అన్నాడు వెంకన్న చనువుగా.

"ష్యూర్" అన్నా డతను.

వెంకన్న లోపల అడుగుపెట్టి "ఇంట్లో ఇంకెవరైనా ఉన్నారా?" అన్నాడు.

"లేరు" అన్నా డామనిషి.

"వెరీగుడ్!" అని "మీ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడు వెంకన్న.

"జనార్దనం" అని "ఇంతకూ మీ గురించి చెప్పలేదు" అన్నాడతను.

"రామారావు నడిగితే ఆ కాగితాలు ఇస్తాడు." అన్నాడు వెంకన్న నవ్వి.

"అర్థం కాలేదు" అన్నాడు జనార్దనం ఆశ్చర్యంగా.

"అజంతా హోటల్లో మీరు తీసుకున్న ఆ ఇరవై వంద రూపాయల నోట్లూ పైకి తీయండి...." అని "అలా అనుమానంగా నా వంక చూడకండి నా మాటలు మీ కర్థమయ్యేలా చేస్తాను...." అన్నాడు వెంకన్న.

ఏమనుకున్నాడో జనార్దనం ఆ డబ్బు పైకి తీసి పట్టుకుని "చెప్పండి!" అన్నాడు.

వెంకన్న వంగి ఆ నోట్లను చూశాడు. ఊహించినట్లుగానే ఇంగ్లీషు అక్షరాలున్నాయి.

"ఒక్కసారి ఆలాగివ్వండి. రెండువేలకోసం నేను హత్యలు చేయను. పారిపోను. ఆ డబ్బు మీదే-మీదగ్గరే ఉంటుంది." అన్నాడు వెంకన్న.

జనార్దనం మారుమాటాడకుండా ఆ డబ్బు వెంకన్న

కిచ్చాడు. వెంకన్న వాటిని త్వరగా ఒక క్రమంలో సర్ది-
"ఇప్పుడు ఈ నోట్లమీద రాసివున్న ఇంగ్లీషు అక్షరాలను వరుసగా కలిపి చదవండి...." అన్నాడు.

జనార్దనం తడుముకుంటూ నెమ్మదిగా- "రామారావు నడిగితే ఆ కాగితాలు యిస్తాడు." అని చదివి ఆశ్చర్యపడి "చాలా విచిత్రంగా ఉందే వీటిమీద ఇలా రాసి వుంటుం దని మీకు ముందే యెలా తెలుసు? ఈ నోట్లు తయారు చేస్తున్నది మీరేనా?" అన్నాడు.

వెంకన్న అతడి ముఖంలోని ఆశ్చర్యానికి వింతపడ్డాడు. తెలిసీ తెలియనట్లుగా జనార్దనం నటిస్తున్నాడని అతను అభిప్రాయపడ్డాడు కానీ అది నిజం కాదనిపిస్తోంది. "నా గురించి మీకు తర్వాత చెబుతాను. ఈ నోట్లు మీరు ఎందుకు తీసుకుంటున్నారో నాకు చెప్పండి!" అన్నాడు.

"చెప్పకపోతే?" అన్నాడు జనార్దనం.

"చూడండి మిస్టర్ జనార్దనం! నేనొక ప్రయివేట్ డిటెక్టివ్‌ను. పేరు వెంకన్న. నా ఆసక్తికొద్దీ ఈ కేసు పరిశోధిస్తూ ఇంతవరకూ వచ్చాను. కొన్ని ఆధారాలు దొరికినా ఆ వ్యక్తులు నా క్లయింట్స్ కావడంతో వారి నిబ్బంది పెట్టకూడదన్న ఆశయంతో అక్కడే ఆగి పోయాను. ఇన్నాళ్ళకు నా క్లయింట్ కాని వ్యక్తి ఆధా రంగా దొరికాడు. నేను మిమ్మల్ని వదిలిపెట్టను. నన్ను తప్పించుకోవాలని ప్రయత్నించారా అప్పుడు మీకు పోలీ సులే శరణ్యమవుతారు. ఆలోచించుకోండి."

డిటెక్టివ్ వెంకన్న పేరు వినగానే జనార్దనం తేలి కగా నిట్టూర్చాడు. "ఇందులో మీ దగ్గర దాచవలసిన దేమీ లేదు. ఈ రెండు వేల రూపాయలనూ నేను అయిదు లక్షలకు కొనుక్కున్నాను."

వెంకన్న ఉలిక్కిపడి "వ్హాట్....అయిదు లక్షలా" అన్నాడు.

"అవును సార్....అయిదు లక్షలు...." అన్నాడు జనార్దనం.

"కాస్త వివరంగా చెప్పండి!" అన్నాడు వెంకన్న ఆత్రుతగా.

"మా చుట్టుపక్కల పది ఊళ్ళల్లో పరిశోధించిఆయిల్ అండ్ నేచురల్ గాస్ కమిషన్ వారు ఓ విశేషం కని పెట్టారు. పెట్రోలు అక్కడ విరివిగా లభిస్తుందట. మాకు పంట చేలో బంగారం పండుతోంది. గవర్నమెంటు వారిచ్చే కాంపెన్సేషన్ మాకు కూడు పెట్టదు. కాబట్టి మేము ఓ మంత్రిగారిని పట్టుకున్నాం. ఓ అయిదులక్షలిస్తే ఈ విషయం కాగితాల కెక్కకుండా చేస్తాననీ, రిపోర్టు మార్పించేస్తాననీ, చెప్పాడాయన. అయితే ఇందుకు చాలా పెద్ద యేర్పాటుంది.

డబ్బు మేము రహస్యంగా మంత్రిగారికి సమర్పించు కున్నాక ఆయనో చెక్కు ఇస్తారు. ఆ చెక్కును అజంతా హోటల్లో యిచ్చి ఈ రెండువేలూ తీసుకోవాలి. ఈడబ్బు రసీదులాంటిదన్నమాట. దీనిమీద ఉన్న కోడ్ గురించి నాకు తెలియదుగానీ ఈ నోట్ల నెంబర్లు మాత్రం ముందు గానే అసలు పార్టీకి చేరతాయి. నేనీ డబ్బును గవర్న మెంటు డిపార్టుమెంట్లో పని చేస్తున్నతనికిస్తే అతనిది చూసుకుని పని మాకు సానుకూలం చేస్తాడు. ఈ డబ్బు మీద పదిఊళ్ళ భవిష్యత్తు ఆధారపడి ఉంది" అన్నాడు జనార్దనం.

వెంకన్న ఆశ్చర్యంగా ఈ కథంతా విని "దేశంలో అవినీతి ఈ స్థాయికి చేరుకుందా?" అన్నాడు.

"అవును సార్ తప్పు మాలోనూ ఉంది వాళ్ళలోనూ ఉంది. పెట్రోలు పడితే దేశానికి లాభంట. దేశం లాభం సంగతి నాకు తెలియదు. పచ్చగా ఉన్న మా పది గ్రామాల వాళ్ళూ ఈ దెబ్బతో అడుక్కుతినాలి. అందుకే చందాలు వసూలు చేసి అయిదు లక్షలు సంపాదించాం."

వెంకన్నకు రహస్యం అర్థమైపోయింది. ఎంతో రహస్యంగా, పకడ్బందీగా కొనసాగుతున్న ఈ అవినీతిని కొనసాగిస్తున్న ప్రజల ఓట్లపై ప్రభుత్వంలోకి వచ్చిన ప్రజానాయకులే!

నరసింహం తను పోగొట్టుకున్న రెండువేల రూపాయలకోసం ఏ అయిదు లక్షలో ఖర్చుపెట్టి ఉంటాడు. బహుశా ఆయనకు యేదైనా కొత్త పరిశ్రమ స్థాపించడానికి లైసెన్సు లాంటిది దొరికి ఉంటుంది. తను ఖర్చుపెట్టిన లక్షలకు రసీదుగా లభించిన ఆ రెండువేలూ పోవడంతో ఆయన అమితంగా కలవరపడ్డాడు. అవి సంపాదించడానికి నానాఅవస్థా పడ్డాడు. ఆ డబ్బు దొరకగానే ఇతర విషయాలేవీ పట్టించుకోలేదు.

ఇప్పుడు తనేం చేయాలి? ఈ నేరాన్ని బహిర్గతం చేయాలా?

ప్రజలు ప్రభుత్వానికి లంచమిస్తున్నారు. ప్రభుత్వం ప్రజలవద్ద లంచం తీసుకుంటోంది. లంచం చట్టరీత్యా నేరం. ఆ నేరాల్ని పరిశోధించడానికి పోలీసులున్నారు. ఆ పోలీసులు ప్రభుత్వోద్యోగులు. ఆ ప్రభుత్వం అవినీతిపరుల చేతిలో ఉంది. ఆ అవినీతిపరులను పదవిలోకి పంపిస్తున్నది సామాన్య ప్రజలు....ఇదొక విషవలయం!

తనిప్పుడు యెవరిమీద యెవరికి ఫిర్యాదు చేస్తాడు?

నేరస్థుడు బలవంతుడు. అతడే ప్రభువు. చట్టం అతడి చేతిలో ఉంది. అతడికి ప్రజల మద్దతు ఉంది. అతన్ని తనేమీ చేయలేడు.

ఇంకెప్పుడూ యెవరూ అడగనిదే ఏ కేసులోనూ అడుగు పెట్టను. ఇది నిర్ణయం కాదు. శపథం" అనుకున్నాడు వెంకన్న.

—: సమాప్తం :—

# లాల్ & జాన్

# గోడ దూకిన హంతకి

## 'సికిందర్'

జాన్ ఫోన్‌లో మాట్లాడి, రిసీవర్ పెట్టేసి, సిగరెట్ వెలిగించి లాల్ వైపు తిరిగి అన్నాడు: "కావేరి ఫైనాన్సింగ్ కంపెనీ ప్రొప్రయిటర్ మిస్టర్ జమునా రావు మాట్లాడాడు. అతని కుమారుడు కన్పించడం లేదట. ఉదయం పదకొండు గంటలకు ఆఫీసునుంచి వెళ్ళాడట. ఇప్పటివరకూ రాలేదు. బ్యాంకులో పెద్ద మొత్తంలో డబ్బు అదృశ్యమైందట. ఈ కేసు తీసుకోమంటున్నాడు. నువ్వేమంటావు?"

లాల్ సూటిగా చూశాడు: "ఈ ఏజెన్సీ కేసులు ఫోన్ కాల్స్‌మీద తీసుకోదు."

"ఆ విషయం చెప్పాను. వెంటనే బయలుదేరి వస్తానన్నాడు. ఇంకా పూర్తి వివరాలు చెప్పలేదు కేసు తీసుకోవడానికి."

"వెల్ కుమారుడు కన్పించనంతమాత్రాన కంగారు పడవలసిన అవసరమేమిటి? డబ్బుతో పారిపోయి నాలుగు

రోజులు జల్సాగా గడిపి రావడం కొందరి హాబీ-"

"కావచ్చు. కానీ-కుమారుడికి వివాహమై ముచ్చటగా కాపురం చేస్తున్నాడట. దుర్వ్యసనాలు లేవు. మరి డబ్బుతో పారిపోవడంలోని ఆంతర్యం-"

"దుర్వ్యసనాలు లేకపోతే మరేదైనా కారణం లేని సంఘటన వుండదు."

"అవును. మొన్న మిస్ రీటా సున్నటి భుజాల్ని చుంబిస్తేనే కదా ఆమె చేతి వేళ్ళు అయినా నా చెంప మీద నాట్యం చేశాయి!"

లాల్ ముఖం ఎర్రబడింది: "యెప్పుడు? డామిట్, జాన్! నువ్వు గర్ల్ ఫ్రెండ్స్‌ని మర్చిపో! ఇలాగే కొన సాగితే ఇప్పుడే నీ గర్ల్ ఫ్రెండ్స్‌తో గోవా వెళ్ళిపో! నేను కాషాయ వస్త్రాలు ధరించి హరిద్వార్-"

ద్వారం దగ్గర అలికిడయింది.

జాన్ వెనక్కి తిరిగిచూసి, "కమిన్" అన్నాడు.

సుమారు అరవై ఏళ్ళు వయసుగల వ్యక్తి లోనికి వచ్చాడు.

సాయంత్రం 5 గంటలై వాతావరణం చల్లబడ్డా, అతని దేహమంతా విపరీతంగా చెమట పడుతోంది. తల మీద చాలావరకు వెంట్రుకలు లేవు. గోధుమ రంగు కళ్ళలో ఆందోళన వుంది. అంత వయసులోనూ అతను తెల్లటి ప్యాంట్, షర్టులో ఆరోగ్యంగా వున్నాడు.

అతను వచ్చి టేబిల్ దగ్గర కూర్చున్నాడు.

"మిస్టర్ లాల్, మీమీద విశ్వాసంతో మీ సహాయం కోరుతున్నాను. సాధారణంగా ఏదైనా విపత్కర పరిస్థితి ఏర్పడినప్పుడు ప్రజలు పోలీసుల దగ్గరికే వెళ్తారు. దానివల్ల అంతరంగమంతా బహిరంగ మవుతుందనీ,

పుకార్లు బయలుదేరుతాయనీ, ప్రచారం జరుగుతుందనీ విస్మరిస్తున్నారు. డిటెక్టివ్‌లు అందుబాటులో వుండి, వారి సేవల్ని వినియోగించుకోనకపోవడం మూర్ఖత్వం.

"నేను ప్రచారాన్ని సహించను. ఎలాటి సమస్య అయినా గుట్టుచప్పుడు కాకుండా సమసి పోవాలి. అందుకు పోలీసు జోక్యం వుండకూడదు. అందుకే మీ దగ్గరకొచ్చాను.

"నా మాటలవల్ల నా సమస్య ఎంత రహస్యంగా వుండాలో అర్థమైందనుకుంటాను?"

లాల్ తలూపాడు.

"అర్థమైంది. అయితే ఒక విషయం; ఈ దేశంలో ఇంకా డిటెక్టివ్‌లకు ఆదరణ లేదు. వున్న కొద్ది ఏజెన్సీలు సామాన్యుల అందుబాటులో లేవు. అధిక లాభాపేక్షతో మీలాటి ధనికులకే పరిమితమయ్యాయి. అఫ్‌కోర్స్, ప్రచారం జరిగేది కూడా మీలాటి ధనికులకే. ధనికులైనా, సామాన్యులైనా, రహస్యాలు దాచడంలో మాది అందవేసిన చేయి. మీరిక నిస్సందేహంగా సమస్య ఏమిటో చెప్పండి."

జమునారావ్ భారంగా నిట్టూర్చి, గొంతు సవరించుకుని అన్నాడు: "మిస్టర్ లాల్, ఇందాక ఫోన్‌లో జాన్‌కు విషయం చెప్పాను. ఈ వ్యవహారంలో పోలీసు జోక్యం అనవసరం. ఎంతో అవసరమనుకుంటే తప్ప వాళ్ళ సహాయం కోరకండి!

"మీరు బాగా ఆలోచించి, ఈ వ్యవహారంలో వాళ్ళెక్కడ అడుగు పెట్టాలో సరిగ్గా అక్కడే పెట్టనివ్వండి.

"ఈ వుదయం నా కుమారుడు దేవరాజ్ బ్యాంకు

నుండి పాతికవేలు డ్రా చేసుకొని ఎక్కడికో వెళ్ళి పోయాడు. ఇంతవరకు జాడలేదు. ఏం జరిగిందో నాకంతు బట్టడంలేదు. చెక్కు నేనే వ్రాసిచ్చాను. అతను తరచు బ్యాంకునుండి డబ్బు తెస్తుంటాడు. కానీ ఎన్నడూ ఇలా జరగలేదు.

"మిస్టర్ లాల్, నాకో భయంకరమైన అనుమానం వుంది. దేవరాజ్ డబ్బుతో అలా అదృశ్యమెయ్యడం వల్ల ఏదో కీడు జరిగింది! రోజులు బాగా లేవు. పట్టపగలే సిటీలో దోపిడీలు జరుగుతున్నాయి. ఒకవేళ దేవరాజ్ ని ఎవరైనా...."

"అతను బ్యాంక్ కు నడిచివెళ్ళాడా?"

"స్కూటర్ మీద వెళ్ళాడు. మా ఆఫీసు గన్ ఫౌండ్రీలో వుంది. బ్యాంకు తిలక్ రోడ్ లో వుంది. అతను వెళ్ళిన గంటవరకూ తిరిగి రాకపోతే బ్యాంక్ కు ఫోన్ చేశాను. అరగంట క్రితమే వెళ్ళిపోయాడని వాళ్ళు చెప్పారు. మరో అరగంట నేను ఎదురు చూశాను. రాలేదు. నాకు కంగారు ఎక్కువై బ్యాంక్ కు మనిషిని పంపాను. స్కూటర్ అక్కడే తాళంవేసి వుంది. కానీ ముందు టైరులో గాలిలేదు. నా మనిషి డూప్లికేట్ తాళం తీసికెళ్ళి గాలి నింపుకొని తెచ్చాడు."

"గాలి మళ్ళీ లీక్ అయిందా?"

"లేదు. ఏమాత్రం తగ్గలేదు ఇంతవరకూ."

"అంటే పంక్చర్ కాలేదన్నమాట. ఇంకా చెప్పండి."

"స్కూటర్ లో గాలిపోతే, దేవరాజ్ ఎవర్నో లిఫ్ట్ అడిగితే, అయిదు నిమిషాల్లో ఆఫీసు చేరుకోవాలి. కానీ, ఇప్పుడు సాయంత్రం అయిదు గంటలవుతున్నా జాడలేదు!

"ఒకవేళ అత్యవసరంగా ఎక్కడికైనా వెళ్ళే ఫోన్ చేస్తాడు. ఇప్పటివరకూ చెయ్యలేదంటే ఏదో ప్రమాదంలో ఇరుక్కున్నాడనే నమ్ముతున్నాను. నాకు తెలిసినంతవరకు అతనెక్కడెక్కడికి వెళ్తాడో అన్నిచోట్లా కబురుచేశాను. ఫలితం లేదు."

"ఒకవేళ వూరు విడిచి వెళ్ళాడేమో?" లాల్ అడిగాడు.

"ఆ అవసరం అతనికి లేదు. దేవరాజ్ యే పనిచేసినా నాతో చెప్పి చేస్తాడు."

"మీరు పాతిక వేలు యే అవసరానికి చెక్కు వ్రాశారు?"

"డబ్బు మా క్లయంట్ కు ఇవ్వడానికి."

"డబ్బు చెక్కు రూపంలో మీ క్లయంట్ కు ఎందుకివ్వకూడదు?"

"మా కంపెనీ ఫార్మలిటీస్ తో మీ కనవసరం. నేనో అవసరానికి చెక్కు వ్రాసినా దేవరాజ్ ఆ డబ్బుతో అదృశ్యమయ్యాడు. అతను దుండుగుల చేతిలో పడ్డాడనే నమ్ముతున్నాను. డబ్బుపోతే ఫరవాలేదు—దేవరాజ్ క్షేమంగా తిరిగి రావాలి. ఇందులో పోలీసు జోక్యం లేకుండా మీ రిద్దరూ అతన్ని సురక్షితంగా రప్పించగలరా?"

"అతను దుండుగుల చేతుల్లో పడ్డాడని మీ రెందుకనుకుంటున్నారు?"

"పంక్చర్ కాకుండా స్కూటర్ లో గాలిపోవడమన్నది చాలా అరుదైన విషయం. దేవరాజ్ ని కనిపెట్టుకున్న మనుషులెవరో స్కూటర్ లో గాలి తీసేసివుండాలి. ఆ విధంగా దేవరాజ్ డబ్బుతో వచ్చాక, స్కూటర్ ని

చూసి లిఫ్ట్ అడిగే పరిస్థితిని కల్పించారు. తమ వాహనంలో లిఫ్ట్ ఇచ్చి, అతన్ని బెదిరించి ఎక్కడికో తీసికెళ్ళి డబ్బు దోచుకున్నారు—"

"డబ్బు దోచుకొని వదిలేస్తారు." జాన్ అన్నాడు.

"అవును.... అవును! నిర్బంధించేందుకు కారణాల్లేవు! వాళ్ళకు కావల్సింది డబ్బు! అది తీసుకొని వదిలేస్తారు. మరి దేవరాజ్ ఎందుకు తిరిగి రాలేదు?"

"దేవరాజ్ వ్యాపకాలేమిటి?"

"బిజినెస్ తప్ప మరో వ్యాపకం లేదు. పెళ్ళయి సంవత్సర మవుతోంది. బిజినెస్, భార్య తప్ప ఇంకెందులోనూ ఇంట్రెస్టు లేదు."

"పెళ్ళికి పూర్వం? ఎప్పుడైనా డబ్బుతో విహార యాత్రలకి వెళ్ళాడా?"

"మీరు నమ్మండి—నమ్మకపొండి. పుట్టి పెరిగినప్పటి నుంచి ఈ సిటీ లిమిట్స్ దాటి ఎరుగడు!"

"భార్యతో అన్యోన్యంగా వుంటాడా? ఈ మధ్య మనస్పర్థలేవైనా వచ్చాయా?"

"దేవరాజ్ ఎంత సున్నిత మన స్తత్వంగలవాడో, సరస్వతి అంతకు రెట్టింపు. ఎన్నడూ కలహాలు లేవు."

"సరే, మేం రహస్యంగా దర్యాప్తుచేసి మీ కుమారుడి ఆచూకీ తెలుసుకుంటాం. మీ రతని ఫోటో ఒకటి పంపండి. అలాగే మీ ఇంటి అడ్రసు, ఫోన్ నెంబర్ కూడా ఇచ్చి వెళ్ళండి."

రావ్ గబగబా పాడ్ మీద వ్రాశాడు.

"మీ ఇంట్లో ఇంకెవరున్నారు?"

"నా రెండవ కుమారుడు నరేంద్ర. బి. యే. ఫైనలియర్ చదువుతున్నాడు."

"అంటే—మొత్తం నల్గురన్నమాట."

"అవును." రావ్ అన్నాడు లేచి నిలబడి. "మిస్టర్ లాల్, నేనెంత ఆందోళన చెందుతున్నానో మీరు చూస్తూనే వున్నారు. ఇక సరస్వతి విషయం వూహించండి! ఆమెని చూస్తే ఎలా—ఎలా ఓదార్చాలో తోచక నా గుండె—"

"మిస్టర్ రావ్, అనవసరంగా కంగారు పడకండి. దేవరాజ్‌కు యేమీ కాలేదు. డబ్బివ్వడానికి యెదురు తిరిగితే తప్ప అతనికి ప్రాణాపాయం లేదు. మీరు చెప్పిన విషయాల్నిబట్టి అతని స్వభావాన్ని అంచనా వేశాను. దేవరాజ్‌కు ధైర్యసాహసాలు లేవు. అవునా?"

"అవును."

"అయితే అతనికి ప్రాణాపాయం లేదు!" అన్నాడు లాల్.

## 2

రాత్రి యెనిమిది గంటలకు జాన్ తిరిగి వచ్చాడు.

లాల్ అతన్ని చూసి, "సక్సెస్?" అనడిగాడు.

జాన్ అడ్డంగా తలూపాడు, "నో! ఈ వ్యవహారం అంత సులువుగా సక్సెస్ అయ్యేది గాదు. దేవరాజ్ అదృశ్యం అంతుపట్టకుండా వుంది."

"షూట్ యువర్ స్టోరీ!"

"వెల్, దేవరాజ్ వుదయం పదకొండు గంటలకు ఆఫీసునుండి స్కూటరుమీద బయలుదేరాడు. ఈ రోజు కూడా అతను ఆఫీసుకు మామూలుగానే స్కూటరుమీద పదిగంటలకు వచ్చాడు. జమునారావ్ పదిన్నరకు కార్లో వచ్చాడు. బ్యాంకు పని చూసేందుకొక మనిషి వున్నాడు. పేరు రాజన్.

"ఈ రోజు అతను సెలవు పెట్టాడు. డబ్బు వెయ్యడమూ, తియ్యడమూ, ఇతర వ్యవహారాలు అన్నీ అతనే నమ్మకంగా చూస్తున్నాడు. అయినా దేవరాజ్ అతని వ్యవహారాల్లో తరచు జోక్యం చేసుకుంటున్నాడు. ఒక్కోసారి రాజన్‌కు బదులు అతనే బ్యాంక్‌కు వెళ్తుంటాడు. కారణమేమీ లేదు—ఆఫీసులో ఇతర ఉద్యోగుల పనుల్లో కూడా జోక్యం చేసుకోవడం అతని అలవాటు. టైపిస్టు విమల విషయంలో మరీ ఎక్కువ. ఆమెతో రొమాన్సు యేమీ లేదు. అనాథ కావడంవల్ల తనపట్ల అతనికి చాలా శ్రద్ధ అని విమల స్వయంగా చెప్పింది.

"ఇక—జమునారావ్ సంతకం చేసిన పాతిక వేల రూపాయల చెక్కుతో దేవరాజ్ బ్యాంకికి వెళ్ళాడు. అతని చేతిలో బ్రీఫ్ కేసు వుంది. తిలక్ రోడ్‌లోని ఆగ్రా బ్యాంక్‌లో అకౌంట్ వుంది. బ్యాంక్ ముందు స్కూటరు దిగి అతను లోనికెళ్ళాడు.

"బ్యాంకు దర్వాను కథనం ప్రకారం అతను లోనికెళ్ళిన రెండు నిమిషాల తర్వాత ఒక కారు వచ్చి ఆగింది-గ్రీన్ ఫియట్. అందులో ఒక అందమైన యువతి గులాబీ రంగు చీర ధరించి, తలకు పెద్ద కొప్పు పెట్టుకొని, పెదవులకి లిప్‌స్టిక్‌తో, చేతికి రిస్టువాచీతో, చెవులకు పెద్ద పెద్ద రింగులతో హుందాగా కూర్చొని, తేనె రంగు కళ్ళతో మిక్కిలి సొగసుగా, ఆకర్షణీయంగా—"

"చాలు, చాలు! అసలు విషయం చెప్పు."

"జాన్ విసుక్కొని అన్నాడు: "బ్యాంకు ముందు కారాపి ఆ యువతి దేవరాజ్ స్కూటర్ మీద చూపులు సారించింది. ఆ స్కూటర్ గాక అక్కడ చాలా వాహనాలున్నాయి. కానీ ఆమె దేవరాజ్ స్కూటర్‌నే

కాసేపు తదేకంగా చూసింది. దర్వాను ఆమెనే జాగ్రత్తగా గమనించసాగాడు. ఆమె కారు దిగి యెదురుగా వున్న షాపింగ్ కాంప్లెక్స్‌లో కెళ్ళింది. ఆమె వెళ్ళిన అయిదు నిమిషాల వరకు తిరిగి రాకపోతే దర్వాన్ ఆమె గురించి మర్చిపోయాడు.

"పది నిమిషాల తర్వాత దేవరాజ్ బ్రీఫ్‌కేసుతో బయటకు రాగానే ఆ యువతి చకచక కారు దగ్గరికి నడిచివచ్చింది. ఆమె చేతిలో యేమీ లేదు. దర్వాన్ దేవరాజ్‌ను బాగా గుర్తుపడతాడు. అతనెవరో తెలుసు. దేవరాజ్ స్కూటర్ దగ్గరకెళ్ళి తాళం తీసి స్టార్టు చేశాడు. కానీ ముందు టైరులో గాలిలేదు.

"అతను కంగారుగా అటూ ఇటూ చూశాడు. ఆ తర్వాత విసుక్కుంటూ స్కూటర్ని ఓ తాపు తన్ని, తాళంవేసి రోడ్డుకేసి నడిచాడు.

"అప్పటికే రోడ్డుమీద వున్న గ్రీన్ సీయాట్‌లో ఆ యువతి కూర్చొని స్టార్టు చెయ్యడానికి సిద్ధంగా వుంది. ఆమె అప్రయత్నంగా తల తిప్పి దేవరాజ్‌ను చూసి యేదో మాట్లాడింది. దేవరాజ్ తలూపి, యేదో చెప్పి, అవతలి డోరు తెరచి ఆమె ప్రక్కన కూర్చున్నాడు. కారు స్టార్టయి వెళ్ళిపోయింది."

"ఆ తర్వాత?"

"ఆ కారులోనే దేవరాజ్ అదృశ్యమయ్యాడు. దర్వాను దాని నెంబరు చెప్పలేక పోతున్నాడు. ఇప్పుడా కారును పట్టుకోవడం యెవరి తరమూ గాదు. అయితే నాకో అనుమానం కల్గింది. ఆ కార్లో వచ్చిన యువతి దేవరాజ్ కదలికల్ని కనిపెట్టి, యే కుర్రాడి సహాయంతోనో స్కూటర్‌లో గాలి తీయించేసింది. ఇక ఆమె

యెలా వుంటుందో వర్ణించాను—ఆ అలంకరణ దేవరాజ్‌ని ఆకర్షించడానికే. చాలా సులువుగా అతన్ని గద్దలా తన్నుకుపోయింది.

"అయితే, అసలు దేవరాజ్ డబ్బు కోసం బ్యాంక్ కెళ్ళాడని ఆమె కెలా తెలుసు? ఆమె కారాపిన మరు క్షణం దేవరాజ్ స్కూటర్ పైన చూపులు యెందుకు సారించింది? ఆ స్కూటర్ యజమాని డబ్బు వేయడానికి గాక, తీసుకోవడానికి వచ్చాడని ఎలా నమ్మింది?

"ఆమె మనుషు లెవరైనా బ్యాంకులో ప్రవేశించి, దేవరాజ్ డబ్బు డ్రా చేస్తున్నాడని తెలుసుకొని, స్కూటర్‌లో గాలి తీసేసి ట్రాప్‌లో పడేశారా? కానీ అందుకావకాశం లేదు."

"మరి దేవరాజ్ డబ్బుతో వస్తున్నట్టు ఆమె కెలా తెలిసింది? ముందే తెలుసా? యెలా? ఆఫీసునుంచి ఆ విషయం లీక్ అయిందా? యెవరు చేశారు? ఇలా ఆలోచిస్తే నాకొకే ఒక్క అవకాశం కన్పించింది...."

"యేమిటది?"

"రాజన్ ఈ రోజు సెలవుమీద వున్నాడు. ఆరోగ్యం బాగాలేదని వుదయం లెటర్ పంపాడు—ఒకరోజు సెలవుకోసం. ఈ సెలవు దేవరాజ్‌ని కిడ్నాప్ చెయ్యడానికే కల్పించుకున్నాడని నా అనుమానం. అతనికి ఆఫీసు వ్యవహారాలు బాగా తెలుసు. ఈ రోజు కంపెనీ ఒకానొక క్లయంట్‌కు పాతికవేలు చెల్లిస్తుందని అతనికి తెలిసివుండాలి. ఆ డబ్బు కాజెయ్యడానికి ఈ ప్లాను వేశాడు. డబ్బు బ్యాంకులో వుంది. తను సెలవుమీద వుంటే దేవరాజ్ వెళ్ళి డ్రా చేస్తాడు.

"తను అజ్ఞాతంగా వుండి దేవరాజ్‌ను కిడ్నాప్ చెయ్యడానికి ఎవరైనా నియమిస్తే అనుమానం అతని మీదకు రాదు. అందుకే ఆ గ్రీన్ ఫియట్ యువతిని ఈ పనికి యెన్నుకున్నాడు. అతని సూచనల మేరకు ఆమె బ్యాంక్ కెళ్ళి రాజన్ చెప్పిన నెంబర్ గల స్కూటర్‌ను అక్కడ చూసి-కాంప్లెక్స్‌లో కెళ్ళి కాస్సేపు గడిపి వచ్చింది. ఈలోపు రాజన్ నియమించిన కుర్రాడు గాలి తీసేశాడు. దేవరాజ్ డబ్బుతో బయటకొచ్చి, స్కూటర్ సితిని గమనించి నేరుగా ఆమె వలలో అడుగు పెట్టాడు. ఆమె అతన్ని కార్లో యెక్కడో తీసుకెళ్ళి బెదిరించి డబ్బు లాక్కొని వుంటుంది."

లాల్ సాలోచనగా తలూపాడు.

జాన్ మళ్ళీ అన్నాడు: "ఈ సంఘటనకు ఇంతకంటే మరో ఎక్స్‌ప్లనేషన్ వుండదు. వెంటనే నేను రావ్ ఇచ్చిన అడ్రసుతో రాజన్ ఇంటికి వెళ్ళాను. అతనక్కడే వున్నాడు. అతనికి నిజంగా ఆరోగ్యం బాగాలేదు - నూటనాలుగు టెంపరేచర్‌తో మూల్గుతూ పడుకున్నాడు. దాంతో నా ఊహా తల్లక్రిందులై యేం చేయాలో తోచక యిలా వచ్చాను."

జాన్ చెప్పడం ముగించి, తల పట్టుకుని కూర్చున్నాడు.

లాల్ భుజా లెగరేశాడు: "అలా నిరాశపడకు! రావ్‌కు ఫోన్ చేసి అతనికి తెలిసినవాళ్ళలో ఎవరికైనా గ్రీన్ ఫియట్ వుందేమో కనుక్కో!"

"దేనికి? వాళ్ళలో యెవరికైనా ఈ కిడ్నాప్‌తో సంబంధం వుందా?"

"నాకో సందేహం వుంది తర్వాత చెప్తాను."

జాన్ చక చక నెంబర్ డయల్ చేసి, రావ్‌తో

రెండు నిమిషాలు మాట్లాడి, డిస్కనెక్టు చేశాడు.

"అతనికి తెలిసిన వాళ్ళలో గాని దేవరాజ్‌కు తెలిసినవాళ్ళలో -గాని- మొత్తం కుటుంబానికి తెలిసిన వాళ్ళలో గాని-యెవరికీ గ్రీన్ ఫియట్ లేదు."

లాల్ అడ్డంగా తలూపాడు.

"నో, ఇందులో ఒక మర్మం వుంది. దేవరాజ్‌కు తెలిసిన వ్యక్తి యెవరికో గ్రీన్ ఫియట్ వుంది! లేకపోతే అతనికి తనంతటతాను అదృశ్యమయ్యే వీలుండదు!"

"ఏమిటీ!" జాన్ నోరు తెరిచాడు, "దేవరాజ్ తనకు తానుగా మాయమయ్యాడా?"

"అవును. మనం సమస్యను ఒకే దృష్టికోణంనుంచీ చూస్తున్నాం. దేవరాజ్ దుండగులచేత అపహరించబడ్డాడని అనుకొంటున్నాం గానీ- అతనే స్వయంగా బుద్ధిపూర్వకంగా అదృశ్యమయ్యాడని యెందుకనుకోకూడదు?"

"అనుకోవచ్చు-కానీ ఆధారాలు?"

"ఎన్ని కావాలి? కావల్సినన్ని వున్నాయి! ఒకవేళ అతను నిజంగా అపహరించబడివుంటే, అతనికి లిఫ్ట్ ఇచ్చిన స్త్రీ కారుని అతని ఆఫీసురోడ్డులో గాక, మరో దారిలో డ్రైవ్ చేస్తే దేవరాజ్ యేం చేస్తాడు? ఆమెను కారాపమని చెప్పి దిగిపోవడానికి ప్రయత్నిస్తాడు. ఆ క్షణంలో ఆమె రివాల్వర్‌తో బెదిరించిందనుకుందాం. అప్పుడతను కేవలం ఒక స్త్రీకి భయపడి కూర్చోకుండా ప్రతిఘటించడానికి ప్రయత్నిస్తాడు.

నడిరోడ్డుమీద రివాల్వర్ కాల్చే ధైర్యం ఆమె చెయ్యదు గనుక, ఒకచేత్తో డ్రైవింగ్ చేస్తున్న ఆమె చేతిలోంచి రివాల్వర్ లాక్కోవడం కష్టం కాదు. ఒక

వేళ ఆమె రివాల్వర్‌తో గాకుండా అందచందాలతో అతన్ని లొంగదీసుకోవాలనుకుంటే, దేవరాజ్ విషయంలో విఫలమవుతుంది. దేవరాజ్ అలాంటి ఆకర్షణలకి లొంగే స్వభావం గలవాడు కాదు. పైగా పెళ్ళయినవాడు.

"ఈ రెండూ గాకుండా, కారు కొంత దూరం వెళ్ళాక కొందరు దుండగులు ఆ స్త్రీకి సహాయంగా కారెక్కి బెదిరిస్తే ఏమీ చెయ్యలేడు. వారతన్ని ఏ మారుమూలకో తీసుకెళ్ళి డబ్బు లాక్కొని వదిలేస్తారు. తమ ఆనవాల గురించీ, కారు నెంబరు గురించీ దేవరాజ్ పోలీసులకి చెప్తాడని వాళ్ళకు భయం లేదు. కారుకు తగిలించుకున్నవి దొంగ నెంబరు ప్లేట్లు. ఆనవాలు పోలీసులకు చెప్పినంతమాత్రాన పట్టుబడరు. ఇదేమీ పల్లెటూరు కాదు. పోలీసు రికార్డుల్లో వాళ్ళ ఫోటో లుండకపోవచ్చు. వాళ్లు ఈ సిటీకి చెందినవాళ్లని గ్యారంటీ లేదు-ఈమధ్య ఇక్కడ ఇంటర్ స్టేట్ దొంగలెక్కువయ్యారు."

"మరి ఈ మూడవ అవకాశం అతను నిజంగా అపహరించబడ్డాడని తెలియజేస్తోంది కదా?" జాన్ అడిగాడు.

"నిజంగా అపహరించబడి వుంటే దుండగులు వదిలేశాక ఎందుకు తిరిగిరాలేదు? వాళ్ళు నిర్బంధించేందుకు కారణాల్లేవు. ధైర్యసాహసాలులేని దేవరాజ్ వాళ్ళతో తలబడి ప్రాణాలు పోగొట్టుకునే ప్రసక్తే లేదు. ఈ విషయాలన్నీ అలా వుంచితే అసలు దేవరాజ్ డబ్బు తీయడానికే బ్యాంక్‌కు వెళుతున్నట్లు దొంగలకు యెలా తెలిసిందన్నది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఆఫీసునుంచి లీక్ కాలేదు. రాజన్ ఈ వ్యవహారంలో పూర్తిగా నిర్దోషి. అయితే దోషి యెవరు? సిల్లీ ప్రశ్న. అసలు

నేరం జరగనిదే దోషి యెవరేమిటి!

"జాన్ జాగ్రత్తగా ఆలోచించు. దేవరాజ్ బ్యాంక్ కు చేరుకున్న రెండు నిమిషాలకు గ్రీన్ ఫియట్ వచ్చిందని దర్వాన్ చెప్పాడన్నావు. అంటే, ఆమె వెంటాడుతూ వచ్చిందన్నమాట. కాబట్టి అతను డబ్బు కోసం బ్యాంక్ కెళ్తున్నట్లు ఆమెకు ముందే తెలుసు. ఎలా తెలుసు? దేవరాజ్ ఆమెకు చెప్పాడు కాబట్టి!

"ఏ బ్లాక్ మెయిల్ లోనో, లేక మరే అవసరానికో అతనికి డబ్బు అవసరమై ఈ పథకం అల్లాడు. గ్రీన్ ఫియట్ యువతి అతని స్నేహితురాలు. ఆమె రాప్ కు తెలియక పోవచ్చు. దేవరాజ్ సూచనల ప్రకారం అతన్ని వెంటాడుతూవచ్చి, ఆమె బ్యాంక్ దర్వాన్ దృష్టి నాకర్షించి ఆ తర్వాత యే కుర్రాడిచేతనో స్కూటర్ లో గాలి తీయించేసి, దేవరాజ్ కోసం యెదురుచూడసాగింది.

"దేవరాజ్ డబ్బుతో వచ్చి స్కూటర్ దగ్గర కాస్సేపు నటించి, ఫియట్ దగ్గరికి వెళ్తూ ఆమె లిఫ్ట్ కావాలా అని అడగడంతో యెక్కి కూర్చున్నాడు. ఇదంతా దర్వాన్ చక్కగా చూశాడు.

"కాబట్టి జాన్ అతను సృష్టించిన ఈ ఫేక్ కిడ్నాప్ అసలు వ్యవహారం బయటపడకుండా ముసుగు కప్పుతుంది. నీ అభిప్రాయ మేమిటి?"

"దేవరాజ్ ఇలాంటి దుశ్చర్యలకి పాల్పడడని నా నమ్మకం. అతని కారెక్టర్ చాలా మంచిదని ఆఫీసులో అంతా చెప్పారు."

"బ్లాక్ మెయిల్ లో ఇరుక్కోడానికి చెడ్డ క్యారెక్టర్ అవసరం లేదు. మంచివాళ్ళుకూడా సవాలక్ష కారణాలతో ఇరుక్కుంటారు. దేవరాజ్ బ్లాక్ మెయిల్ లో

ఇరుక్కున్నాడని చెప్పలేను. ఇంకేదైనా అవసరానికి డబ్బు కూడ బెట్టవచ్చు. మొత్తానికి అతను ఉద్దేశపూర్వకంగా అదృశ్యమయ్యాడని చెప్పగలను."

"అయితే ఈ కేసు రావ్‌కి వివరించి వదులుకోవడం తప్ప చేసేదేమీ లేదు."

"రావ్‌కు ఇప్పుడేమీ చెప్పకూడదు. దేవరాజ్ తిరిగి వచ్చేవరకు మన పరిశోధన కొనసాగుతుంది. అతని అదృశ్యంలోని అంతర్యం తెలుసుకునే బాధ్యత చట్టం శ్రేయస్సు దృష్ట్యా మనకు వుంది."

"అయితే ఇప్పుడేం చెయ్యాలి?"

"దేవరాజ్ భార్యను కలుసుకొని ఈ కేసును మరో కోణంనుంచి నరుక్కురావాలి, పద!" అన్నాడు లాల్.

# 3

సరస్వతికి పాతికేళ్ళుంటాయి. మామూలు విగ్రహం. ఆధునిక అలంకరణాల మోజులో సహజ సౌందర్యాన్ని కృత్రిమంగా మార్చేస్తూ జానెడు జడలు కన్పిస్తున్న ఈ రోజుల్లో, సరస్వతి గజం పొడవు శిరోజాల్ని చూసి జాన్ గుండెలో అలజడి రేగింది. ఆమె గుండ్రటి నల్లటి కళ్ళు, పల్చటి యెర్రని పెదవులు, పొడవాటి సన్నటి ముక్కు, నున్నటి తెల్లని చెక్కిళ్ళు - ఇవన్నీ ఇదివరకటి ఆకర్షణ కోల్పోయి వెలవెల బోతున్నాయి.

డిటెక్టివ్‌లు తామెవరో చెప్పాక ఆమె ఆశ్చర్య పడింది.

"ఆయనకోసం గాలిస్తున్నట్లు మామయ్య ఇందాక ఫోన్ చేసి చెప్పారు." అందామె దుఃఖంతో పూడుక పోయిన స్వరంతో. "ఎన్నడూ ఇలా జరగలేదు. నాకేమీ అర్థం గావడంలేదు! ఆయన క్షేమంగో-నాకు చాలా -

నిజంగా మీరు ఆయన్ని దొంగలబారినుండి క్షేమంగా తప్పిస్తారా!"

లాల్ ఆమెను పరీక్షగా చూసి పలుకాడు : "చూడండి సరస్వతి, నేను నిష్కపటంగా మీ భర్త గురించి కొన్ని వాస్తవాలు చెప్తాను. మీరు కూడా యేదీ దాచకుండా మనసు విప్పి కొన్ని విషయాలు చెప్పాలి. మేము కొన్ని కారణాలవలన మీ భర్తను ఎవరూ అపహరించలేదనీ, ఆయనే స్వయంగా అదృశ్యమయ్యారని నిశ్చయానికొచ్చాం. కాబట్టి మీరు దిగులుపడకండి. ఆయన ప్రమాదంలోకి వెళ్ళలేదు. మీ భర్త వ్యక్తిగత ప్రయోజనాలను పరిరక్షించుకోవడానికో, లేక మరే అవసరానికో, లేక భవిష్యత్ పట్ల భయాందోళనల వల్లనో - డబ్బును సమకూర్చుకోవాలనుకున్నారు.

"కాబట్టి ఆయన మరొకరి సహాయంతో డబ్బుతో మాయమయ్యారు. డబ్బు వదిలించుకుని యేదో క్షణాన తిరిగి వచ్చేస్తారు...."

"ఓహ్, ఆయనలా చెయ్యరు! మా భవిష్యత్తుకి ప్రమాదం లేదు!" అంది సరస్వతి.

"అవును, ఆర్థికంగా మీ భవిష్యత్తుకు ప్రమాదం లేదు. మీ మామయ్య గడించిన ఈ ఆస్తి కొన్ని తరాల వరకు తరగదు. అయితే-సాంఘికంగా మీ భవిష్యత్తు మాటేమిటి? మీ భర్త ఏ నీతి బాహ్య కలాపాల్లోనో పాల్గొని సమాజంలో విలువ కోల్పోయే పరిస్థితి ఏర్పడితే ఏమవుతుంది?"

సరస్వతి లాల్‌ని కోపంగా చూసి అర్చింది.

"మీరు పిచ్చిగా మాట్లాడుతున్నారు! మీరెక్కడి కొచ్చింది ఆయన నీతిమాలిన వాడని నన్ను నమ్మించ

డానికా?"

లాల్ చెంపలు రుద్దుకొని ఇబ్బందిగా చూశాడు.

"మీ భర్తమీద మీకున్న నమ్మకాల్ని వక్రమార్గం పట్టించడానికి మేము రాలేదు. మాకు కొన్ని సందేహా లున్నాయి. వాటిని తీర్చుకుని పైకి కన్పించే మీ భర్త వ్యవహారంలో అసలు మర్మం తెలుసుకోవడానికి వచ్చాం. అందుకు మీ సహకారం అవసరం."

"ఏమిటి మీ సందేహాలు?"

"ఈమధ్య మీ భర్త ప్రవర్తన యెలా వుంటోంది?"

"అందులో మార్పేమీ లేదు."

"ఆయన యేకాంతంగా ఆలోచనలతో గడుపుతుండే వారా?"

"మీ ప్రశ్న నా కర్థంగాలేదు. ఆలోచన లెవరి కుండవు?"

"అందరికీ వుంటాయి. ఆలోచిస్తున్నప్పుడు మనిషి హావభావాల్నిబట్టి అతనున్న పరిస్థితిని పసిగట్టవచ్చు."

"అంటే!?....ఆయన ఏకాంతంలో దీర్ఘాలోచనలతో గడుపుతూ పథకం తయారుచేసి డబ్బుతో పారిపోయా డంటున్నారా? మీ రాయన్ను పట్టుకొని దొంగనుచెయ్యా లనుకుంటున్నారా? మీ ప్రశ్నలకు జవాబులివ్వను. ప్లీజ్ వెళ్ళిపొండి!"

"అయితే మీ భర్త యెప్పటికీ తిరిగిరారు!"

"ఎందుకు రారు?"

"ఆయన డబ్బు తీసుకొని మరో యువతితో పారి పోయారు. ఆమెకో కారు వుంది. గ్రీన్ ఫియట్. ఆమె మీకంటే చాలా అందంగా వుంటుంది. మీ భర్త ఆమె ఆకర్షణలో పడ్డాడు. ఇక మీ అవసరం లేదు."

ఆమె కాస్సేపు సబురాలైంది.

లాల్ నవ్వాడు. "ఇవి కూడా పిచ్చి మాటలను కుంటున్నారా? సహనం వహిస్తే అన్నీ రుజువవుతాయి. మీ భర్త ఒక యువతితో గ్రీన్ థియేటర్‌లో వెళ్ళాడని సాక్ష్యం వుంది. ఆయన్ని యెవరూ డబ్బుకోసం అపహరించలేరు.

జాన్ ఆమె ముఖంలో మార్పులు గమనిస్తున్నాడు.

"అయితే.... ప్రతి రోజు ఫోన్ కాల్ రావడం, ఆయనదోలా కన్పించడం .... ఇందుకే నన్నమాట!" అందామె నిస్సహాయంగా చూస్తూ.

లాల్ ఆమె మాటలు విని జాన్‌ని చూశాడు. జాన్ తృప్తిగా తలాడించాడు.

"వెరీవెల్, సరస్వతి! ఇప్పుడు చెప్పండి: ఆయనకు రోజూ ఫోన్ కాల్స్ వస్తున్నాయా?"

"అవును!"

"ఏ సమయంలో?"

"ఆఫీసునుంచి వచ్చాక-సాయంత్రం ఆరుగంటలకు."

"ఎన్నిరోజులనుంచి?"

"నాలుగురోజులనుంచి-మొదటి రెండురోజులు నేను పట్టించుకోలేదు. నిన్న, మొన్న నాకేదో అనుమానం కల్గింది. సరిగ్గా ఆ సమయానికి ఫోన్ రావడం, రిసీవర్ నేనందుకోకుండా ఆయన తీసుకోవడం, నన్ను బయట కెళ్ళమని చెప్పి ఫోన్‌లో మాట్లాడ్డం-ఆ తర్వాత-"

"ఆ తర్వాత?"

"విసుక్కోవడం-తిట్టుకోవడం - నాకు పిచ్చెక్కేలా వుండేది!"

"ఏమని తిట్టుకునేవారు? ఎవరి పేర్లు ఉచ్చరించే

వారు?"

"పేర్లు పలకలేను. ఇంగ్లీషులో, హిందీలో తిట్టేవారు ఆయనకు తెలుగులో తిట్లురావు."

"బాస్టర్డు, బేవకూఫ్, బద్మాష్ .... ఇలాంటివేనా?" జాన్ అడిగాడు.

"అవును. మగవాడ్ని తిడుతున్నట్టే వుండేవి. మరి మీరా యువతి గురించి చెప్పేదేమిటో నాకర్థంగావడం లేదు."

లాల్ నవ్వాడు, "వదిలేయండి ఆమె మీ భర్త శ్రేయోభిలాషి తప్ప మరేమీ కాదు. మీకు తెలిసిన వాళ్ళలో గ్రీన్ ఫియట్ యెవరికుందో చెప్పగలరా?"

"నాకు తెలిసినవాళ్ళలో గ్రీన్ ఫియట్ యెవరికీ లేదు."

జాన్ అన్నాడు:-

"మొదటి రోజు మీ భర్త ఫోన్‌లో యెంతసేపు మాట్లాడారో గుర్తుందా?"

"చాలాసేపు సుమారు పది నిమిషాలు."

"రెండవరోజు?"

"ఆ తర్వాత రోజునుంచి ఒకటి, రెండు నిమిషాల కంటే యెక్కువ మాట్లాడలేదు."

"అంటే మీ భర్తకు బ్లాక్ మెయిలర్‌తో పరిచయం ఈ ఫోన్ కాల్స్ పరంపర ప్రారంభమై మొదటిరోజున అయిందన్నమాట-నాల్గురోజుల క్రితం. ఆ రోజు బ్లాక్ మెయిలర్ ఫోన్ చేసి, సుదీర్ఘంగా పరిస్థితి వివరించి డబ్బు కోసం బెదిరించాడు. ఆ తర్వాత మూడు రోజులు దేవ రాజ్ చిక్కుకున్న పరిస్థితిని గుర్తు చేయసాగాడు. క్రితం సాయంత్రం ఆరుగంటలకు తెలుసుకున్నారు....

"ఆరోజు ఆయన ప్రవర్తన యెలా వుంది?"

సరస్వతి కళ్ళు ఉబికిపడ్డాయి. ఏదో చెప్పబోయి మానుకుంది.

"ఏమిటి?" జాన్ అడిగాడు.

"ఆ రాత్రి ఆయన రహస్యంగా డైరీ చదవడం చూశాను."

"ఎవరి డైరీ? ఆయన డైరీ వ్రాస్తారా?"

"నేనెప్పుడూ చూడలేదు. ఆ డైరీ యెవరిదో తెలియదు. మర్నాడు ఉదయం దాన్ని పెరట్లో చూశాను - కాలిపోయి వుంది."

"పూర్తిగా కాలిపోయిందా?"

"అవును బూడిద మిగిలింది."

"ఆయన చదువుతుండగా మీరు డైరీ చూసినప్పుడు యెలా కన్పించింది? కొత్తగావుందా? పాతగా వుందా?"

"చాలా పాతగా వుంది. పై కవరు జాగా దుమ్ము పట్టివుంది. కాయితాలు రంగు మారిపోయి అంచులు చిరిగి వున్నాయి."

"జాకెట్ యెలా వుంది?"

"కాన్వాస్ గుడ్డ."

"ఇప్పటి డైరీలన్నిటికీ ప్లాస్టిక్ జాకెట్లు వుంటున్నాయి. కాన్వాస్ జాకెట్ అంటే చాలా పాత డైరీ అయివుండాలి."

"అవును."

"సుమారు ముప్పై యేళ్ళ క్రితానిది...."

"కావచ్చు."

"అంత పాత డైరీ మీ భర్తది కావడానికి వీల్లేదు.

ఆయన వయసు ముప్ఫై అనుకుంటాను? పుట్టినప్పుడే డైరీ వ్రాసే అద్భుతశక్తి దైవం ఆయనకు ప్రసాదించలేదని నా గట్టి నమ్మకం. ఏమంటారు?"

సరస్వతి నవ్వింది, "జాన్, అలా నవ్వించకండి. నేనిప్పుడు నవ్వే స్థితిలో లేను. మీ ప్రశ్నలు సూటిగా అడగండి."

"రైట్. అయితే ఆ డైరీ యెవరిది?"

"నాకు తెలియదు."

"మీ మామగారిదా?"

"ఆయన డైరీ వ్రాయగా నేనెప్పుడూ చూడలేదు."

"ఆ డైరీ వ్రాసినప్పుడు మీరింకా పుట్టలేదు."

సరస్వతి నవ్వాపుకుంది. "జాన్, ఆయన యెప్పుడో వ్రాసిన డైరీలు, వుండవచ్చు. కానీ యెక్కడున్నాయో నాకు తెలియదు."

"ఆయన గది చూపించండి నేను చూస్తాను."

"కానేప్పట్లో ఆయన వచ్చేస్తారు."

"రానివ్వండి. అయన డైరీ మూలంగానే మీ భర్త ఈ రిస్కు తీసుకొన్నారు."

సరస్వతి లేచి రావ్ గది చూపించింది. జాన్ వెళ్లాడు.

లాల్ సరస్వతితో అన్నాడు:

"ఆ డైరీలో యే రహస్యమున్నా అది నాశనమైంది. మీ భర్త తండ్రి రహస్యాల్ని కాపాడ్డానికి బ్లాక్ మెయిలర్ కు డబ్బు చెల్లించడానికి వెళ్లారు. తిరిగి వచ్చాక ఆయన ఈ విషయం ఒప్పుకోడు. కిడ్నాపింగ్ కధ చెప్తారు-అలాగే మీ మామగారు కూడా ఆ రహస్యం బయట పెట్టరు. ఇక మిగిలింది నరేంద్ర వున్నారు. బ్లాక్ మెయిలర్ చెప్పేవరకు ఆ రహస్యం మీ భర్తకు తెలియ

లేదంటే, నరేంద్రకు కచ్చితంగా తెలిసివుండే వీల్లేదు. ఇక మీరు వచ్చిన ఈ సంవత్సరకాలంలో ఈ కుటుంబ రహస్యాలింకేమీ, తెలిసి వుండవు. అంతేనా? ఇక మిగిలింది బ్లాక్ మెయిలర్. అతనికెలా తెలిసింది? అతనెవరు?"

సరస్వతి ఉలిక్కిపడి తటాలున లేచింది.

"ఏమిటి? యేం జరిగింది?" లాల్ అడిగాడు.

"బ్లాక్ మెయిలర్ యెవరో నాకు తెలుసు."

"ఎవరు? మీ మామగారి చిరకాల మిత్రుడా?"

ఆమె వెంటనే అడ్డంగా తలూపింది. "లేదు! నేను చెప్పను! మీరిక యేమీ అడక్కండి! ప్లీజ్, వెళ్ళిపొండి కృణ్ణుంచి!"

సరస్వతి విసురుగా లేచి పక్క గదిలోకి వురికింది.

## 4

లాల్ సిగరెట్ వెలిగించి కారు స్టార్టు చేశాడు. జాన్ సీట్లో బాధగా వెనక్కి వాలి, చిట్లిన పెదవిని కర్చీఫ్‌తో అదిమిపట్టాడు. కర్చీఫ్‌మీద అక్కడక్కడ రక్తపు మరకలేర్పడ్డాయి. కళ్ళు గట్టిగా మూసుకుని బాధను అణుచుకోసాగాడు.

"ఆడవాళ్ళకు కోపం వచ్చినప్పుడు ఆమడ దూరంలో వుండటం మంచిది." అన్నాడు లాల్.

"నాకేం తెలుసు-ఆమె అలా హఠాత్తుగా దాడిచేసి నన్ను గదిలోంచి నెట్టేస్తుందని! కాళ్ళకు గడప తగిలి బోర్లా పడ్డాను!" జాన్ అరిచాడు.

"నెవర్ మైండ్. పెదవి చిట్లింది, పళ్లూడలేదు కదా? సంతోషించు!"

"ఒహ్, ఆమె యెందుకలా మారిపోయింది?"

"ఆమెకూడా భర్త పక్షాన చేరింది. ఇప్పుడిద్దరూ

కలిసి కుటుంబ ప్రతిష్టను కాపాడ్డానికి నడుం కట్టారు!"

"నాన్సెన్స్, లాల్! నేను ముందే చెప్పాను ఈ కేసు వదిలేద్దామని. నయాపైసా ఫీజు ముట్టలేదు. పైగా నన్ను ఫుట్ బాల్ ని తన్నినట్టుగా తన్నేసింది! నా పెదవి చిట్లి యింత అవమానం జరిగింది!"

"ఇవన్నీ డిటెక్టివ్ లు భరించాలి. నీ బాధ ఏమిటో నాకు తెలుసు, చిట్లిన పెదవితో భుజాల్ని చుంబించడం కష్టం. అవునా?—

"యూ డర్టీ పార్ట్నర్! నీ పెదవుల్ని కొన్నాళ్ళు అదుపులో వుంచి మనసును కేసులమీదికి మళ్ళించు! రావ్ గదిలో నువ్వేం చేశావ్?"

"ఏమీ లేదు బీరువాకు తాళం వేసివుంది. టేబిల్ సొరుగులు వెతికాను. డైరీలు కన్పించలేదు. ఆ డర్టీ డైరీలు యెక్కడ వున్నాయో—"

"అలా పిసుక్కోకు జాగ్రత్తగా విను: సరస్వతికి బ్లాక్ మెయిలర్ యెవరో తెలుసు."

జాన్ తటాలున ముందుకు వంగాడు.

"ఎలా తెలుసు? ఎవరతను?"

"చెప్పలేదు. ఆ ప్రసక్తి వచ్చినప్పుడే ఆమె అలా మారిపోయి. నిన్నూ, నన్నూ తరిమేసింది...."

"ఈ బిజినెస్ చాలా గజిబిజిగా వుంది లాల్! ఈ రాత్రికి నన్ను వదిలేస్తావా-విశ్రాంతి తీసుకుంటాను!"

జాన్ మాటలు పట్టించుకోకుండా లాల్ అన్నాడు, "బ్లాక్ మెయిలర్ యెవరో ఆమెకు బాగా తెలిసినవాడై వుండాలి. అతనిమీద ఆమెకు ద్వేషం లేదు; అయిష్టం లేదు-ఆమెకు ఆప్తుడై వుండాలి. అందుకే అతనెవరో చెప్పి అతని ప్రతిష్టనూ తద్వారా కుటుంబ ప్రతిష్టనూ

రచ్చకీడ్చడం ఆమె కిష్టంలేదు. కనుక ఈ కేసు విరమించు కోమని మనల్ని హెచ్చరించింది."

"ఒకవేళ ఆమె ఉద్దేశం తనే స్వయంగా బ్లాక్ మెయిలర్ కు బుద్ధి చెప్పాలని వుంటేే?"

"అవును అలా కూడా జరగవచ్చు. నువ్వామెమీద నిఘా వేస్తావా? ఈ రాత్రి ఆమె బ్లాక్ మెయిలర్ ని కలుసుకోవచ్చు. నువ్వొంటాడి అక్కడేం జరుగుతుందో చూడు-ఆమె అపాయంలో యిరుక్కోవచ్చు. మరో విషయం: దేవరాజ్ ఇప్పటివరకు తిరిగి యెందుకు రాలేదు? అతని కిడ్నాపింగ్ కథకు ఇంత సమయం అనవసరం. గంటలో తిరిగి వచ్చినా అతని మాటలు నమ్మశక్యంగానే వుంటాయి. దొంగలు డబ్బు లాక్కొని వదిలేయడానికి ఇంత సమయం కావాలా!"

జాన్ అన్నాడు, "డబ్బు చెల్లించడానికి బ్లాక్ మెయిలర్ ఏ సమయమిచ్చాడో యెవరికి తెలుసు? అతనా సమయంకోసం ఎదురు చూస్తూ ఆ గ్రీన్ షియట్ యువతితోనే వుంటాడు."

"బ్రదర్! ఈ గ్రీన్ షియట్ యువతి గొప్ప మిస్టరీగా తయారైంది కదూ?"

"ఆమె దేవరాజ్ కు సహాయపడుతోంది. కానీ,లాల్, నాకో విషయం అర్థంగావడం లేదు."

"ఏ విషయం?"

"బ్లాక్ మెయిలర్ ఎవరో సరస్వతి ఎలా తెలుసుకుంది?"

"అదే నాకూ అర్థంగావడంలేదు." కారా పేశాడు లాల్ - "నేనిప్పుడు రావ్ ని కలుసుకొని అతని గతాన్ని తవ్వి కొంతవరకు బ్లాక్ మెయిలర్ ని ట్రేస్ చేస్తాను.

నువ్వు సరస్వతిమీద జాగ్రత్తగా నిఘావుంచు. ఓ. కే?"

జాన్ తలూపి, కారు దిగి గుడ్ నైట్ చెప్పాడు.

## 5

జమునారావు లాల్‌ని చూసి ప్రాణాలు లేచివచ్చినట్లు కుర్చీలోంచి ఎగిరి ముందుకొచ్చాడు.

"మైగాడ్! ఎక్కడున్నారు? మీ ఆఫీసుకు డజను సార్లు ఫోన్ చేశాను!?

"దేనికి?"

"ఏ విషయం తెలుసుకోవడానికి!"

లాల్ నిట్టూర్చాడు. "కూర్చోండి. మీరేమీ కంగారు పడనవసరం లేదు. ఇంతవరకు అంతా సవ్యంగానే వుంది."

"అంటే? దేవరాజ్ క్షేమంగా వున్నాడా?"

"అవును. కాస్సేపట్లో వచ్చేస్తాడు. నేనిప్పుడే మీ కోడల్ని కలుసుకుని వస్తున్నాడు. ఆమెద్వారా విషయాలు కొన్ని తెలిశాయి."

రావ్ ముఖం చిట్లించాడు: "ఏమిటవి?"

"ఈ మొత్తం వ్యవహారానికి మూలాధారం మీ జీవిత రహస్యం. మీ రహస్యాన్ని కాపాడ్డానికే మీ కుమారుడు ఈ రిస్క్ తీసుకున్నాడు."

"దయచేసి విపులంగా చెప్పండి నా తల బద్దలవుతోంది!"

లాల్ సిగరెట్ వెల్గించి, క్షణ క్షణానికీ రంగులు మారుతున్న రావ్ ముఖం చూస్తూ అంతా వివరించి చెప్పాడు!

అంతా విని రావ్ మౌనంగా వుండిపోయాడు. కానీ గాంభీర్యం కోల్పోలేదు.

"మిస్టర్ రావ్ బ్లాక్ మెయిలర్ మీ కుమారుడికి ఫోన్ చేసి మీ డైరీ గురించి చెప్పి బెదిరించాడు. అప్పటి వరకు ఆ డైరీ గురించి దేవరాజ్ కు తెలియదు. అతను దాన్ని వెతికితీసి, చదివి, బ్లాక్ మెయిలర్ మాటలు నమ్మి దాన్ని నాశనం చేసి డబ్బు చెల్లించడానికి సిద్ధపడ్డాడు. ఆ డైరీలో విషయాలు తెలిసే అవకాశం ఎవరికి వుంది? మీ కోడలు బ్లాక్ మెయిలర్ ఎవరో తనకు తెలుసునని చెప్పింది. మీరు—"

"నో! రహస్యాలు ఎవరికీ తెలిసే వీలులేదు! నా సరస్వతికేమీ తెలియదు!"

"ఆమెకు తెలుసు. కాని ఏదో ఉద్దేశంతో దాస్తోంది. అలాగే మీరుకూడా—"

"నేనేమీ దాచడంలేదు! బ్లాక్ మెయిలర్ యెవరో నాకు తెలియదు!"

లాల్ అమాయకంగా వున్న రావ్ ముఖం చూసి చిన్నగా అడిగాడు. "తెలుసుకోవాలని వుందా?"

"అసలు దేవరాజ్ ఈ బ్లాక్ మెయిల్ గురించి నాకెందుకు చెప్పలేదు?"

"చెబితే మీ రహస్యం అతను తెలుసుకున్నందుకు మీరవమానం ఫీలవుతారని."

"అసలు నా రహస్యాలు బ్లాక్ మెయిలర్ కెలా తెలుసు? మీరు చెప్పినదాన్నిబట్టి చూస్తే ఆ డైరీలో నలభైయేళ్ళ క్రితం నా జీవితంలో ముఖ్యమైన ఘట్టం ప్రస్తావన వుంది. అప్పటి పరిచయస్థులిప్పుడెవరూ లేరు. వున్నా నన్ను గుర్తించలేరు. నేను చేసిన పాప కార్యాలకి తగిన మూల్యం చెల్లించి ఆ జీవితానికి స్వస్తి చెప్పాను. వాళ్ళతో నా సంబంధాలప్పుడే తెగిపోయాయి—"

"ఎవరువాళ్ళు?"

రావ్ వెంటనే చెప్పలేదు. లాల్‌ని సూటిగా చూసి, "అవన్నీ ఇప్పుడెందుకు?" అన్నాడు.

"బ్లాక్‌మెయిలర్ యెవరో తెలుసుకునేందుకు. అతను మళ్ళీ మళ్ళీ పీడించకుండా మార్గం కనిపెట్టేందుకు. అఫ్‌కోర్స్, దేవరాజ్‌కు అతనెవరో తెలిసివుండవచ్చు, కాని అతను చెప్పడు."

రావ్ నిట్టూర్చాడు: "మిస్టర్ లాల్, గతంలో నా నేర జీవితాన్ని పురస్కరించుకుని ఇప్పుడు నన్ను సర్వ నాశనం చెయ్యడానికి ప్రయత్నాలు జరుగుతాయని నేనెప్పుడూ అనుకోలేదు. ఆ జీవితాన్ని పీడకలగా మర్చిపోయాను. దాన్ని కప్పిపుచ్చడానికి అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాను. చేసిన నేరాలకు శిక్ష అనుభవించాక పశ్చాత్తాపం చెంది, మంచివాడుగా మారాలనుకునే వ్యక్తిని సమాజం ఆదరించకపోవడం విచారకరం —

"ఇరవైయేళ్ళ వయసులో నేను యిల్లువిడిచి పారిపోయాను. నా తాగుబోతు తండ్రితో, నోటి దురుసుగల తల్లితో పిచ్చెత్తిపోయి ఇల్లు వదిలేశాను. చేతిలో నయా పైసా లేకపోయినా వైజాగ్ నుంచి బొంబాయి వరకు దొంగతనంగా ప్రయాణించాను. నా ధ్యేయమేమిటో తెలియదు. గమ్యమేమిటో తెలియదు. కానీ ధైర్యముంది. చాకచక్యం వుంది. ఈ రెండే నాకు జీవనోపాధిని కల్పించాయి....

"మొదట బొంబాయిలో అడుగుపెట్టిన క్షణాన ఏం చెయ్యాలో తోచలేదు. పొట్టగడవకపోతే కొన్నాళ్ళు పేవ్‌మెంట్లమీద అడుక్కున్నాను. కానీ అది నన్నసహ్యిం చింది. ఆత్మవిమర్శ చేసుకున్నాను. అడుక్కుతినడంకంటే

దొంగతనమే నయమనిపించింది. వెంటనే జేబులు కత్తిరించడం ప్రారంభించాను. ఒకటి రెండుసార్లు పట్టుబడ్డానుకూడా—కాని పోలీసుల చేతిలో పడకుండా జనంచేత చిత్తుగా తన్నులు తిన్నాను.

"నేనేమీ ధైర్యం కోల్పోలేదు. నాలో యింకా మొండి ధైర్యం ప్రవేశించింది. ఆడవాళ్ళమీద దౌర్జన్యం చేసి నగలు దోచుకున్నాను. వాళ్ళ పిల్లల్ని యెత్తుకుపోయి చంపేస్తానని బెదిరించి డబ్బు లాగాను. చెయ్యాని పని అంటూ లేకుండా అన్నిరకాల నీచ కార్యాలు చేశాను. పూర్తిగా నేరస్థుడైపోయాను.

"అప్పటికి సంవత్సరం గడిచింది. సంపాదన బాగానే వుంటోంది. ముందుకు చూసుకెళ్ళడం తప్ప. వెనక్కి చూసుకోలేను. నా తల్లిదండ్రులను గురించి యెప్పుడో మర్చిపోయాను. ఆ సంవత్సరం చివర నాకో ముఠాతో పరిచయమైంది. వాళ్ళు బందిపోట్లు. వాళ్ళతో కలిశాక నా సంపాదన ఇంకా పెరగడమేగాక, అన్నిరకాల సదుపాయాలూ యేర్పడ్డాయి.

"ఆ ముఠాతో చేతులు కలపకపోతే ఈరోజు నేనొక బాధ్యతగల పౌరుడిగా మీ ముందు వుండేవాడినికాదు."

"ఆ ముఠాతో మీరేం చేశారు?"

రావ్ అన్నాడు, "ఆ ముఠాలో నాతో కలిపి పది మంది వున్నారు. బొంబాయి పరిసరాల్లోని గ్రామాల్ని దోచుకోవడం వాళ్ళ పని. వాళ్ళతో కలిసిన కొద్దిరోజులకే మేం బొంబాయి దగ్గర్లో గ్రామానికి చెందిన ఓ ఠాకూర్ యింటిని దోచుకొని హత్య చేశాం. అదే మా చివరి దురాక్రమణ. వారం రోజుల్లో అంతా పట్టుబడ్డాం. ఠాకూర్ హత్యలో మా అందరికీ ఉరిశిక్షలు పడేవి-కాని,

అదృష్టవశాత్తు ఆ సంఘటన జరిగినప్పుడు సాక్షులున్నారు. వాళ్ళ సాక్ష్యంతో మాలో ఠాకూర్‌ని చంపినవాడికే ఉరిశిక్ష పడింది."

"మిగతా వాళ్ళకు?"

"పదేసి యేళ్ళు జైలు శిక్ష. కానీ నాకు మూడేళ్ళు పడింది. ఇదివరకు నాకు రికార్డు లేదు. పైగా చిన్న వయసు. అప్పుడే నేర జీవితంలోకి ప్రవేశిస్తున్నాను. కానీ మిగతా వాళ్ళంతా పరమ దుర్మార్గులు. చాలా కాలంగా వాళ్ళని పోలీసులు గాలిస్తున్నారు. వాళ్ళమీద యెన్నో దోపిడీ కేసులున్నాయి."

"మీ జైలు జీవితం యెలా గడిచింది?"

"ఆ మూడేళ్లలోనే నాలో పరివర్తన కలిగింది. నేర జీవితానికి స్వస్తి చెప్పి-నీతిగా, నిజాయితీగా జీవించాలని గట్టిగా నిశ్చయించుకున్నాను. ఆ డైరీ నేను జైల్లోనే వ్రాశాను. అందులో నా అనుభవాలు వ్రానుకుంటూ జీవితాన్ని సమీక్షించుకునేవాడిని."

"శిక్ష పూర్తయ్యాక తిరిగి స్వస్థలం వెళ్ళాలనిపించింది. కాని అక్కడ నా తల్లిదండ్రులు లేరు. సంవత్సరం క్రితం బస్సు ప్రమాదంలో చనిపోయారు. నాకు తోబుట్టువులు లేరు. ఉన్న యింటినీ భూమినీ అమ్మేసి డబ్బుతో వైజాగ్ వదిలేశాను. మద్రాసు వెళ్ళి వ్యాపారం ప్రారంభించాను. అయిదేళ్ళలో బాగా డబ్బు గడించి, గౌరవం గల కుటుంబంలోని అమ్మాయిని వివాహం చేసుకున్నాను. ఆమె అయిదేళ్ల తేడాతో యిద్దర్ని కని కన్నుమూసింది.

"ఇక నాకు మద్రాసులో వుండ బుద్ధిగాలేదు. వ్యాపారం, ఆస్తులు అమ్మేసి పిల్లలతో ఇక్కడికొచ్చాను ముప్ఫైయేళ్ళ క్రితం. ఇంతవరకు నా గతం గురించి ఎవరికీ

తెలియదు. నాకూ జ్ఞాపకం లేదు-దాన్ని బొంబాయిలోనే సమాధి చేశాను. కాని, ఇన్నేళ్ళ తర్వాత నా రహస్యం యెవరు తెలుసుకోగలిగారో ఆలోచించలేక పోతు న్నాను...."

"ఈ ముప్ఫై యేళ్ళల్లో మీ బొంబాయి స్నేహితు లెవరూ తారసపడలేదా?"

"లేదు ఒకడికి ఉరిశిక్ష పడింది. మిగతావాళ్ళు పదేళ్ళ తర్వాత విడుదలయ్యారు, వాళ్ళెప్పుడూ తారసపడ్లేదు. నా అవసరం వాళ్ళ కేమిటి? ననెప్పుడో మర్చిపోయి వుంటారు...."

"మరిప్పుడు మిమ్మల్ని బెదిరించే దెవరు?"

"ఏమో! యిప్పుడు ఆ ముఠాలో యెవర్నీ గుర్తు పట్ట లేను-వాళ్ళు నన్ను గుర్తుపట్టవచ్చు. ఒకవేళ వాళ్ళలో ఎవరైనా...."

లాల్ అన్నాడు. "వాళ్ళని అనుమానించడం అనవ సరం. వాళ్ళు వయసులో మీకంటే పెద్దవాళ్ళు. వాళ్ళి ప్పుడు కనీసం డెభ్భై యేళ్ళు పైబడ్డవాళ్ళయి వుంటారు. అంతేగాక వున్నారో, పోయారో కూడా చెప్పడం కష్టం."

"పోతే, నలభైయేళ్ళ క్రితం మీ బొంబాయి జీవితం గురించి తెలిసిన వ్యక్తి యెవరైనా-అతను మీ డైరీ ద్వారానే ఇటీవల తెలుసుకున్నాడు. కాబట్టి జాగ్రత్తగా ఆలోచించి సమాధానమివ్వండి. మీ డైరీలు చదివే అవ కాశం ఎవరికుంటుంది?"

రాన్ వెంటనే అన్నాడు, "ఎవరికీ వుండదు! పదేళ్ళ క్రితం వరకు డైరీలు వ్రాశాను. అవన్నీ బీరువాలో క్రింది అరలోనే వున్నాయి. ఇప్పుడు నాకున్న స్నేహితులంతా

మర్యాద స్తులు. ప్రాణమిచ్చేవాళ్ళు. ఆ డైరీ యెవరైనా చదివారంటే అది దేవరాజ్ ఒక్కడే."

లాల్ లేచాడు. "ఓ. కే. డైరీ బ్లాక్ మెయిలర్ చదివాడు. అతనెవరో మీ కోడలికి తెలుసు. ఆమె నేమీ అడక్కండి. ఇంటికెళ్ళాక మీరామెతో మామూలుగా మాట్లాడి నిద్రపోండి. ఆమె విషయం మాకొదిలేయండి. ఏమంటారు?"

రావ్ మాట్లాడలేదు. తలూపి, తీవ్రంగా ఆలోచనల్లో పడ్డాడు. లాల్ వెనక్కి తిరిగి బయటకడుగు లేశాడు.

# 6

ఆ ఇంటిముందు పోలీసు కారువద్ద ఇన్స్పెక్టర్ కృష్ణన్ నిలబడి వున్నాడు. చుట్టూ అతని బలగం వుంది.

డిటెక్టివ్‌లు కారు దిగి కృష్ణన్‌తో కరచాలనం చేశారు.

"హత్య రిపోర్టు యెవరిచ్చారు?" లాల్ అడిగాడు.

"ప్రక్కింటాయన. అతను కాంపౌండ్ దగ్గర మొక్కలకు పాదులు తవ్వుతోంటే కిటికీలోంచి శవం కనిపించింది." అన్నాడు సబ్ ఇన్స్పెక్టర్.

"శవాన్ని చూద్దాం." అని లాల్ గేటులోంచి లోనికి నడిచాడు. అందరూ వెంబడించాడు. లాల్ జాగ్రత్తగా యింట్లోకి ప్రవేశించి పడగ్గదిలోనికి వెళ్ళాడు. గదిలో తెరిచివున్న కిటికీదగ్గర బెడ్ మీద శవం తల క్రిందికి వ్రేలాడుతూ, తెరిచివున్న కళ్లతో స్పష్టంగా కన్పిస్తోంది.

లాల్ శవాన్ని పరీక్షగా చూసి, "దేవరాజ్ పోలికలున్నాయి-ఇతను నరేంద్ర" అన్నాడు.

"ఇతనెవరో మీకు తెలుసా?" కృష్ణన్ అడిగాడు.

"తెలుసు. వివరాలు తర్వాత చెప్తాను." లాల్ శవం మీదికి వంగి చూడసాగాడు. శవం వొంటిమీద గుండెలో కడుపులో రెండు కత్తి గాయాలున్నాయి. గాయాల నుంచి రక్తం కారి దేహంమీద అంటుకొని గడ్డకట్టి గదిలో ఎక్కడా రక్తం మరకలు లేవు. బెడ్ మీద దుప్పటి శుభ్రంగా వుంది. శవం ఒంటిమీద ప్యాంటు మాత్రమే వుంది. షర్టు కుర్చీలో వుంది. శవం కాళ్లకు పాదరక్షలు లేవు.

"లాల్, ఈ శవం చెప్పే కథ వేరుగా వుంది!" జాన్ గుసగుసలాడాడు.

లాల్ తలూపాడు.

కృష్ణన్ గదిలో చుట్టూ కలయజూసి, "ఈ హత్య ఇక్కడ జరగలేదు." అన్నాడు.

లాల్ మళ్ళీ తలూపాడు.

ఫోటోగ్రాఫర్స్ శవాన్ని ఫోటోలు తీశాక, డాక్టర్ పరీక్షించాడు.

"రిగర్ మార్టిస్ ఇంకా దేహమంతటా ప్రారంభం కాలేదు. చావు సుమారు నాలుగైదు గంటల క్రితం—అంటే తెల్లవారుఝామున ఎప్పుడైనా సంభవించి వుండవచ్చు."

డాక్టర్ ఈ మాటలు చెప్పి, గ్లోవ్స్ తొడుక్కున్న చేతులతో శవం జేబులు వెతికాడు. ఒక తెల్లటి కర్చీఫ్, తాళాల గుత్తి తీసి కృష్ణకు అందించాడు.

జాన్ కర్చీఫ్‌ని చూసి కృష్ణన్ దగ్గరకెళ్లాడు, "ఆగండి దాన్నిలా యివ్వండి! దానిమీద ఏవో మరకలున్నాయి."

కృష్ణన్ అందించిన కర్చీఫ్‌ని జాన్ మడత విప్పి

చూశాడు. దానిమీద అక్కడక్కడ పసుపు, ఎరుపు రంగులో కలిసిన మరకలున్నాయి.

"ఇవి వంట పదార్థపు మరకలు...."

లాల్ కర్చీఫ్ అందుకుని వాసన చూశాడు. సార్జంట్ వైపు తిరిగి గ్లాసులో నీళ్ళు తెమ్మన్నాడు. సార్జెంట్ నీళ్ళు తెచ్చాక ఆ మరకల్ని కొద్దిగా తడిపి, గాఢంగా వూపిరి పీల్చి వాసన చూశాడు.

"ఇది చేపకూర వాసన!"

"ఎక్కడ తిన్నాడు? నిన్న సరస్వతి చేపకూర వండి వుండదు, భర్త కన్పించని దిగులుతో మరి—"

"బయట తిని వుంటాడు." లాల్ అన్నాడు, "ఈ విషయం అంత ముఖ్యమైనదా? వెల్, చేపకూరతో బాటు విస్కీ కూడ సేవించి వుండాలి. డాక్టర్ వీలైనంత త్వరగా మీ పోస్టుమార్టమ్ పూర్తికావాలి. కమాన్, కృష్ణన్. ఇంటినోసారి చూద్దాం."

కృష్ణన్‌తో కలసి డిటెక్టివ్‌లు ఇల్లంతా గాలించారు. పడగ్గది, బాత్‌రూం తప్ప ఇంట్లో యే ప్రదేశమూ ఉపయోగించినట్టు కన్పించలేదు. రెండు గదులు ఖాళీగా దుమ్ము పట్టివున్నాయి. కిచెన్ తాళం వేసివుంది. కానీ కిటికీ తెరిచివుంది. లోపల వంట సామగ్రి యేదీ లేదు.

బాత్‌రూంలో షవర్ లేదు, టాప్ లేదు. రెండు ప్లాస్టిక్ బకెట్‌లున్నాయి. ఒకదాంట్లో నిండా నీళ్ళున్నాయి. నీటిపైన ప్లాస్టిక్ మగ్గు తేలుతోంది. స్టాండు మీద టవల్ వ్రేలాడుతోంది. దాన్ని నీళ్ళల్లో పిండి ఆరేసినట్లు ఇంకా తడిగా వుంది. దానిమీద అక్కడక్కడ అస్పష్టమైన యెర్రటి మరకలున్నాయి.

లాల్ పెరట్లో కెళ్ళే తలుపు గడియ తీసి బయటి

వెళ్ళాడు. పెరట్లో ఓ మూల బావి వుంది. మరోమూల గోడనానుకుని వేపచెట్టు వుంది. దాని కొమ్మలు కొన్ని వెనుక వీధిలోకి వెళ్ళాయి. వాటిలో ఒక కొమ్మ విరిగి పోయి వ్రేలాడుతుండటం లాల్‌కు కన్పించింది.

గబగబ చెట్టుదగ్గరకు వెళ్ళి నేలమీద చూశాడు. నేల చెదిరిపోయివుంది. వెంటనే పెరటి తలుపు తీసి బయట కెళ్ళాడు. వెనుక సిమెంటురోడ్డుతో సన్నటి వీధి వుంది. జనసంచారం లేదు. విరిగిన కొమ్మ వీధిలోకి వేలాడు తోంది. లాల్ అక్కడకెళ్ళి చూశాడు. పెరటి గోడ నానుకొని మురికికాలువ వుంది. సరిగ్గా ఆ విరిగిన కొమ్మ క్రింద, కాలువ అంచుమీద బురదలో తడిసిన ఒకఅడుగు జాడ వుంది.

లాల్ దాన్ని పరీక్షగా చూశాడు:

"వెల్! ఇది ఆడవాళ్ళ హీల్ చెప్పు. సైజు, ఆకారం, హీల్ భాగం వైశాల్యం, హీల్ భాగానికీ-పాదం నేలను తాకే భాగానికీ మధ్య దూరం ఆవిషయం రుజువు చేస్తాయి."

కృష్ణన్, జాన్‌లు తలలూపారు.

"ఇంట్లోకి ప్రవేశించిన స్త్రీ యెవరో ఈ కొమ్మ ద్వారా గోడ దూకబోయి కాలువలో పడింది," మళ్ళీ అన్నాడు లాల్.

"ఆడవాళ్ళు గోడలు దూకడమేమిటి? చీర ఒప్పు కోదు!" అన్నాడు కృష్ణన్.

జాన్ నవ్వాడు: "నేను ఒప్పుకుంటాను. చీర విప్పేసి...."

"షటప్, నువ్వసలే డర్టీ పార్ట్‌నర్‌వి!" కసిరాడు లాల్. ఆ తర్వాత ప్రశాంతంగా అన్నాడు, "ఈ గోడ

పదడుగుల యెత్తు వుంది. కొమ్మలు పన్నెండు అడుగుల ఎత్తులో వున్నాయి. ఆమె పైకెగిరి ఆ కొమ్మను అందుకుంది. కానీ అది విరగడంతో క్రింద పడింది. మళ్ళీ ఎగిరగట్టి కొమ్మ పట్టుకుంది. ఈసారి విరగలేదు. ఆమె కొమ్మ ద్వారా గోడ చేరుకొని, ఆ తర్వాత చెట్టుద్వారా లోనికి దిగింది.

"ఆమె యింత రిస్కు తీసుకోవాల్సిన అవసరం లేదు. కాని హత్య తెల్లవారుఝామున జరిగిందని డాక్టరు అన్నాడు. ఆ సమయంలో యింటిముందునుంచి వస్తే యెవరైనా చూడవచ్చు, అందువల్ల నిర్మానుష్యంగా వుండే ఈ వెనుక దారి యెన్నుకుంది."

"హత్య యిక్కడే జరిగిందంటున్నారా?"

"ఎందుకు జరక్కూడదు? రక్తం మరకలు లేనంత మాత్రాన శవం బయటినుండి వచ్చిందనుకుంటారా? ఆమె దేనికో భయపడి రక్తం శుభ్రం చేసింది. టవల్ ఉతికి బాత్‌రూంలో ఆరేసింది."

"మరి శవం స్థితి గురించేమిటి?" కృష్ణన్ అడిగాడు. "బెడ్ కిటికీ దగ్గర గోడనానుకొని వుంటే శవం కాళ్ళు కిటికీవైపు, తల క్రిందికి వ్రేలాడుతూ తలుపువైపుకు ఎలా వున్నాయి? హంతుడు కిటికీ దగ్గర నిలబడే స్థలం లేదు. బెడ్ కివతల నిలబడాలి. కత్తిపోట్లు తింటే వెల్లికిలా కిటికీవైపు పడిపోవాలి. కాళ్ళు ద్వారంవైపు క్రింద వ్రేలాడుతూ వుండాలి.... కాని, శవ స్థితి అందుకు పూర్తిగా భిన్నంగా వుంది!"

లాల్ అన్నాడు. "బహుశ శవాన్ని కదిల్చి వుండవచ్చు. మీరన్నట్టు జరిగివుంటే బెడ్ మీద రక్తం కారు

తుంది. హత్య యిక్కడ జరగలేదని మనల్ని తప్పుదు మార్గం పట్టించడానికి శవాన్ని కదిల్చి, దుప్పటి మార్చే సింది. కనుక శవ సిితి మారింది. ఎలిబీ కాపాడుకోవడం ఆమె ముఖ్యోద్దేశం."

"మరి చావుకేక? యెవరికీ యెందుకు విన్పించలేదు?"

"హతుడు బాగా తాగివుండాలి. ఆ నిమిషాలో యేం జరుగుతుందో అతనికి తెలిసివుండదు. కేక వెలువడకుండా ఆమె జాగ్రత్త తీసుకుంది."

"అంతేకాదు ఆమె మరింత తెలివిగా హతుడి పాద రక్షలు మాయంచేసింది." అన్నాడు జాన్. "కానీ— నరేంద్ర చావు నన్ను తికమకపెడుతోంది! రాత్రి నేను రావ్ ఇంటి దగ్గర నిఘావున్నాను. పదకొండు గంటల వరకు బయటికెవరూ రాలేదు. పది నిమిషాల తర్వాత మనం అనుకున్నట్టు సరస్వతిగాక నరేంద్ర వచ్చాడు. నేనాశ్చర్యపడ్డాను. సరస్వతి బ్లాక్ మెయిలర్ గురించి నరేంద్రకు చెప్పి అతన్ని పంపిస్తోందనుకున్నాను.

కాబట్టి, అతన్ని వెంటాడి షాలిమార్ హోటల్ చేరు కున్నాను. అక్కడే అతను నా కళ్ళుగప్పి మాయ మయ్యాడు. నేను చాలా అప్ సెట్ అయ్యాను. నరేంద్రకు నేను వెంటాడుతున్నట్లు అనుమానం వచ్చి హోటల్లో నన్ను తికమకపెట్టి, వదిలించుకుని అదృశ్యమయ్యాడు.

చేసేదిలేక నేను తిరిగి ఇంటికొచ్చి అతని రాక కోసం ఎదురుచూడసాగాను. ఉదయం అయిదుగంటలవుతున్నా అతను యింటికి రాలేదు. నేను తిరిగి వచ్చేశాను."

లాల్ నవ్వాడు "మనం పొరబడ్డాం! నరేంద్ర బ్లాక్ మెయిలర్ అని మనం పసిగట్టివుంటే అతని హత్య జరిగేది

కాదు. ఈ ఇంటిని అతను బ్లాక్ మెయిల్ కలాపాలకోసం యన్నుకున్నాడు. రాత్రి అతను ఇంటినుంచి బయలుదేర నప్పుడు సరస్వతి పంపిస్తోందని నువ్వు పొరబడి వెంటా డావుగానీ, నీ వెనుకే సరస్వతి కూడా బయలుదేరింది. ఈ ఇల్లు నీకు తెలియదు. సరస్వతికి తెలుసు. ఆమె ఇక్కడి కొచ్చి నరేంద్రను చంపి వెళ్ళిపోయింది."

"నేనామె ఇంటిదగ్గర నిఘా వున్నాను. ఆమె తిరిగి రాలేదు."

"నువ్వక్కడ అయిదు గంటలవరకే వున్నావు. హత్య తెల్లవారుఝామున జరిగింది. నువ్వెళ్ళిపోయాక ఆమె ఇంటి కొచ్చింది."

లాల్ కృష్ణన్ వైపు తిరిగి మళ్ళీ అన్నాడు. "మేం సరస్వతిదగ్గరకు వెళ్తున్నాం. ఇక్కడ మీ పని పూర్తి చేసుకుని వీలైనంత త్వరగా అన్ని రిపోర్ట్సుతో మా ఆఫీసుకు రండి!"

# 7

జాన్ వరండా చేరుకొని కాలింగ్ బెల్ నొక్కాడు. కొన్ని క్షణాలయ్యాక తలుపు తెరుచుకుంది. లాల్ లోనికి తొంగిచూసి పెద్దగా అరిచాడు:

"వెల్, వెల్, వెల్, మిస్టర్ దేవరాజ్! యెప్పు డొచ్చారు? కులాసేనా?"

దేవరాజ్ ఉలిక్కిపడి వెనక్కి జరిగాడు. లాల్ ముందుకు వెళ్ళాడు. దేవరాజ్ ముఖంలో నెత్తురుచుక్క లేదు. వేలు పెట్టి చూపిస్తూ, వణుకుతున్న పెదవులతో, "మీరు-మీ రెవరు?" అన్నాడు.

"మీ డాడీ నియమించిన డిటెక్టివ్‌లం. మీ కోసం గాలిస్తున్నాం."

జాన్ అన్నాడు, "మీరెప్పుడొచ్చారు? మీ డాడీ యెక్కడున్నారు?"

దేవరాజ్ వెంటనే అర్చాడు. "నేనిప్పుడు బాగానే వున్నాను. నన్నేమీ అడక్కండి! ప్లీజ్ గెటవుట్!"

ప్రక్క గదిలోంచి రావ్ వేగంగా బయటకొచ్చాడు.

"మిస్టర్ లాల్! యెక్కడున్నారు? రాత్రి - ఈ ఉదయం ఫోన్ చేశాను!"

"మేం మరో పనిమీద వెళ్లాం. దేవరాజ్ యెప్పుడొచ్చాడు?"

"డాడీ! నే నిప్పుడెవరితోనూ మాట్లాడను!"

"మిస్టర్ దేవరాజ్ మిమ్మల్ని చాలా విషయాలడగాలి."

"మిస్టర్ లాల్! అతన్నింకా అప్ సెట్ చెయ్యకండి! ఈరోజు రెస్టు తీసుకోనివ్వండి." దేవరాజ్ వైపు తిరిగి మళ్ళీ అన్నాడు రావ్-"నువ్వు పైకి వెళ్ళు! నేను వీళ్ళతో మాట్లాడి పంపిస్తాను."

దేవరాజ్ వెనక్కి తిరిగి వేగంగా మెట్లెక్కి పైకెళ్ళిపోయాడు.

"మిస్టర్ లాల్, ఇక అంతా మర్చిపొండి! దేవరాజ్ యేం చేసినా నా మంచికే చేశాడు! ఇక మీరేమీ చెయ్యనవసరం లేదు! ఆఫీసుకెళ్ళి మీకు చెక్కు పంపిస్తాను."

రావ్ కళ్ళలోకి సూటిగా చూశాడు లాల్.

"మిస్టర్ రావ్,వ్యవహారం ఇంతటితో ముగిసిపోలేదు. ఇప్పుడే ప్రారంభమైంది.చాలా దురదృష్టకరంగా చాలా-"

"ఏమిటి? దేవరాజ్ ఇంకేం చేశాడు?"

"రాత్రి అతను యెప్పుడొచ్చాడు?"

"సరిగ్గా పన్నెండు గంటలకు."

"ఏం చెప్పాడు?"

"మీరు వూహించిన కథే! కార్లో లిఫ్ట్ ఇస్తామని యెవరో అతన్ని యెత్తుకుపోయి బంధించి డబ్బు లాక్కున్నారట. చాలా గాభరాగా కన్పించాడు. నేనేమీ అడగలేదు. క్షేమంగా తిరిగి వచ్చినందుకు సంతోషం వ్యక్తం చేశాను.

"మిస్టర్ లాల్, దేవరాజ్ అబద్ధం చెప్పాడని నాకు తెలుసు. నా పరువుకోసం అబద్ధం చెప్పాడు. అతను నాకోసం ఈ సాహసానికి పూనుకోవడం నా కెంత గర్వంగా వుందో తెలుసా? అతను ఈ రిస్క్ తీసుకోక పోతే యేం జరిగివుండేదో! జరిగిందేదో బాగానే జరిగింది. మళ్ళీ ఆ వ్యవహారంలో వేలు పెట్టి బ్లాక్ మెయిలర్ ని రెచ్చగొట్టడం మంచిది కాదు. అతను మళ్ళీ బ్లాక్ మెయిల్ చెయ్యడని-"

"అతను మళ్ళీ బ్లాక్ మెయిల్ చెయ్యలేడు."

"ఓహో! మీ కెలా తెలుసు?"

"బ్లాక్ మెయిలర్ చనిపోయాడు."

"చనిపోయాడా!"

"హత్య చేయబడ్డాడు."

"మైగాడ్! యెవరు చేశారు!"

"ఇంకా తెలియదు."

"ఆ బ్లాక్ మెయిలర్ ఎవరు?"

"మీ రెండవ కుమారుడు నరేంద్ర."

రావ్ ముఖంలో రక్తం వేగంగా ప్రవహించి కందగడ్డలా మారిపోయింది. కొన్ని క్షణాలు నిశ్చలంగా, ఆ తర్వాత కఠినంగా చూసి, హఠాత్తుగా లాల్ భుజాలు

పట్టుకొని కుదిపేస్తూ అరిచాడు:

"అసంభవం! నేను నమ్మను! నరేంద్ర! బ్లాక్ మెయిలర్! నో! అతను చావడానికి వీల్లేదు! వీల్లేదు!"

గదిలోంచి సరస్వతి వేగంగా బయటికొచ్చింది. జాన్‌ని చుర చుర చూసి, ఉద్రేకంతో, "మళ్ళీ వచ్చారా! మీ కేం చెప్పాను! రాత్రి జరిగిన సత్కారం జ్ఞాపకం లేదా?" అనర్చింది.

"జ్ఞాపకం వుంది కానీ మీరు-" జాన్ అన్నాడు.

"ఓహ్ యెందుకిలా విసిగిస్తున్నారు? మా వ్యవహారాల్లో ఎందుకు జోక్యం చేసుకుంటున్నారు? తక్షణం వెళ్ళండిక్కడ్నుంచి! లేదా—"

జాన్ నవ్వాడు. "ఇప్పుడు ఇది మీ వ్యవహారం కాదు; పోలీసు వ్యవహారం."

సరస్వతి హఠాత్తుగా చల్లబడింది: "పోలీసులా! దేనికి?"

లాల్ రావ్‌ని విడిపించుకొని, సరస్వతి ముఖంలో మార్పుల్ని జాగ్రత్తగా గమనిస్తూ అన్నాడు: "మీతో ఏకాంతంగా మాట్లాడాలి. ప్లీజ్, వెళ్ళండి. యెక్కడ వుంటారు?"

సరస్వతి తడబడింది, "కి—కిచెన్‌లో."

"వెళ్ళండి నేనిప్పుడే వస్తాను." సరస్వతి వెళ్ళేవరకు చూసి, రావ్ వైపు తిరిగాడు లాల్, "మిస్టర్ రావ్, ఐయాం వెరీ సారీ. మీ కుమారుడు బ్లాక్ మెయిలర్ అని మేం అనుకోలేదు.... మీ కోడలికి తెలిసినా చెప్పలేదు. ఇంటిగుట్టు బయట పెట్టడం ఆమె కిష్టం లేదనుకుంటాను. కానీ, బ్యాడ్‌లక్! నరేంద్ర చనిపోయాడు...."

రావ్ బలవంతంగా దుఃఖం ఆపుకుంటూ అన్నాడు,

"ఎవరు చంపారు? చెప్పండి! వాడ్ని చంపిందెవరు?"

"ప్రస్తుతం యేమీ చెప్పలేం. మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకోండి. మీ కుమారుడు మీ రహస్యాల తోనే ఆటలాడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు. కొన్ని రహస్యాలు గుండెలోనే దాచుకోవాలి, డైరీలో కాదు. ఇప్పుడు విచారించి లాభంలేదు. శవం పోస్టుమార్టమ్‌లో వుంది, మధ్యాహ్నంవరకు అప్పగించవచ్చు...."

లాల్ తల వంచుకొని అక్కడునుంచి కదిలి, గబగబ కిచెన్‌లోకి నడిచాడు. అతని వెంట జాన్ వెళ్ళాడు.

కిచెన్‌లో సరస్వతి స్టూలుమీద కూర్చొని వెక్కి వెక్కి యేడ్వసాగింది.

"నాకు తెలుసు! మీరేం చెప్పడానికి వచ్చారో నాకు తెలుసు! ఇందాక అంతా విన్నాను-నరేంద్ర చనిపోయాడనే కదూ మీరు చెప్పదల్చుకుంది? ఓహ్! ప్లీజ్ వెళ్ళండి! నన్ను వంటరిగా వదలండి! ఇదంతా ఏమిటో నాకేమీ అర్థంగావడంలేదు! యేమీ పాలుపోవడంలేదు! నన్నింకా—"

"క్షమించండి ఇలాంటి పరిస్థితిలో కూడా మా డ్యూటీ చెయ్యాక తప్పదు."

"ఏమిటి మీ డ్యూటీ! మనిషిపోయి యేడుస్తొంటే మా మీద మీ కేమాత్రం కనికరం లేదా?"

"క్షమించండి. మా వృత్తి అలాంటిది. మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగాలి."

"ఏం ప్రశ్నలు? వెధవ ప్రశ్నలు! మీ జీవితాల్లో సుప్పావు వంతు ప్రశ్నలతోనే గడిచిపోతుంది—"

"నరేంద్ర బ్లాక్ మెయిలర్ అని మీ కెప్పుడు తెలిసింది?"

"నిన్న రాత్రి. కానీ—వారం క్రితం ఆతను మధ్యాహ్నం పూట మామయ్య గదిలో చాలా సేపు గడ పటం గమనించాను. అత నేదో నవల చదువుతూ కన్పిం చాడు గాని, ఒకటి రెండు సార్లు నే నా గదిలోకెళ్ళి నప్పుడు అతని చేతిలో మరో పుస్తకం చూశాను. అలా టిదే అయిదు రోజుల క్రితం మా వారు చదువుతుండగా చూశాను. రాత్రి మీతో మాట్లాడినప్పుడు వాళ్ళిద్దరు చదివింది మామయ్య డైరీ అని తెలుసుకున్నాను."

"అప్పుడేం చేశారు?"

"మావారు బ్లాక్ మెయిల్ లో ఇరుక్కున్నారని మీ రన్నప్పుడు, ఆ పని నరేంద్ర చేస్తున్నాడనుకున్నాను. వరుసగా నాలుగు సాయంత్రాలు మావారికి ఫోన్ వచ్చి నప్పుడు నరేంద్ర ఇంట్లో లేడు. బయట యెక్కడినుంచో గొంతు మార్చి మాట్లాడి వుంటాడు. అత నే బ్లాక్ మెయి లర్ అని నా కనుమానం కలిగింది."

"అప్పుడేం చెయ్యాలనుకున్నారు?"

"ఏం చేస్తాను! ఆ విషయం మీకు చెప్పి ఇంటిగుట్టు రట్టు చెయ్యనా? నరేంద్రను పోలీసులకు పట్టివ్వనా? నా స్థానంలో యెవరైనా వుంటే అలాగే చేసేవారేమో గానీ—నరేంద్ర అంటే నాకు చాలా యిష్టం. అతనూ నన్ను అభిమానిస్తాడు. అత నే తప్పుచేసినా నే నెవరికీ చెప్పను. అతన్ని మందలిస్తాను. ఇప్పుడుకూడా అలాగే చెయ్యాలనుకున్నాను. కానీ రాత్రి నేను పలకరించలేదు. మా వారు తిరిగి వచ్చాక—అంతా సర్దుకున్నాక—రహ స్యంగా మందలించాలనుకున్నాను. అందుకే మిమ్మల్ని విరమించుకోమన్నాను."

లాల్ ఆమె మాటలు విని తీక్షణంగా చూస్తూ

అన్నాడు: "రాత్రి మీరు ఏ చీరలో వున్నారు?"

"ఇదే చీర—ఎందుకు?"

లాల్ చీరను పరీక్షగా చూడసాగాడు.

"నేనొక ప్రశ్న అడుగుతాను జవాబిస్తారా?"

ఆమె సందేహిస్తూ అంది, "అడగండి."

"చీర కట్టుకున్న స్త్రీ చెట్టుకొమ్మ ఆధారంగా పదడుగుల గోడ యెక్కగలదా?"

ఆమె ముఖం చిట్లించింది: "ఈ ప్రశ్న దేనికి?"

"నాకో అయిడియా వుంది—దాన్ని జోడించడానికి."

ఆమె డిటెక్టివ్‌లను అనుమానంగా చూస్తూ అంది, "చీర కట్టుకుని వేగంగా పరుగెత్తడమే కష్టం. అడుగులు దగ్గర దగ్గరగా పడుతూ యెక్కువ దూరం పరుగెత్తకుండానే ఆయాసం వచ్చేస్తుంది. అడుగులు దూరంగా పడాలంటే కాళ్ళు విశాలంగా జాపే వీలుండాలి. గోడ యెక్కడానిక్కూడా ఈ అవకాశమే వుండాలి. చీర కట్టుకుంటే ఆ వీలుండదు. చీరను—చీరను—గోచీ పెట్టుకుంటే గోడెక్క ప్రయత్నం చేయవచ్చు."

"చాలా చక్కగా వివరించారు. ఆ పద్ధతిలో మీరెప్పుడైనా గోడ ఎక్కారా?"

ఆమె మళ్ళీ అనుమానంగా చూసింది. "లేదు. చిన్నప్పుడు చెట్లెక్కేదాన్ని—జామచెట్లు."

"ఐసీ. పన్నెండడుగుల యెత్తులోవున్న చెట్టుకొమ్మను మీరు ఎగిరి అందుకోగలరా?"

ఆమె మరింత అనుమానంగా చూస్తూ అంది, "ఎగిరి అందుకోలేను. చెట్టెక్కి అంగుకోగలను. కానీ అది చిన్నప్పటి విషయం."

"మీ రెంతవరకు చదువుకున్నారు?"

"డిగ్రీ సగంలో మానేశాను-సంవత్సరం క్రితం - పెళ్ళయినప్పుడు."

"చదువుకునే రోజుల్లో మీరు ఆటల్లో పాల్గొనే వారా?"

"ఆవంటే నా కిష్టం లేదు."

"సరే ఒక్కసారి మీ చేతులు చూపడానికి అభ్యంతరమా?"

ఆమె అసహనంగా అంది: "ఏమిటిది? ఆడవాళ్ళ చీరలూ చేతులూ చూడ్డం మీ పరిశోధనా?"

"నరేంద్ర హత్యతో ఒక స్త్రీకి సంబంధం వుంది."

"ఉంటే?" గట్టిగా అర్చింది సరస్వతి.

లాల్ జాగ్రత్తపడి అన్నాడు. "నెవర్ మైండ్, నెవర్ మైండ్. ఒకసారి మీ చెప్పులు చూపిస్తారా?"

"చూపించను. చెప్పుతో జవాబు లిస్తాను! వెళ్ళండి కృఞిస్లంచి!"

జాన్ కల్పించుకున్నాడు, "మాడమ్! మేం తప్పుకుని పోలీసులకు అవకాశమిస్తే మీరు అరెస్టుకావడానికి క్షణం పట్టదు. మీ చెప్పులెక్కడ వున్నాయి?"

"వెనుక వరండాలో!"

జాన్ గర్వంగా నవ్వుకుని బయటికెళ్ళాడు. రెండు నిమిషాల్లో తిరిగి వచ్చి, "ఇవెందుకు తడిశాయి?" అనడిగాడు.

"నేనే కడిగాను."

"దేనికి? బురద అంటిందా?"

"అవును?"

"ఎప్పుడు? ఎక్కడ?"

"ఇందాక - పెరట్లో బావి దగ్గర."

"ఇంత ఖరీదైన చెప్పులు మీరు ఇంటిపనులు చేస్తున్నప్పుడు కూడా తొడుగుతారా?"

"నా కలవాటు—మీ భార్యకుండకపోవచ్చు."

"నా కింకా భార్య లేదు. రాత్రి మీరెప్పుడొచ్చారు?"

"పన్నెండు గంటలకు."

"అప్పుడు మీరే చీరలో వున్నారు?"

"ఎన్నిసార్లు చెప్పాలి? ఇదే చీర!"

"ఇది పసుపురంగు చీర — ఇలాటివి మీకెన్ని వున్నాయి?"

"ఒక్కటే-దేనికి?"

జాన్ చీర అంచుల్ని జాగ్రత్తగా చూస్తూ అన్నాడు. "మీ చెప్పులకు అంటినబురద చీరకు అంటలేదా?"

"అంటింది—కడిగేశాను."

"మీ చీర బాగా నలిగివుంది, కారణమేమిటి?"

"నేను ఇంటిపనులు చేస్తున్నప్పుడు ఖరీదైన చెప్పులు తొడిగినట్లే, ఖరీదైన వస్త్రాలు ధరిస్తాను."

"మీ పద్ధతులు వింతగా వున్నాయి....ఓ. కే!" జాన్ వెనక్కి తిరిగి లాల్ తో అన్నాడు, "లాల్! నిన్న రాత్రి భర్తను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడన్న కసితో నరేంద్రను బుద్ధి చెప్పడానికి సరస్వతి చిన్నప్పటి నేర్పుతో గోడ దూకిందేమో అడుగు!"

లాల్ తలూపి సరస్వతిని చూశాడు. జాన్ గబ గబ వెళ్ళి ద్వారం దగ్గర ఆగాడు.

"జాన్ ప్రశ్నకు మీ సమాధాన మేమిటి సరస్వతి?"

సరస్వతి తటాలున ముందుకు దూకి, పొడవాటి గోళ్ళతో లాల్ మీదకు పులిలా దాడిచేసింది. లాల్

ఛటుక్కున ఆమె చెయ్యి పట్టుకొని మెలేశాడు.

జాన్ రివ్వుమని ద్వారంలోంచి బయటకురికాడు.

# 8

"వెల్, మిస్టర్ దేవరాజ్! మీరు చక్కటి కథ అల్లారు. మిమ్మల్ని దొంగలెత్తుకుపోయారా! **To hell with your bluff!** మీ కథ పిట్టలకి చెప్పుకోండి! పరిస్థితి మీరూహించని మలుపు తిరిగినా మీరింకా పాత పాటే పాడుతూండటం నవ్వు తెప్పిస్తోంది. బాణీ మార్చి మరో పాట వినిపించండి!"

దేవరాజ్ కొయ్యబారిపోయి లాల్ని చూశాడు. ఆ తర్వాత కోపంగా అన్నాడు: "మిస్టర్ లాల్ మీ తెలివితేటలకు గౌరవమిస్తాను. కానీ, నా దగ్గర ప్రదర్శిస్తేమాత్రం సహించను! గెటవుట్!"

లాల్ పగలబడి నవ్వాడు. "గెటవుట్! హహ్హా! మీ ఇంట్లో అందరి నోటా యిదే మాట! మేమింకా పానకంలో పుడకలమనుకోకండి!ఇది హత్యకేసు, మీ తమ్ముడి హత్య జరిగిందని మీకింకా తెలియదు! మీ తమ్ముడు మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నట్లు కూడా తెలియదు.

"అతనే మీకు ఫోన్ చేసి నలభై యేళ్ళ క్రితం మీ తండ్రి జీవితం గురించి తెలియజేసి, ఆ రహస్యం దాచాలంటే డబ్బు కావాలని కోరాడు. లేకపోతే బ్రహ్మాండమైన ప్రచారం చేసి పరువు తీస్తానని బెదిరించాడు. అతని మాటలు నమ్మడానికి మీ తండ్రి డైరీ చదవమన్నాడు. మీరు దాన్ని చదివి బ్లాక్ మెయిలర్ మాటలు యదార్థమని నమ్మి, నాశనం చేశారు. ఈ వ్యవహారం మీ తండ్రికి తెలియకూడదు. కాబట్టి చాలా జాగ్రత్తగా డబ్బు చెల్లించడానికి పథకం వేశారు. బ్యాంకు దగ్గర మంచి

రిహార్సల్ తో కిడ్నాప్ దృశ్యం సృష్టించి అదృశ్య మయ్యారు....

"బ్లాక్ మెయిలర్-మీ తమ్ముడు-డబ్బు చెల్లించడానికి నిన్న రాత్రి 11 గంటల సమయమిచ్చాడు. అప్పటివరకు ఆ యువతితోనే వుండి మధ్యవర్తి ద్వారా డబ్బుచెల్లించి ఇంటికి తిరిగి వచ్చారు.

"కానీ—మిస్టర్ దేవరాజ్, రాత్రి మీరు వచ్చాక మీ భార్య మీ తమ్ముడు బ్లాక్ మెయిలర్ అని చెప్పింది. మీరు రెచ్చిపోయి అతని అంతు చూస్తానని బయలు దేరారు. మీ భార్య మిమ్మల్ని ఆపి, తను బయలుదేరింది. మీరు షాలిమార్ హోటల్ లో డబ్బు చెల్లించారు. ఆ వివరాలన్నీ ఆమె తెలుసుకొని, హోటల్ కెళ్ళిన నరేంద్రను వేటాడి, కాచిగూడలో హత్య చేసింది. రాత్రంతా ఆమె మీతోనే వుందని మీరు యెలిబీ ఇస్తారు. కానీ - మీరు బ్లాక్ మెయిలర్ పరం చేసిన బ్రీఫ్ కేసు మీ భార్య హత్య చేశాక ఇక్కడికి తీసుకొచ్చింది—దానిలో డబ్బు వుంటుంది. కాబట్టి మీ కిడ్నాప్ కథ బూటకమై హత్యా కేసులో ఇరుక్కుంటారు!"

దేవరాజ్ తటాలున లేచాడు.

"డామిట్! మీరు నోటికొచ్చినట్లు మాట్లాడు తున్నారు! నే నే బ్లాక్ మెయిల్ లోనూ యిరుక్కోలేదు! వింటున్నారా? నా తండ్రి కెలాంటి రహస్యాలూ లేవు! దొంగలు నన్ను బంధించి డబ్బు దోచుకున్నారు. అంతే, నరేంద్ర చావుతో నాకు సంబంధం లేదు! నా భార్య అతన్ని చంపలేదు!"

"రాత్రి ఆమె ఏ రంగు చీరలో వుంది?" జాన్ అడి గాడు.

"పసుపు రంగు చీర!" నీరసంగా అన్నాడు దేవరాజ్.

"మీకు లిఫ్ట్ యిచ్చిన స్నేహితురాలెవరో చెప్తారా?"

"ఈ హత్యలో ఆమెనుకూడా యిరికిస్తారా? చెప్పను."

జాన్ కళ్ళు మెరిశాయి. "మీరెందుకు చెప్పరో నాకు తెలుసు!" ఫకాలున నవ్వాడతను. "దేవరాజ్, మీరు పిరికివారు—చాలా పిరికివారు! ఐ పిటీయూ. ఆ స్నేహితురాలెవరో నాకు తెలుసు!"

వివర్ణమైన దేవరాజ్ ముఖం చూసి, జాన్ నవ్వుతూ లేచి లాల్‌తో బయటికి నడిచాడు.

# 9

సాయంత్రం నాలుగు గంటలకు ఇన్‌స్పెక్టర్ కృష్ణన్ యేజెన్సీ ఆఫీసుకు వచ్చాడు.

"ఫ్రెండ్స్ నా రిపోర్టులో మీకేలాంటి క్లూ దొరకదు. ఈ కేసులో మెటీరియల్ ఎవిడెన్స్ లేదు. సర్కమ్‌స్టేన్షియల్ యెవిడెన్స్‌తో మాత్రమే ఛేదించాలి. ఈ విషయం మీ రాలోచించారా?"

జాన్ తలూపాడు. "ఆలోచించాం. ఇన్‌స్పెక్టర్ నా మెదడును ఒక విషయం తొలిచేస్తోంది. మీ రిపోర్టు యేమిటో చెప్తుంటే నా ఆలోచనల్ని వరుస క్రమంలో పేరుస్తూ ఒక రూపానికి తెస్తాను."

కృష్ణన్ ముఖం విచ్చుకుంది. "ఏమిటీ మీ మెదడు చురుగ్గా పనిచేస్తోందా! అయితే ఈ కేసు తేలిపోతుంది!"

"జాన్, ముందు బ్రీఫ్ కేసు....డబ్బు...." లాల్ గొణిగాడు.

"షటప్, లాల్! నువ్వు గాలిలో మేడలు కడుతున్నావు. నీ వాదనకు ఆధారం లేదు. సరస్వతి అసలు

బయటకెళ్ళనిదే బ్రీఫ్ కేసులో డబ్బుతో యెలా తిరిగి వస్తుంది? కృష్ణన్, మీరు ప్రారంభించండి!"

కృష్ణన్ అనుమానంగా చూసి అన్నాడు, "ఈ కేసులో హత్యాయుధం లేదు. వేలిముద్రలు లేవు. హత్యా స్థలం తెలియదు. అనుమానితురాలిమీద కేసు నిలవదు. ఆమె కదలికలు హత్య జరిగిన పరిస్థితుల్లో టైమింగ్ తో అన్వయించవు. ఈ కేసులో టైమింగ్ కి చాలా ముఖ్యం వుంది."

"ఎలా?" లాల్ అడిగాడు.

"జాన్ నిన్న రాత్రి రావ్ ఇంటి దగ్గర నిఘా వున్నారు. పదకొండు గంటలకు నరేంద్రను వెంటాడుతూ షాలిమార్ హోటల్ కెళ్ళారు. నరేంద్రను చంపాలన్న ఉద్దేశంతో సరస్వతి బయలుదేరివుంటే అప్పుడే వెంటాడుతూ వెళ్ళాలి. కాబట్టి 12 గంటలకు దేవరాజ్ తిరిగి వచ్చినప్పుడు ఆమె వుండదు. ఇంట్లో ఆమె లేకపోవడం చూసి తండ్రీకొడుకులు ఏం చేశారు? వాళ్ళకేదో అనుమానం పీడించి దేవరాజ్ కాకపోయినా, రావ్ ఈ ఉదయం మీకు ఆమె గురించి చెప్పి వుండాలి. చెప్పాడా?"

"లేదు."

"కాబట్టి 11 గంటలకు ఆమె నరేంద్రను వెంటాడుతూ వెళ్ళలేదు. 12 గంటలకు భర్త వచ్చినప్పుడు ఇంట్లోనే వుంది. ఆల్ రైట్, నరేంద్ర హోటల్ లో జాన్ కళ్ళుగప్పి మాయమయ్యాడు. జాన్ తిరిగి రావ్ ఇంటికొచ్చేశారు—ఎన్ని గంటలకి?"

"సుమారు 12:30 కు."

"పన్నెండు గంటలకు దేవరాజ్ ఇంటి కొచ్చాడు.

అప్పుడు సరస్వతి భర్తకు నరేంద్ర గురించి చెప్పి, అతని ఆచూకీ తెలుసుకుని చంపడానికి బయలుదేరిందనుకుందాం. నిద్రపోతున్న జాన్ కళ్ళుగప్పి ఆమె ఇంటినుంచి వెళ్ళగలదా?"

"లేదు. నేను నరేంద్రకోసం జాగ్రత్తగా కనిపెట్టి వున్నాను—ముందు దారి, వెనుక దారి కూడా."

"మీరు 12:30 నుంచి ఉదయం అయిదు గంటల వరకు అక్కడే వున్నారు. ఆ మధ్య సమయంలో సరస్వతి ఇంట్లోంచి వెళ్ళడంగానీ, నరేంద్ర ఇంట్లోకి రావడం గానీ చూడలేదు. అంతేనా?"

"అవును!"

"దట్సాల్! విషయం స్పష్టమవుతోనేవుంది — సరస్వతి రాత్రి ఏ సమయంలోనూ ఇంట్లోంచి బయటకెళ్ళ లేదు."

"మరి-ఆమె చెప్పులు బురదలో తడిశాయి, ఆమె చీర నలిగివుంది, ఆమె చేతులు—"

లాల్ మాటలకు కృష్ణన్ అడ్డు తగిలాడు, "చెప్పులకు బురద ఇంట్లోనే అంటివుండవచ్చు. చీర నలిగిందంటే గోడ మాకిందని అర్థం కాదు. దానికి మరో కారణం వూహించండి. అవన్నీ కాకతాళీయంగానే జరిగాయి. పోస్టు మార్టమ్ రిపోర్టు ప్రకారం తెల్లవారుఝామున 4:00-5.00గంటలమధ్య హత్య జరిగిందని తెలుస్తోంది. ఆ సమయంలో మిస్టర్ జాన్ సరస్వతికి బలమైన ఎలిబీ ఇస్తారు. కదూ జాన్?"

జాన్ అన్నాడు, "లాల్, ఆధారాల విషయం అలా వుంచి, ఈ హత్య సరస్వతి యెందుకు చెయ్యాలో అర్థం గావడంలేదు."

"హత్యకు మోటివ్ అద్దంలా స్పష్టంగా కన్పిస్తోంది."

"మోటివ్!" అన్నాడు జాన్. "వెల్, లాల్! నరేంద్ర బ్లాక్ మెయిల్ వ్యవహారంలో ఒక మధ్యవర్తి పాత్ర వుంది కదూ?"

"అవును. నరేంద్ర దేవరాజ్ నుంచి ప్రత్యక్షంగా డబ్బు తీసుకోలేదు. అతను తెరచాటున వుండి మధ్యవర్తిని పంపాడు."

"అవును! ఆ మధ్యవర్తి యెవరు? అతనికి మోటివ్ వుందా?" జాన్ అన్నాడు.

"లేదు. వుంటే. అతను హంతకుడవుతాడు. కానీ, హత్యాస్థలంలో ఆధారాలు స్త్రీని సూచిస్తున్నాయి" అన్నాడు లాల్.

"ఆ మధ్యవర్తి స్త్రీ యెందుక్కాకూడదు?"

"అవును, యెందుక్కాకూడదు? అయితే ఆ స్త్రీ యెవరు?" అడిగాడు కృష్ణన్.

జాన్ నవ్వాడు: "ఇంకెవరు! వూహించండి! దేవరాజ్ స్నేహితురాలనుకుంటున్న గ్రీన్ ఫియట్ యువతి!"

"అంటే ఆమె అతని స్నేహితురాలు కాదా?"

"ఆమె స్నేహితురాలని దేవరాజ్ చెప్పలేదు. అతను బ్లాక్ మెయిల్లో ఇరుక్కున్నాడన్న విషయం కూడా ఒప్పుకోవడంలేదు. తండ్రి రహస్యం బయట పడుతుందని అతని భయం. అతనికి లిఫ్ట్ యిచ్చిన స్త్రీ గురించి చెప్పక పోవడానిక్కూడా ఇదే కారణం. ఆమె హత్యలో ఇరుక్కుంటుందనికాదు—అతని భయం ఆమె తండ్రి రహస్యాలు వెల్లడి చేస్తుందని!"

"మిస్టర్ జాన్, మీ లాజిక్ వివరంగా చెప్పండి."

జాన్ అన్నాడు: "బ్లాక్ మెయిలర్ బెదిరింపు వాస్తవమని దేవరాజ్ నమ్మి డబ్బు చెల్లించడానికి సిద్ధపడ్డాడు. ఈ వ్యవహారం తండ్రికి తెలిస్తే అతను ఇంట్లో అవమానం భరించలేక ఏ అఘాయిత్యమైనా చేసుకోవచ్చు. కాబట్టి డబ్బు రహస్యంగా చెల్లించాలి. అదెలా సాధ్యమవుతుంది? తండ్రికి తెలియకుండా అంతడబ్బు తీస్తే దానికి సంజాయిషీ ఏం చెప్తాడు? అలాగే బయట యక్కడ ప్రయత్నించినా దానికి కారణం కావాలి. ఏదో కారణం చెప్పి తెచ్చినా తిరిగి చెల్లించవలసివస్తే యెక్కడనుంచి వస్తుంది? ఆఫీసులో తప్పుడు లెక్కలు సృష్టించగలడా? లేక చెక్కుమీద తండ్రి సంతకం ఫోర్జ్ చెయ్యగలడా?

"దేవరాజ్ కు యేమీ తోచక పరిస్థితి వివరించి బ్లాక్ మెయిలర్ కు తన అశక్తతను తెలియజేశాడు. బ్లాక్ మెయిలర్ పాపం స్వంత తమ్ముడు కాబట్టి, దేవరాజ్ పట్ల ఉదారవైఖరి ప్రదర్శించి—డబ్బు చెల్లించే మార్గం ఆలోచిస్తానని మాటిచ్చాడు.

"ఇచ్చిన మాట ప్రకారం నరేంద్ర ఓ పథకం ఆలోచించాడు. అదే ఈ ఫేక్ కిడ్నాప్. దీనివల్ల యెలాంటి సమస్యలుండవు. దేవరాజ్ ను దొంగలెత్తుకుపోయి డబ్బులాక్కున్నారని చక్కటి సంజాయిషీ చెప్పుకోవచ్చు.

"ఈ పథకం దేవరాజ్ ఒప్పుకున్నాడు. అయితే అందుకు బ్యాంకునుండి డబ్బు డ్రా చేసే వీలు కలగాలి. నరేంద్ర ప్రతిరోజూ ఫోన్ చేసి ఆ వీలుకోసం అడుగుతూనే వున్నాడు. ఆ వీలు నిన్న వుదయం కల్గింది.

"అనుకున్నవిధంగానే అంతా జరిగిపోయింది. దేవరాజ్ డబ్బుతోసహా ఆ యువతితో అదృశ్యమయ్యాడు. ఆ

యువతి నరేంద్ర లవర్ కావచ్చు. ఆమెతో దేవరాజ్ రాత్రివరకు వుండే అవసరం లేదు. ఆ యువతి డబ్బు తీసుకొని అతన్ని యెక్కడో డ్రాప్ చేసి వెళ్ళిపోయింది. కాని వెంటనే తిరిగి రావడానికి దేవరాజ్ భయపడ్డాడు. పోలీసుల ప్రశ్నలగురించీ, తను చెప్పబోయే అబద్ధాల గురించీ అతనికి లోలోన బెరుగ్గానే వుంది. ఆ రోజంతా అతను ఏ హోటల్ లోనో గడిపి, రాత్రి ధైర్యం చేసి ఇంటికొచ్చేశాడు."

"ఆ తర్వాత?"

"నరేంద్ర ఈ బ్లాక్ మెయిల్ కోసం కాచిగూడలో ఒక ఇల్లు తీసుకున్నాడు. కాని ఆమె నా ప్రాంతాల రాకుండా జాగ్రత్త తీసుకున్నాడు. అతనే ఆమె ఇంటి కెళ్తూ వుండాలి. ఆ ఇంట్లో ఆమె స్వతంత్రురాలు. ఆమె వంటరిగా వుండాలి. ఆమెకో కారు వుందంటే ధనికు రాలై కూడా వుండాలి....అయితే ఆమెకు కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి."

"ఏమిటవి?"

"రకరకాల ఫీట్లు చేసే లక్షణాలు .... ఆ యువతి డబ్బు తెచ్చాక నరేంద్ర కలుసుకున్నాడు. ఆ డబ్బు ఆమెకు సమర్పించడానికే ననుకుంటాను. ఆ రాత్రి వరకు వాళ్ళిద్దరిమధ్య సంబంధాలు బాగానే వున్నాయి. కానీ, రాత్రి పదకొండు గంటలకు నరేంద్రను ఇంటినుండి నేను వెంటాడినప్పుడు; అతను నా కన్నుకప్పి తన లవర్ ని కలుసుకున్నాడు. అప్పుడతను షాలిమార్ హోటల్ కెళ్ళాడు. అక్కడ తనేమీ తిన్లేదు. ఆ యువతి ఇంటి కెళ్ళి విస్కీ చేపకూర తిన్నాడు. ఆ రాత్రి ఆమెతోనే వుండిపోయాడు.

"అదే రాత్రి యిద్దరి వ్యవహారం బెడిసికొట్టింది. పరిస్థితి విషమించి ఆమె ఆతన్ని చంపెయ్యాలని నిశ్చయించుకుంది. తెల్లవారుఝామున కత్తితో పొడిచి చంపేసింది."

"ఆ తర్వాత?"

"శవాన్ని అక్కడినుంచి మాయం చెయ్యాలి. అందుకు నరేంద్ర అద్దెకు తీసుకున్న ఇల్లు యెన్నుకుంది. శవాన్ని కార్లో వేసుకొని బయలుదేరింది. ఇంటిముందుగాక, వెనుక వీధిలో కారు దిగి, చెట్టుకొమ్మద్వారా గోడమీదికి పెరటి తలుపు తెరచింది. కార్లోంచి శవాన్ని తీసి మోసుకెళ్ళింది. శవం జేబులోంచి తాళాలు తీసి, ఇంటిముందు తలుపు తెరిచింది. శవాన్ని తీసికెళ్ళి బెడ్‌రూంలో మంచంమీద పడేసింది. యెక్కడా వేలిముద్రలు పడకుండా జాగ్రత్త తీసుకుంది.

"ఆ తర్వాత బయటకొచ్చి, పెరటి తలుపు లోపలినుంచి గడియపెట్టి, చెట్టెక్కి—గోడమీదికి—కారెక్కి వెళ్ళిపోయింది."

"హత్య నరేంద్ర యింట్లోనే ఎందుకు జరక్కూడదు?" లాల్ అన్నాడు.

"నరేంద్ర ఇంట్లో జరిగివుంటే—అక్కడతని పాదరక్షలుండాలి, రక్తం వుండాలి, అన్నిటికీ మించి అతను తిని తాగిన పదార్థాలూ, గ్లాసులూ, ప్లేట్లూ వంటి సామగ్రీ వుండాలి. ఇవేవీ అక్కడ లేవు. హంతకురాలు వీటన్నిటినీ మాయంచేసి, హత్య అక్కడ జరగలేదని సూచించడంలో అర్థం కన్పించడంలేదు."

"అయితే ఆ స్త్రీ ఎవరో తెలుసుకుంటాం?" కృష్ణన్ అడిగాడు.

జాన్ కొన్ని క్షణాలు మౌనంగా వుండి అన్నాడు:

"ఆ స్త్రీకి కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయని చెప్పాను. రాత్రి ఆమె గోడ మీకిందంటే చీరలో వచ్చి వుండదు. మినీస్కర్ట్‌లో రావాలి, లేదా జీన్స్‌లో రావాలి. జీన్స్‌లో వుండేందుకు ఎక్కువ అవకాశం వుంది. జీన్స్ లేక బెల్‌బాటమ్స్—వీటిలో కదలికలు సులువుగా వుంటాయి.

"ఆ తర్వాత ఆమె 12 అడుగుల ఎత్తుకెగిరి కొమ్మ నందుకుంది. సామాన్య స్త్రీకి అది అసాధ్యం. ఆమెకు ఇతర విద్యల్లో ప్రవేశముండాలి. అంటే సర్కస్ ఆర్టిస్టు అయివుండాలి, లేదా బాస్కెట్‌బాల్ ఛాంపియన్ అయి వుండాలి—లేదా—ఈ రెండూగాక డాన్సర్ అయి వుండాలి!"

"డాన్సరా?"

"అవును! డాన్సర్! సర్కస్ ఆర్టిస్టు గుడారం వదిలి ఈ సిటీలో స్వేచ్ఛగా వుండేందుకు వీల్లేదు! పైగా ఆమెకు కారు వుంది. క్రీడారంగంలో ఆమె ఆరితేరివుంటే ఇలాంటి చట్టవ్యతిరేక కార్యాలకి పాల్పడే అవసరం లేదు. అంతేగాక ఆమె క్రీడాకారిణి అయివుంటే, కాలేజిలో చదువుతున్న నరేంద్రకు క్లాస్‌మేట్ అయి వుండాలి. కానీ, ఒక విద్యార్థిని ఒంటరిగా వుంటూ—కారు, ఇతర భోగ విలాసాలతో గడపడానికి వీల్లేదు! ఆమె స్వతంత్రురాలు. ఆమె అందచందాలు, భోగవిలాసాలు, అంగవిన్యాసాల్నిబట్టి చూస్తే నర్తకితప్ప మరేమీ కాదు!"

"ఎలాంటి నర్తకి?"

"కేబరే ఆర్టిస్టు. దురభ్యాసాలకు అలవడ్డ నరేంద్ర ఒక కేబరే డాన్సర్‌తో స్నేహం చెయ్యడంలో ఆశ్చర్యం

లేదు!"

"ఆ కేబరే డాన్సర్ ఎవరు?"

జాన్ అలసిపోయి అసహనంగా అన్నాడు. "ఆమెకు గ్రీన్ ఫియట్ వుంది. సిటీలో హోటల్స్ అన్నిటినీ చెక్ చేస్తే గ్రీన్ ఫియట్ వున్న డాన్సర్ యెవరో తెలుస్తుంది.

"రైట్! గుడ్ అయిడియా! ఇన్‌స్పెక్టర్, నరేంద్ర పాలిమార్ హోటల్‌లో నన్ను తికమకపెట్టి వెనకదారి గుండా తప్పించుకున్నాడంటే, అక్కడి స్టాఫ్‌తో అతనికి చనువుండాలి. ఆ చనువు ఆ డాన్సర్‌వల్లనే ఏర్పడాలి! మీరు వెంటనే అక్కడికెళ్ళి నా అనుమానం సరైందో కాదో తెలుసుకోండి!"

# 10

చీకటిపడుతోండగా కృష్ణన్‌నుంచి ఫోన్ వచ్చింది:

"హల్లో, జాన్! మీ అనుమానం నిజమైంది! పాలిమార్ హోటల్‌లో నలుగురు డాన్సర్లున్నారు. అందులో మిస్. షబ్నమ్‌కు గ్రీన్‌ఫియట్ యిచ్చారు. ఆమె పంజగుట్టలో ఒక యింట్లో వుంటోంది. ఈ రాత్రి పదకొండు గంటలకు ఆమె ప్రోగ్రాం వుంది...."

"ఓ.. కే! మీరు వెంటనే మీ కార్లో బయలుదేరి మా ఆఫీసుకు రండి. ఇంటికెళ్ళి ఆమెని అరెస్టు చేద్దాం," రిసీవర్ పెట్టేశాడు జాన్.

"సక్సెస్?" లాల్ అడిగాడు.

"ఈ కేసు యిప్పుడు సక్సెసయింది!"

"యూ ఆర్ మార్వలెస్, పార్ట్‌నర్."

జాన్ నవ్వి బయటకు నడిచాడు.

ఇద్దరూ ఆఫీసు మూసి, చకచక క్రిందికి వచ్చి, పేవ్‌మెంట్ మీద నిలబడ్డారు. అప్పటికి పూర్తిగా చీకటి

పడింది. పది నిమిషాల తర్వాత పోలీసుకారు వచ్చి పక్కన ఆగింది.

"కమాన్, ఫ్రెండ్స్! గెటిన్!" కృష్ణన్ డోరు తెరిచి అరిచాడు.

డిటెక్టివ్‌లు కారెక్కారు. డ్రైవర్ స్టార్టుచేసి పోనిచ్చాడు. కారు వేగానికి ట్రాఫిక్ అంతరాయం కలిగిస్తోంది. నిపుణుడైన డ్రైవర్ ఎంతో చాకచక్యంగా పదినిమిషాల్లో పంజగుట్ట చేరవేశాడు.

షబ్నమ్ ఇంటి వీధిలో ప్రకాశవంతంగా లైట్లు వెలుగుతున్నాయి. వీధిలో అక్కడక్కడ జనం వున్నారు.

ఇల్లు ఇంకా వందడుగుల దూరం వుందనగా గేట్లోంచి ఒక కారు రోడ్డెక్కింది—లైట్లు వెలుగులో తళ తళలాడుతున్న గ్రీన్ ఫియట్. డ్రైవింగ్ సీట్లో ఒక స్త్రీ వుంది.

ఆ కారు ఇటు తిరగబోతూ, పోలీసుకారును చూసి అటు తిరిగి హఠాత్తుగా దూసుకెళ్ళింది.

కృష్ణన్‌తోపాటు డిటెక్టివ్‌లు ఉలిక్కిపడ్డారు.

"ఆమె వెళ్ళిపోతోంది! డ్రైవర్ డ్రైవ్ ఫాస్ట్!" అర్చాడు కృష్ణన్.

సైరన్ శబ్దం విని జనం హడావుడిగా బయటికొచ్చారు. కానీ కారు వేగం చూసి దూరంగా తప్పుకున్నారు. కారు మెయిన్‌రోడ్డు ఎక్కేటప్పటికి గ్రీన్ ఫియట్ రెండు ఫర్లాంగుల దూరంలో వుంది.

"డ్రైవర్! దాన్ని ఓవర్‌టేక్ చెయ్యాలి!" కృష్ణన్ అర్చాడు ముందు సీటుమీదకు వంగి.

ఫియట్ క్షణక్షణానికీ వేగం పెరిగిపోతూ రాకెట్‌లా దూసుకుపోతోంది. ఎదురొచ్చే వాహనాలు ప్రక్కకు

తప్పుకొని చిన్న చిన్న ప్రమాదాలకు గురవుతున్నాయి.

హఠాత్తుగా రోడ్డుమీద కలకలం బయలుదేరింది. షాపులు, హోటళ్ళనుంచి జనం పరిగెత్తి రాసాగారు. పందెం వేసుకున్న రెండు కార్లను చోద్యంగా తిలకిస్తూ త్రొక్కిసలాటలో చాలామంది గాయపడ్డారు.

పోలీస్ డ్రైవర్, కృష్ణన్ ప్రేరణతో కారు గాల్లో ఎగిరేలా తోలుతున్నాడు. కిలోమీటర్ దూరం వెంటాడాక హఠాత్తుగా బ్రేకు వేయడంతో, ముగ్గురూ ఎగిరి ముందు సీటుకి గుద్దుకున్నారు.

ఎదురుగా వెళ్తోన్న గ్రీన్ ఫియట్ అదుపు తప్పి, విసురుగా వెళ్ళి పేవ్‌మెంట్ ఎక్కి, ఎలక్ట్రిక్ పోల్‌ని గుద్దుకొని మూడు పల్టీలు కొట్టడంతో, భగ్గుమని మంటలు లేచి క్షణాల్లో నిప్పంటుకుంది.

కార్లోవున్న షబ్నమ్‌కు తప్పించుకునే అవకాశం చిక్కలేదు. మంటల్లో నల్లగా మాడి, మాంసపు ముద్దగా మారిపోయింది....

§ § §

ఆ రాత్రి డిటెక్టివ్‌లు డాన్సర్ షబ్నమ్ యింటిని సోదా చేశారు. అక్కడ బ్రీఫ్‌కేసులో పాతికవేల రూపాయల రొక్కం, నరేంద్ర బూట్లు, బురద అంటిన జీన్స్ లభించాయి.

కిచెన్‌లో లభించిన రెండు కత్తుల్ని కృష్ణన్ రక్త పరీక్షల నిమిత్తం ఫోరెన్సిక్ లాబ్ పరం చేశాడు.

—— ఐపోయింది ——

# చంద్రహారం

## వాణిశ్రీ

"మహారాజశ్రీ వెంకయ్య మామగారికి—

మీ అల్లుడు నాగరాజు అనేక నమస్కారములు చేసి రాయునది—మీ అమ్మాయి పెళ్ళికివెళ్ళి ఇంకా రాలేదు. ఇప్పటికే పదిహేను రోజులయింది. నాకు ఇంట్లో ఇబ్బందిగా వుంది. వెంటనే పంపించగలరు. ఎప్పుడు పంపేదీ కార్డురాస్తే బస్టాండులో వుంటాను. నేను పెళ్ళికి రాలేదని ఏమీ అనుకోవద్దని చిన్నమామయ్యగారికి చెప్పగలరు. ఇంతే సంగతులు.

మీ అల్లుడు,

—నాగరాజు."

అల్లుడు దగ్గర్నుంచి వచ్చిన కార్డుచదివి అదిరిపడ్డాడు వెంకయ్య.

పదిహేను రోజులక్రితం అతని తమ్ముడికూతురు పెళ్ళి జరిగింది. పెళ్ళికి రమ్మని శుభలేఖ వేశాడు తమ్ముడు. అమ్మాయిని తీసుకొని పెళ్ళికి తప్పకుండా రమ్మని తను

కారురాశాడు.

కాని పెళ్ళికి వాళ్ళురాలేదు. అల్లుడుకి సెలవు దొరక లేదేమో అని సరిపెట్టుకున్నాడు. అల్లుడు రాకుండా అమ్మాయిమాత్రం ఎలా వస్తుందని అతని భార్యగూడ అన్నది పెళ్ళిరోజు.

పదిహేను రోజులక్రితమే అమ్మాయి బయల్దేరి వచ్చి నట్లు ఇప్పుడు అల్లుడు కారువేశాడు. పెళ్ళికి బయల్దేరిన శాంత ఏమైంది?

ఏదయినా ప్రమాదం జరగలేదుగదా?

వెంకయ్య గుండె గుభేలుమంది.

శరీరంలో సన్నగా వణుకు ప్రారంభమైంది.

ముఖం చెమటతో తడిసిపోయింది.

అతని మనసు పరిపరివిధాలా పోతోంది.

ఇప్పుడు కర్తవ్యం యేమిటి?

చెమటకు చేతిలో ఉత్తరం మెత్తబడింది. అంతలో భార్య అటురావటంచూసి ఉత్తరాన్ని మడతబెట్టి లాల్చి జేబులో వేసుకున్నాడు.

చుట్ట వెలిగించి పొగవదులూ వరండాలో అటూ ఇటూ పచార్లుచేస్తూ యేంచేయాలో ఆలోచించసాగాడు. ఎంత బుర్రబద్దలు కొట్టుకున్నా కర్తవ్యం స్ఫురించలేదు.

భోజనానికి లేవమని అతడిభార్య కేక పెట్టింది.

కాళ్ళు కడుక్కుని భోజనానికి కూర్చున్నాడు.

ముద్ద గొంతు దిగలేదు.

గుండెల్లో దిగులు గూడుకట్టుకుంది.

అన్నం మెతుకులు కెలుకుతూ కూర్చున్న భర్తని అడి గింది ఆమె 'ఎందుకు అలా వున్నారని!'

ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. అసలుసంగతి

చెప్తే గాభరా పడుతుంది. విషయాన్ని తనలో దాచుకో లేదు. ఏం జరిగిందో తెలియకుండా శాంత ఇల్లు చేరలేదనే సంగతి యెవరికీ చెప్పడం మంచిది కాదనుకున్నాడు.

ఆవూళ్ళో వెంకయ్య మనసువిప్పి మాట్లాడేది సుబ్బా రెడ్డితోనే. సుబ్బారెడ్డీ, వెంకయ్య చిన్ననాటి నుంచీ స్నేహంగా వుంటున్నారు. వానకాలం చదువు పూర్తి అయిందనిపించి వ్యవసాయంలో దిగారు. కష్టసుఖాల్లో ఇద్దరూ పాలు పంచుకుంటూరు. విపత్కర పరిస్థితిలో సల హాలు చెప్పుకుంటూరు.

వెంకయ్య మనసులో సుబ్బారెడ్డి మెదిలాడు.

కాస్త యెంగిలిపడి సుబ్బారెడ్డి ఇంటికి వెళ్ళాడు.

సుబ్బారెడ్డి అప్పుడే భోంచేసి చుట్ట కాల్చుకుంటూ విశ్రాంతి తీసుకుంటున్నాడు.

వెంకయ్యను చూస్తూనే "రా....రా...." అంటూ ఆహ్వానించాడు.

వెంకయ్య చెప్పిందంతా విని ఆశ్చర్యపోయాడు సుబ్బా రెడ్డి. అతనికీ యేమీ పాలుపోలేదు.

"శాంత యెటువంటిది?"

ఆ ప్రశ్నవిని అదిరిపడ్డాడు వెంకయ్య. అతని ముఖం యెర్రగా కందిపోయింది కందగడ్డలా.

"ఇలా అడుగుతున్నందుకు యేమీ అనుకోకు. రోజులు అలా వున్నాయి మరి. పెళ్ళికిముందే చదువుకునే రోజుల్లో యెవరో ఒకర్ని ప్రేమించడం, పెద్దవాళ్ళ బలవంతంవల్ల పెళ్ళి చేసుకోవడం, తీరా కాపురానికి వెళ్ళాక మనసు మార్చుకుని మొగుడ్ని వదిలిపెట్టి వెళ్ళిపోవడం....యిటు వంటివి యెన్ని వినడంలేదు మనం" అన్నాడు సుబ్బా రెడ్డి.

"ఛా.... శాంత అలాంటిది గాదు."

"ప్రతి తండ్రీ తన బిడ్డగురించి అలాగే అనుకుంటాడు. కాని పెరిగి పెద్దయిన పిల్ల మనసు యేమిటో మనకు చెప్తే తప్ప యెలా తెలుస్తుంది?"

"శాంత పెళ్ళికి మనస్ఫూర్తిగా ఒప్పుకుంది."

"నాకు వేరే ఆలోచన రావడంలేదు. ఎందుకంటే శాంత పెళ్ళికని బయల్దేరి ఇక్కడకు రాకుండా యెక్కడకు వెళుతుంది? తప్పిపోవటానికి అదేమి చిన్నపిల్ల కాదుగా."

వెంకయ్య మౌనంగా వుండిపోయాడు.

"నీ ఆలోచనెలా వుంది?"

"నాకు బుర్ర పనిచెయ్యకనే నీ దగ్గరకి వచ్చాను" అన్నాడు వెంకయ్య.

సుబ్బారెడ్డి ఆలోచనలో పడిపోయాడు.

"పోనీ అల్లుడి దగ్గరికెళితే?" అన్నాడు వెంకయ్య.

"కొంప మునుగుతుంది.... అన్నట్లు అల్లుడంటే జ్ఞాపకమొచ్చింది. నీ మేనల్లుడు శేషగిరి శాంతతో చాల చనువుగా వుండటం నేను గమనించాను. అతను శాంతను పెళ్ళి చేసుకుంటాడని ఆ రోజుల్లో నేను అనుకొన్నేవాడ్ని. కాని అది జరగలేదు. నేను నిన్ను హెచ్చరించాలనుకున్నాను గాని, లేనిపోని గొడవలు వస్తాయేమోనని ఊరుకున్నాను" అన్నాడు సుబ్బారెడ్డి.

"నిజమే. నాకూ ఆ ఆశవుండేది. కాని మా అక్కయ్య పడనిస్తేనా? డబ్బు దగ్గిర రక్తసంబంధాలు కూడా దూరమే దానికి. పాతిక వేలు కట్నం కావాలని కూర్చుంది. వాడికేమో ఉద్యోగంలేదు. అంతకట్నం ఎక్కడ తెచ్చి ఇవ్వాలి? పదివేలుమించి ఇవ్వలేనని ఖండితంగా చెప్పే

శాను. అలాగయితే నీ కూతుర్ని గంతకు తగ్గ బొంతకు యిచ్చి పెళ్ళి చెయ్యాలుండి. నాకు కోపం వచ్చింది. అందుకే పరాయి సంబంధం చూసుకున్నాను. శేషగిరికి మాత్రం శాంతను చేసుకోవాలని వుంది. కాని యేం లాభం?" నిట్టూర్చాడు వెంకయ్య.

"నా అనుమానం అదేరా. శాంతగూడా శేషగిరి అంటే ఇష్టపడేది. అనుకోకుండా వేరేవాడిని చేసుకున్నా దాని మనసంతా వాడిమీదే ఉంటుంది. అందుకని యేదయినా చెయ్యకూడని పని చేసిందా అని. నాకు అనుమానం యెందుకంటే శేషగిరికి ఇంకా పెళ్ళవలేదు. పైగా ఇప్పుడేమో సబిన్స్పెక్టరయ్యాడు. ఆ ధీమాతో దాన్ని తీసికెళ్ళాడేమో? శాంతగూడా సమయంచూసి వెళ్ళిపోయిందేమో?"

వెంకయ్య ప్రాణంలేని రాతిబొమ్మలా చలన రహితంగా వుండిపోయాడు.

కాసేపటికి తేరుకుని "ఏంచేద్దాం ఇప్పుడు?" అన్నాడు.

"చేసేదేవుంది? శేషగిరి దగ్గరికి వెళ్ళు. ఇద్దరికీ బుద్ధి చెప్పి అమ్మాయిని తీసుకుని అల్లుడు దగ్గర వదిలిపెట్టిరా! మనం చెప్పిన మాట వింటే సరేసరి. లేకపోతే వాళ్ళ కర్మ. కలికాలం మరి" అన్నాడు సుబ్బారెడ్డి.

"నువ్వుగూడా పద. ఒక్కడికీ ఏం తోచదు" అన్నాడు.

సుబ్బారెడ్డి కాసేపు ఆలోచించి "సరే పద" అన్నాడు.

## 2

అనుకోకుండా ఊడిపడిన మేనమామనీ, సుబ్బారెడ్డినీ చూసి సంతోషించాడు శేషగిరి.

బహుశా హైదరాబాద్‌లో ఏదో పనిమీద వచ్చి వుంటారనీ, పనిలో పనిగా తనని చూడ్డానికి వచ్చారనీ అనుకున్నాడు.

వెంకయ్య ఇల్లంతా కలియదిరిగాడు. శాంత వచ్చిన జాడ ఎక్కడా లేదు. కనీసం సూట్ కేస్ గాని, బట్టలు గానీ ఏవీ కనిపించలేదు.

సుబ్బారెడ్డివంక చూసి పెదవి విరిచాడు, శాంత లేదన్నట్టు సూచిస్తూ.

"ఏమిటి మావయ్యా సంగతులు. అత్తయ్య బాగుందా? పిల్లలు బాగున్నారా? శాంత పండక్కి వచ్చిందా? చిన్న మావయ్యకూతురు పెళ్ళికి నేను రాలేకపోయాను. అర్జెంట్ పని తగిలింది. మా పోలీసు వుద్యోగమే అంత...." గలగలా మాట్లాడేస్తున్నాడు శేషగిరి.

వెంకయ్య, సుబ్బారెడ్డి ముఖ, ముఖాలు చూసుకున్నారు.

"శాంత నీ దగ్గరికి రాలేదా?" ప్రశ్నించాడు వెంకయ్య.

షాక్ తిన్నవాడిలా బిగుసుకుపోయాడు శేషగిరి.

"ఏమిటి మావయ్యా! నువ్వనేది?" అన్నాడు నివ్వెరపోతూ.

"శాంత నీ దగ్గరికి రాలేదా?" అదే ప్రశ్న రిపీట్ చేశాడు వెంకయ్య.

"నా దగ్గరికి రావడం ఏమిటి? ఎందుకొస్తుంది?" ఆశ్చర్యంతో తల మున్కలయ్యాడు శేషగిరి.

వెంకయ్య మారు మాట్లాడకుండా లాల్చీ జేబులో నుంచి నాగరాజు రాసిన ఉత్తరం తీసి శేషగిరికి అందించాడు.

అది చదివిన శేషగిరికి మతిపోయింది.

"శాంత పెళ్ళికని బయల్దేరిరాలేదా?" అన్నాడు.

"రాలేదు" అన్నాడు వెంకయ్య.

"ఒకవేళ నీ దగ్గరికి వచ్చిందేమోనని వెతుక్కుంటూ వచ్చాం" అన్నాడు సుబ్బారెడ్డి.

"నా దగ్గరికి ఎందుకొస్తుంది. శాంతకి పెళ్ళయిన సంగతి మర్చిపోయారా?" శేషగిరి ముఖం అవమానంతో జేవురించింది. తనని మేనమామ అనుమానించినందుకు బాధ కలిగింది. 'ఛీ.... పెళ్ళైన పిల్లని లేపుకొచ్చేటంత నీచుడా తను' అనుకున్నాడు.

సుబ్బారెడ్డి ఏం మాట్లాడలేదు.

వెంకయ్య అన్నాడు "ఎందుకు రాకూడదు? పెళ్ళికాక ముందు మీరిద్దరూ చనువుగా వుండేవాళ్ళు. పెళ్ళి చేసుకోవాలనుకున్నారుగూడా!"

"అయితే!"

"నిజం చెప్పరా. శాంత నీ దగ్గరికి రాలేదా?" బ్రతిమాలుతున్నట్లు అడిగాడు వెంకయ్య.

"ప్రామిస్ మామయ్యా! శాంత అంటే నాకు ఇష్టం వున్నమాట నిజమే. పెళ్ళిచేసుకోవాలని కలలుగన్నాను. కాని మా అమ్మకు వున్న డబ్బు పిచ్చికి బలైపోయాను. నా మాట సాగనివ్వలేదు. కట్నం లేకుండానైనా శాంతను పెళ్ళి చేసుకోవాలని ఆవేశపడ్డాను. మా నాన్నతో పోట్లాడాను. నాన్నకి అభ్యంతరం ఏమీలేదు. గయ్యాళితనంతో అమ్మే మా పెళ్ళి జరగనివ్వలేదు. నేను బలవంతాన శాంతను చేసుకుంటే వురిపెట్టుకుని చచ్చిపోతానని బెదిరించింది. తల్లిని క్షోభపెట్టి చంపాడని అప్రతిష్ట వస్తుందని భయపడి వూరుకున్నాను."

శేషగిరి మనసువిప్పి చెప్పేసరికి వాళ్ళ అనుమానం

పూరిపింజలా గాలికి ఎగిరిపోయింది. ఆతను శాంతను తీసుకు రాలేదనీ, పెళ్ళయిన తర్వాత ఇద్దరూ చనువుగా లేరనీ అర్థం చేసుకున్నారు.

'శాంత ఏమై వుంటుంది?'

సమాధానం లేని ప్రశ్నగా మిగిలిపోయింది వాళ్ళ ముగ్గురిమధ్యా.

"శాంతకి ఎన్ని నగలున్నాయి?" ప్రశ్నించాడు శేషగిరి.

"నానుతాడు. రెండు పేటల చంద్రహారం. చేతికి రెండు జతల గాజులు. చెవులకు దుద్దులు" చెప్పాడు వెంకయ్య.

"ఎందుకు ఆ వివరాలు?" అన్నాడు సుబ్బారెడ్డి.

"ఏదైనా ప్రమాదం జరిగిందేమోనని నా అనుమానం. బంగారంకోసం ఎవరైనా అఘాయిత్యం చేసివుంటారా? అని."

"అలాగూడా జరిగి వుండొచ్చు" అన్నాడు సుబ్బారెడ్డి.

వెంకయ్య గుండె ఆగిపోయినట్లయింది.

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

వెంకయ్యని చూస్తే వాళ్ళిద్దరికీ బాధ కలిగింది.

"బాధపడకు మావయ్యా! శాంత గురించి నేను అంతా తెలుసుకుంటాను. అది తేలేవరకూ నిద్రపోను" అన్నాడు శేషగిరి.

## 3

కపిలనగరం జేకేసరికి ఎనిమిది దాటింది.

ఆ వూరు రావడం రెండోసారి శేషగిరికి.

ఆర్నెల్ల క్రితం డ్యూటీమీద వచ్చాడు. అప్పుడు శాంత ఇంటికిగూడ వెళ్ళాడు. ఆ వూళ్ళో శాంత భర్త నాగరాజు

యల్.డి. క్లర్క్‌గా పనిచేస్తున్నాడు స్టేట్ గవర్న మెంట్ ఆఫీసులో. శాంతకోసం తను హైదరాబాద్‌లో కొన్న గాజులు, చెప్పుల జత ప్రెజెంట్ చేశాడు.

కనీసం వాళ్ళింట్లో ఒక్కరోజైనా వుండిపోవాలని నాగరాజు బలవంతం చేశాడు. అతను చాల మంచివాడు. కలుపుగోలు మనిషి. కొత్తా పాతా లేకుండా చనువుగా మసిలాడు.

బస్సుదిగి బస్టాండులోనుంచి బైటకువస్తూ ఆలోచనలో పడిపోయాడు శేషగిరి.

'శాంత ఇంట్లోలేదని తెలిసి తను నాగరాజు ఇంటికి వెళ్ళడం బాగుండదు' అనుకున్నాడు.

రిక్షావాళ్ళు చుట్టూ మూగారు.

"ఎవరెస్ట్ హోటల్" అన్నాడు శేషగిరి తన చేతిలో నుంచి సూట్‌కేస్ అందుకున్న రిక్షావాలాతో.

"ఎక్కండి సార్!" అన్నా డతను వుత్సాహంతో.

శేషగిరి రిక్షా ఎక్కి కూర్చున్నాడు.

కపిల నగరంలో ఆ హోటలే కాస్త పెద్దది. సదుపాయంగా వుంటుంది. వూరు మధ్యలో వుండడంవల్ల ఎక్కడికి వెళ్ళాలన్నా దగ్గరే.

రెండో అంతస్తులో సింగల్ రూమ్ తీసుకున్నాడు.

స్నానంచేసి రెస్టారెంట్‌కి వెళ్ళి భోజనం చేశాడు. పాన్ నములూ బాల్కానీలో నిలబడి రోడ్డుమీద వస్తూ పోతూ వున్న జనాన్ని చూస్తూ నిల్చున్నాడు.

ఉన్నట్టుండి అతనిచూపులు ఇద్దరిమీద నిల్చిపోయాయి. గ్రౌండ్‌ఫ్లోర్‌లో హోటల్ ఎంట్రన్స్ ప్రక్కన కిళ్ళీ కొట్టువద్ద నిల్చుని యెవరితోనో మాట్లాడుతున్నాడు నాగరాజు.

అతన్ని కేకెయ్యాలా వద్దా! అనే మీమాంసలో పడిపోయాడు.

'శాంత పెళ్ళిలో కలిసిందా?' అని తనని ప్రశ్నిస్తే యేం సమాధానం చెప్పాలి అనుకున్నాడు.

శేషగిరి ఆలోచనలలోనుంచి తేరుకోకముందే నాగరాజు తను మాట్లాడుతున్న అతనివద్ద సెలవు తీసుకొని ముందుకు వెళ్ళిపోయాడు.

ఫస్టుషో సినిమా వదలినట్లున్నారు. జనం రోడ్లనిండా ప్రవాహంలా కదులుతున్నారు.

శేషగిరి రూంలోకి వెళ్ళి బోల్టుపెట్టుకొని బెడ్ మీద వాలిపోయాడు.

పడుకున్నాడన్న మాటేగాని అతనికి నిద్రపట్టలేదు. శాంతచుట్టూ ఆలోచనలు ముసురుకున్నాయి. జ్ఞాపకాల పుట్ట పగిలింది. శాంతకి పెళ్లయ్యేవరకూ జరిగిన మధుర స్మృతులు నెమరేసుకున్నాడు. తల్లిని యెదిరించి శాంతను చేపట్టలేకపోయిన తన అసమర్థతను తిట్టుకున్నాడు.

ఎప్పటికోగాని అతనికి నిద్రపట్టలేదు.

మర్నాడు కాలకృత్యాలు తీర్చుకుని పోలీస్ స్టేషన్ కి బయల్దేరాడు.

అప్పుడే వ్యాన్ లోవచ్చి సీటులో కూర్చున్నాడు సర్కిల్ కృష్ణమూర్తి.

విష్ చేసి ఛైర్ లో కూర్చున్న శేషగిరి వంక విసుగ్గా చూశాడు ప్రొద్దున్నే ఇదెక్కడి తద్దినంరా బాబూ అనుకుంటూ.

శేషగిరి తమ డిపార్టుమెంట్ వాడే అని తెలుసుకున్నాక కృష్ణమూర్తి సంతోషించాడు. అప్పటి వరకూ

ఆముదం త్రాగినవాడిలా మూతి ముడుచుకున్న వాడల్లా వరదొచ్చిన ఏరులా పొంగిపోతూ "గ్లాడ్ టు మీట్ యూ మిస్టర్ శేషగిరీ!" అంటూ చిరునవ్వొకటి నవ్వేడు.

"స్వంత పనిమీద వచ్చాను సార్! ఐ వాంట్ యువర్ కోపరేషన్" అన్నాడు శేషగిరి.

"షూర్! షూర్! టెల్ మీ! వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ! ఐవిల్ డూ సర్టెన్‌లీ" ప్రామిస్ చేస్తున్నట్లు అన్నాడు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి.

శాంత మాయమైన విషయంచెప్పి, "షీగాట్ గుడ్ క్యారెక్టర్. దేర్ ఈజ్ నో స్కోప్ టూ గో వోవర్ విత్ ఎనీబడీ" అన్నాడు.

"ఐసీ...." అన్నాడు కృష్ణమూర్తి.

"మార్చి మూడో తారీఖున మా చిన్నమామయ్య కూతురు పెళ్ళికని బయల్దేరింది."

"పెళ్ళి ఎప్పుడు?"

"మార్చి ఆరో తారీఖున అని జ్ఞాపకం."

"అంటే త్రీడేస్ ఇన్ అడ్వాన్స్‌గా బయల్దేరింది."

"యస్సార్."

"ఆమె భర్త లెటర్ రాసేవరకూ మీ అంకుల్‌కి ఆమె బయల్దేరి వచ్చినట్లు తెలియదు."

"అవున్సార్. ఆ తర్వాత మా అంకుల్ నన్ను సస్పెక్ట్ చేశాడు. శాంత నేనూ పెళ్ళిచేసుకోవాలని అనుకున్నాం సార్!" బాధగా అన్నాడు శేషగిరి.

"ఎప్పుడో పెళ్ళిచేసుకోవా లనుకున్నారు. కాని ఆ పెళ్ళి జరగలేదని నువ్వు ఆమెను తీసుకెళ్ళిపోయావని సస్పెక్ట్ చేశారా! ఓల్డు ఫూల్స్" నవ్వాడు కృష్ణమూర్తి.

"ప్రామిస్ సార్! పెళ్ళయాక శాంతని యెంతో

గౌరవంగా చూసే వాడిని. ఏమాత్రం చెడ్డగా ఆలో చించే వాడినికాదు. కాని మా అంకుల్ నన్ను అనుమానించాడు. అదే నాకు బాధగావుంది సార్. శాంత ఒంటరిగా బయల్దేరింది. ఆమె వంటిమీద బంగారం వుంది. ఎవడయినా అది కనిపెట్టి ఏదయినా అఘాయిత్యం చేశాడేమోనని సస్పెక్ట్ చేస్తున్నాను సార్!"

"మే బీ!" అన్నాడు కృష్ణమూర్తి.

"ఐ ఫీల్ వెరీమచ్. ఐ హావ్ అప్లయిడ్ ఫర్ లీవ్ అండ్ కేమ్ హియర్ టు ఇన్వెస్టిగేట్ పర్సనల్లీ విత్ యువర్ హెల్ప సార్!"

"ష్యూర్! ష్యూర్! డోంట్ వర్రీ ఎబౌట్ అవర్ కోఆపరేషన్. ఉయ్ విల్ గివ్ ఫుల్ కోఆపరేషన్" నవ్వాడు సర్కిల్.

"టుడే ఈజ్ మార్చి నైన్టీన్."

"యస్."

"మార్చి మూడునుంచీ యిప్పటివరకూ రికార్డుచేసిన కేసులుచూసి చెప్పండి. ఏదయినా థెఫ్ట్ కేస్ గాని, ఎనీ మర్డర్ కేసెస్."

"ష్యూర్!" అని బజర్ నొక్కాడు.

జవాన్ వచ్చి సెల్యూట్ చేశాడు.

"యస్సైని పిలువు."

జవాన్ వెళ్ళిపోయాడు.

కాసేపటికి యస్. ఐ. భీమసేనరావు ప్రవేశించాడు.

పరిచయాలయిన తర్వాత రికార్డు తెప్పించి చూశాడు. ఆ పీరియడ్లో చిన్న చిన్న పిక్ పాకెట్ కేసులు, దొమ్మీ కేసులూ తప్ప ఒక్క మర్డర్ కేసుగూడా లేదు. టూ టౌన్ రికార్డు తెప్పించి చూశారు. అక్కడా అంతే.

నిరుత్సాహపడ్డాడు శేషగిరి.

ఏం చేయాలో తోచలేదు.

"మీ అంకుల్ ఊరు ఎక్కడ?"

"చింతలపల్లె."

"ఇక్కడ్నుంచి డైరెక్టు బస్సువుందా?"

"లేదు. మధ్యలో మరో బస్సు మారాలి."

"ఐ. సీ...." తల వూపాడు సర్కిల్.

"ఈ సంగతి శాంతభర్తకి తెలియజేయాలా వద్దా? అని ఆలోచిస్తున్నాను సార్!" అన్నాడు శేషగిరి.

"తప్పకుండా చెప్పండి. లేకపోతే కష్టం. ఏదయినా బాడ్ జరిగిందనుకోండి. పాపం చెప్పకుండా వుంటే ఎలా? ఏదో పుట్టింటికి వెళ్ళిందిగదా తిరిగి వస్తుందనుకుంటాడు గాని...." అన్నాడు సర్కిల్.

"అయితే చెప్పమంటారా?"

"చెప్పండి. అందువల్ల కొంత ప్రయోజనం గూడ వుండవచ్చు. ఆమె ఏరోజు ఖచ్చితంగా యెన్ని గంటల బస్సు యెక్కిందీ మొదలయిన వివరాలు చెప్పగలుగుతాడు. దాన్నిబట్టి ప్రొసీడ్ కావచ్చు."

"ఓ. కే. సార్!"

# 4

తలుపు నెట్టగానే వచ్చేసింది.

నాగరాజు డ్రెస్ చేసుకుని రెడీగా వున్నాడు ఆఫీసుకు బయలుదేరబోతూ.

"రండి .... రండి. చాల రోజులకు కనిపించారు" నవ్వుతూ అన్నాడు నాగరాజు.

"ఆఫీసుకు వెళ్తున్నట్లున్నారే."

"ఆc.... టైమ్ కావచ్చింది గదా!"

"పదండి, వెళ్తూ మాట్లాడుకుందాం."

"మీ మరదలు ఇంట్లో లేదు. పెళ్ళికని వెళ్ళింది. మనకి హోటల్ భోజనమే శరణ్యం" అన్నాడు నాగరాజు.

శేషగిరి మాట్లాడలేదు.

నాగరాజు ఇంటికి తాళం వేసి బయల్దేరాడు.

కొంచెం దూరం పోయాక శ్రీరామవిలాస్‌లోకి దారి తీశాడు నాగరాజు.

ఇద్దరూ స్పెషల్ రూమ్‌లో కూర్చున్నారు.

బేరర్ వచ్చాక నాగరాజు ఆర్డర్ ఇచ్చాడు. అతను కాసేపటికి పదార్థాలు సర్వుచేసి వెళ్ళిపోయాడు.

"శాంత ఎప్పుడు వెళ్ళింది పెళ్ళికని?" ప్రశ్నించాడు శేషగిరి.

"పెళ్ళికి ముందే. మీరు వెళ్ళలేదా పెళ్ళికి?" ఎదురు ప్రశ్న వేశాడు నాగరాజు.

"లేదు. అర్జెంట్ కేస్ తగిలింది. గ్రీటింగ్స్ పంపించి వూరుకున్నాను."

"నేను వెళ్ళాలనే అనుకున్నాను. కాని ఆఫీసులో ఇనస్పెక్షన్ వచ్చి పడింది. వీలుకాలేదు. మీ మరదల్ని పంపించాను."

టిఫిన్ తీసుకున్నాక కాఫీ త్రాగారు.

"మళ్ళీ డ్యూటీమీదే వచ్చారా?" ప్రశ్నించాడు నాగరాజు.

ఇబ్బందిగా తలవూపాడు శేషగిరి.

హోటల్లోనుంచి బైటపడ్డాక "ఆఫీసువరకూ వస్తారా? లీవు అప్లయ్ చేసి మిమ్మల్ని ఫాలో అవుతాను" అన్నాడు నాగరాజు.

"నో....నో....నా కోసం మీరు లీవు పెట్టొద్దు. ఇంటి

'కీ' ఇవ్వండి. కాసేపు నిద్రపోతాను. ఈవినింగ్ మీ రొచ్చాక ఎటైనా వెళ్దాం" అన్నాడు శేషగిరి.

నాగరాజు పాంట్ జేబులో నుంచి కీ చైన్ తీసి ఇచ్చాడు.

శేషగిరి ఇంటికివచ్చి తాళంతీసి లోపల బోల్టు పెట్టాడు.

ఇల్లంతా పరీక్షగా చూశాడు.

అది రెండు గదుల పోర్షన్. ఒక గదిలో పట్టెమంచం ఫోల్డింగ్ టేబుల్, గాడ్రెజ్ ఛైర్స్ రెండు, టేబుల్ మీద ట్రాన్సిస్టర్ వున్నాయి. రెండోగది కొంచెం చిన్నది. ట్రంక్ పెట్టెలు, ఫేమ్ కుర్చీలు చిల్లర సామాన్లు వున్నాయి. వంటగది ప్రత్యేకంగా వుంది.

శేషగిరి వంటగది తాళంతీసి చూశాడు. అన్నీ వంట సామానులే వున్నాయి. తాళం వేసేశాడు. ట్రంక్ పెట్టెలు ఒక్కొక్కటే తీసి చూశాడు. ఒక దాంట్లో శాంత చీరెలు, బ్లౌజులు, గాజులు వగైరా వున్నాయి. మరొక దాంట్లో నాగరాజు బట్టలు వున్నాయి.

తర్వాత బెడ్ రూమ్ పరీక్షించాడు.

ఒక గంట తర్వాత డ్రెస్ ఛేంజి చేసుకుని లుంగీ చుట్టుకుని పడుకున్నాడు.

కాసేపటికి తలుపుమీద ఎవరో చప్పుడు చేస్తున్నట్లు వినిపించింది.

లేచివెళ్ళి తలుపు తీశాడు.

ఆమెకు దాదాపు ఇరవై ఏళ్ళుంటాయి. సన్నగా పొడుగ్గా తెల్లగా వుంది. చదువు సంస్కారం కలిగిన దానిలా వుంది. పెద్దపెద్ద కళ్ళు తెల్లగా ప్రకాశవంతంగా వున్నాయి. రోజాకలర్ పోలిష్టర్ శారీలో ఆకర్షణీయంగా వుంది.

శేషగిరికి ఏం మాట్లాడాలో స్ఫురించలేదు.

ఆమె అంది, "శాంత లేదా?"

"లేదు. పెళ్ళికి వెళ్ళింది."

"ఇంకా రాలేదా?"

"రాలేదు."

ఆమె ఒక్కడుగు వెనక్కి వేసింది.

"మీ పేరేమిటి?"

"సంధ్య."

"శాంతకి ఫ్రెండా మీరు."

ఆమె తల వూపింది.

"నేను శాంత మేనబావని."

"నమస్తే!"

శేషగిరి ప్రతినమస్కారం చేశాడు.

"ఏం చేస్తుంటారు మీరు?"

"హాస్పటల్లో...."

"కూర్చోండి" శేషగిరి ఛైర్ చూపించాడు.

"వూరికినే చూడ్డానికి వచ్చాను. శాంత వచ్చాక వస్తాలెండి." ఆమె వెళ్ళిపోయింది.

శేషగిరి మళ్ళీ బోల్టు పెట్టేశాడు.

ఎంత వెతికినా శాంత గురించి ఏమీ దొరకలేదు. శాంతకి పెళ్ళయి నాలుగేళ్ళయింది. ఈ లోపల ఆమె ఎవరి ప్రేమలోనైనా పడిందా? అని అనుమానం.

శాంతకి ఇంకా పిల్లలు కలగలేదు. పోయినసారి వచ్చినప్పుడు ఆమె ముఖంలో విషాదచ్ఛాయలు కన్పించి అనుమానం కలిగింది. పిల్లలకోసం ఆడవాళ్ళు ఎంత సాహసమైనా చేస్తారు. నాగరాజులో ఏదైనా లోపంవుందా?

అది తెలుసుకుని శాంత ఎవరితోనైనా సంబంధం పెట్టు కుందా?

అన్నీ చిక్కుముళ్ళు. ఎంత ఆలోచించినా మార్గం దొరకడం లేదు.

సాయంకాలం ఆరింటికి వచ్చాడు నాగరాజు.

వస్తూనే "సారీ శేషగిరిగారూ! కొంచెం ఆలస్య మైంది" అన్నాడు.

"నాగరాజూ! ఇప్పుడు నీకు ఒక ముఖ్యమైన విషయం చెప్తున్నాను. జాగ్రత్తగా విను" అన్నాడు శేషగిరి సిగ రెట్ వెలిగిస్తూ.

"చెప్పు బ్రదర్."

"ఈ దారుణమైన వార్తవింటే నువ్వు తట్టుకుంటావో లేదోనని అనుమానపడి ఇంతవరకు చెప్పలేను...."

"దారుణమైన వార్తా! ఏమిటది?" ఆశ్చర్యంగా చూశాడు.

"శాంతని పెళ్ళికి పంపించావు గదూ!"

"అవును."

"శాంత పెళ్ళికి రాలేదు."

వులిక్కిపడ్డాడు నాగరాజు.

"రాలేదా?"

"ఊహూఁ?"

"మరి యెక్కడికెళ్ళింది?" నాగరాజు కళ్ళు యెర్ర బడ్డాయి.

"ఏమో?"

"ఓ మైగాడ్!" అని తలపట్టుకుని కూర్చున్నాడు నాగరాజు.

"శాంతని నువ్వే బస్సు యెక్కించావా?"

"అవును."

"ఏ తారీఖు."

"మూడు."

"ఉదయమా? సాయంకాలమా?"

"మధ్యాహ్నం మూడుకి."

"బస్సు నగరం వరకేగా."

"అవును."

"నగరంలో మారాలి గదా!"

"ఆఁ...."

"నీకు ఎవరిమీదయినా అనుమానం వుందా?"

"అంటే."

"శాంత గురించి." ఆ విషయం ఎలా చెప్పాలో అరంకాలేదు శేషగిరికి.

"శాంత మంచిది" అన్నాడు నాగరాజు.

"మరి ఎక్కడికి వెళ్ళివుంటుంది? దాదాపు పదహారు రోజులు దాటింది. ఇన్నాళ్ళు ఎక్కడ వుంటుంది."

"అదే అరంగావడం లేదు."

"శాంత మెడలో నగలన్నీ వున్నాయా?"

"ఆఁ— పెళ్ళికదా!"

"నగలకోసం ఎవరయినా అఘాయిత్యం చేసి వుంటారా?" నాగరాజు యేదో ఆలోచిస్తున్నాడు.

"ఏమిటి ఆలోచన?"

"బ్రహ్మంగాడు యేదయినా చేశాడా? అని ఆలోచిస్తున్నాను" అన్నాడు నాగరాజు.

"వాడెవడు?"

"వాడొక తాగుబోతు,"

"ఎక్కడ వుంటాడు?"

"మా వీధిలోనే."

"ఏం చేస్తుంటాడు?"

"లారీ డ్రయివర్."

"పెళ్ళాం పిల్లలు వున్నారా?"

"లేరు. వాడికి ఇంకా పెళ్ళికాలేదు. వాడిది అసలు తెనాలి. అక్కడ పిచ్చిపిచ్చి వేషాలు వేస్తే బాగా చితకగొట్టారు. అందుకని ఇక్కడ చేరాడు."

"వాడిమీద యెందుకు వచ్చింది అనుమానం?"

"ఒకరోజు నేను ఇంట్లోలేని సమయంచూసి వచ్చి శాంత చెయ్యి పట్టుకున్నాడట. అది భయపడి కేకలు పెట్టింది. ఇరుగు పొరుగువాళ్ళు వచ్చి బుద్ధి చెప్పారనుకో. ఆ తర్వాత నేను ఇంటికివచ్చాక శాంత ఏడుస్తూ చెప్పింది ఈ విషయం. నాకు కోపంవచ్చి వాడిమీదకి వెళ్ళి దేహశుద్ధి చేశాననుకో. అప్పట్నుంచి వాడికి నా మీద కోపం. శాంతమీద కన్నువేసిన వాడు ఒంటరిగా ప్రయాణం చేస్తూవుండటం గమనించి మోసం చేశాడా? అని అనుమానం వస్తోంది" అన్నాడు నాగరాజు.

శేషగిరి మౌనంగా వుండిపోయాడు.

"తెనాల్లో వాడిమీద పోలీసు కేసులుగూడ వున్నాయట."

"నాగరాజూ! ఎక్స్క్యూజ్ మీ! ఒక్క విషయం అడుగుతాను. ఏమీ అనుకోకుండా సమాధానం చెప్పు."

"అడుగు బ్రదర్!"

"శాంతకి పిల్లలు ఎందుకు కలగలేదు. పెళ్ళయి నాలుగేళ్ళు అయింది కదా!"

"ఫామిలీ ప్లానింగ్. ఇప్పుడే పిల్లలెందుకు అని"

అన్నాడు నాగరాజు.

శేషగిరి తృప్తిగా వూపిరి పీల్చాడు.

## 5

నల్లగా పొట్టిగా వున్నాడు బ్రహ్మం. పొట్టిగా వున్నా బలంగనే వున్నాడు. ఖాకీ బట్టల్లో నిండుగా వున్నాడు. జుట్టు వుంగరాలు తిరిగివుంది. కళ్ళు ఎర్రగానే వున్నాయి. చూపులకు నిత్య త్రాగుబోతులాగే కనిపిస్తున్నాడు.

"ఇప్పుడు చెప్పు శాంతని బలవంతం చేద్దామని వాళ్ళింట్లోకి వెళ్ళావా?" గద్దించాడు సర్కిల్ కృష్ణమూర్తి.

బ్రహ్మం గుండెల్లో దడ మొదలయింది.

అది ఎప్పుడు సంగతో. దాదాపు ఆర్నెల్లు దాటి వుంటుంది. ఏదో బుద్దిగడ్డితిని బుద్ధి తక్కువపని చేశాడు. నలుగురితోనూ చీవాట్లు, తన్నులు తిన్నాడు. ఇన్నాళ్టికి పోలీసులు తనని పట్టుకోవడం ఏమిటి కర్మ?

"బుద్ధిలేక వెళ్ళాను సార్!"

"ఎందుకు వెళ్ళావ్? సంసారుల ఇళ్ళల్లోకి వెళ్ళి గొడవ చేస్తావా? రాస్కెల్!"

బ్రహ్మం తల వంచుకున్నాడు.

"ఎన్నాళ్ళయింది నువ్వాపని చేసి?"

"ఎప్పుడో సార్! ఆర్నెల్లయింది."

"అప్పట్నుంచి శాంతమీద కోపం పెట్టుకున్నావన్న మాట."

"లేద్సార్! నేను ఆవిడ జోలికి వెళ్ళడమే మాను కున్నాను."

"అలా నటించావ్. కాని లోపల కోపం పెంచు కున్నావ్! సమయంచూసి మాయంచేశావ్!"

బ్రహ్మం తెల్లబోయాడు.

"ఏమిటి సార్! నేనేం చేశాను. ఆ తర్వాత నేనేం చెయ్యలేదు సార్!" వణుకుతూ అన్నాడు.

"ఈ నెల మూడో తారీఖున నువ్వు లోడ్ బండితో నగరం వెళ్ళావు. అవునా?"

"గుర్తులేదు సార్!"

"రాస్కెల్. చంపేస్తాను అబద్ధం చెప్పావంటే. మీ ఓనర్ని, మీ బ్రోకర్ ఆఫీసువాళ్ళనీ కనుక్కునే చెపుతున్నాను" కళ్ళెర్రజేశాడు సర్కిల్.

బ్రహ్మానికి నోట మాట రాలేదు.

"ఇప్పుడు చెప్పు. శాంతని ఏం చేశావ్?"

"నాకు తెలియదు సార్! నన్ను చూస్తేనే కోపంతో వుంటుంది సార్ ఆవిడ. నేను రమ్మంటే వస్తుందా సార్!" యేడుపు గొంతుతో అన్నాడు బ్రహ్మం.

"నువ్వు రమ్మంటే రాదు. నిజమే. కాని ఆ రోజు ఆమె పుట్టింటికి బయల్దేరింది. నగరంలో బస్సు మారాలి. బస్టాండ్‌లో నువ్వు ఆమెను చూశావు."

"లేదుసార్! నా చేతిలో బండివుంటే నేను బస్ స్టాండ్‌కి ఎందుకు వెళ్తాను సార్!"

"ఎందుకు వెళ్తావంటే కావాలనే వెళ్తావ్!"

"అన్యాయం సార్! నేనే పాపం యెరగను సార్" బ్రహ్మానికి యేడుపు వచ్చింది.

## 6

ఎవరెస్ట్ హోటల్లో తన రూమ్‌లో కూర్చుని డెయిలీ పేపర్ చూస్తున్నాడు శేషగిరి.

"గుడ్ మార్నింగ్ సర్!"

సన్నటిగొంతు విని తలెత్తి చూశాడు.

విక్టోరియా నవ్వుతూ కనిపించింది.

"కమాన్!....ప్లీజ్ టేక్ యువర్ సీట్!" అంటూ కుర్చీ చూపించాడు.

"థాంక్స్...." అని కూర్చుంది ఆమె.

శేషగిరి బెల్ నొక్కాడు.

బాయ్ వచ్చాక కాఫీకి ఆర్డర్ ఇచ్చాడు.

"ఎంతవరకూ వచ్చింది పరిశోధన?" నవ్వుతూ అడిగాడు.

"దారిలోకి వచ్చింది" అంది విక్టోరియా.

"నువ్వు సమయానికి ఈ వూళ్లో కన్పించావు గనుక బ్రతికిపోయాను. లేకపోతే చాల ఇబ్బంది పడేవాడిని."

"మా మదర్‌కి పెరాల్సిస్ స్ట్రోక్ రాబట్టి లీవులో వచ్చాను. లేకపోతే వచ్చేదాన్ని కాదు" అంది విక్టోరియా.

"అసలు సంగతి చెప్పు" అన్నాడు.

ఆమె చెప్పబోతూ వుండగా బాయ్ వచ్చాడు కాఫీ తీసుకొని.

కాఫీ సిప్ చేస్తూ, "మీరు రాంగ్ రూట్లో వెళ్ళారు" అంది విక్టోరియా.

నివ్వెరపోతూ విక్టోరియా వంక చూశాడు.

"యస్సార్!"

"చెప్పు."

"సంధ్యగురించి తెలుసుకున్నాను."

"వెరీగుడ్" సంతోషంగా అన్నాడు.

"సంధ్య మీ మరదలికి ఫ్రెండ్ కాదు."

"మరి."

"నాగరాజు ప్రియురాలు."

ఉలిక్కిపడ్డాడు శేషగిరి.

ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి "రియల్లీ" అన్నాడు.

"యస్."

"ఎలా లాగావు ఇన్ఫర్మేషన్?"

"సంధ్య నా క్లాస్‌మేట్ చెల్లెలు."

"అలాగా!"

"సంధ్య, నాగరాజు యెప్పట్నుంచో పరిచితులు. ఇద్దరూ దాదాపు ఆరేడేళ్ళనుంచి ప్రేమించుకుంటున్నారు."

"ఐ. సీ...."

"ఇప్పటికీ నాగరాజు, సంధ్య అంటే మోజు పడుతున్నాడు. ఆమె క్వార్టర్ హాస్పిటల్ కాంపౌండ్‌లో వుంది. అక్కడ కలుసుకుంటాడు నాగరాజు."

శేషగిరి 'వూఁ' కొడుతూ వింటున్నాడు.

"ఫ్లాష్‌న్యూస్ వినండి."

ఏమిటి అన్నట్లు కళ్ళు పెద్దవిచేశాడు.

విక్టోరియా చెప్పింది.

# 7

శేషగిరి వెళ్ళేటప్పటికి క్వార్టర్‌లోనే వుంది సంధ్య.

డోర్ తట్టగానే తలుపుతీసింది.

అతన్ని చూసి ముఖం చిట్లించింది.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు.

"వెరీ గుడ్‌మార్నింగ్!" అంది సంధ్య.

శేషగిరి ఇల్లంతా కలయజూస్తూ ఛైర్‌లో కూర్చున్నాడు.

అతను ఎందుకువచ్చాడో అర్థంగాక సంధ్య ఆశ్చర్యంగా గమనిస్తోంది అతన్ని.

"మా శాంతకి మీరు యెలా ఫ్రెండ్ అయ్యారు?"

సూటిగా ప్రశ్నించాడు.

"హాస్పిటల్లోనే...." నవ్వుతూ చెప్పింది.

"బాగా స్నేహంగా వుండేవారా?"

"అంటే....?"

"అంటే నా ఉద్దేశ్యం క్లోజ్ గా మూవ్ అయ్యేవారా? సినిమాలకీ, షికార్లకీ వెళ్ళేవారా అని."

"ఎప్పుడయినా వెళుతూ వుండేవాళ్ళం."

"ఐ. సీ...."

"అవన్నీ అడుగుతున్నారెందుకు?"

"కొంచెం పనివుంది" అని తన పాకెట్ లోంచి ఐడెంటిటీ తీసి ఆమెచేతికి ఇచ్చాడు.

శేషగిరి స్పెషల్ బ్రాంచి ఇన్ స్పెక్టరని తెలుసుకొని కంగారుపడింది. అయినా తమాయించుకొని చిరునవ్వు తెచ్చుకొని "మంచి ఉద్యోగమే" అంది.

"నేను పెళ్ళిచూపులకు రాలేదు, నా ఉద్యోగం గురించి మెచ్చుకోడానికి" అన్నాడు సీరియస్ గా.

ఆమె ముఖం నల్లబడిపోయింది.

"నేనెవర్నో తెలుసుకున్నారు కదా! ఇక నిజం చెప్పండి" అన్నాడు.

"నేనేం అబద్ధం చెప్పాను?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"మీరు ఇంతవరకూ చెప్పినవన్నీ అబద్ధాలే."

"నో...." గట్టిగా అంది సంధ్య.

"యస్" అన్నాడు శేషగిరి తాపీగా సిగరెట్ ముట్టించి.

సంధ్య ముఖం వెలవెలాపోయింది.

"మీరు శాంతకికాదు ఫ్రెండ్. నాగరాజుకి" అన్నాడు.

తనముందు బాంబ్ ప్రేలినట్లు వులిక్కిపడింది సంధ్య.

ఆమె ముఖం తెల్లగా పాలిపోయింది. కళావిహీనమై పోయింది.

"ఇప్పటికయినా నిజం చెప్పండి. శాంతని రేప్ చెయ్యమని బ్రహ్మానికి ఎందుకు చెప్పారు?"

"బ్రహ్మానికా? నేనా.... నేనెందుకు చెప్తాను. నేను చెప్పలేదు." మొండిగా అంది సంధ్య.

శేషగిరి హేండ్ బ్యాగ్‌లోనుంచి టేప్ రికార్డర్ తీసి ఆన్ చేశాడు.

"బహ్మాం నిజం చెప్పు. ఆ వీధిలో యెందరో ఆడవాళ్లు వున్నారు. వాళ్ళందర్నీ వదలిపెట్టి శాంతమీదే నీ కన్ను ఎందుకు పడింది? నిజం చెప్తే నీ జోలికి రాము. లేదా జైల్లో తోయించి పదేళ్ళు శిక్ష వేయిస్తాను" అది సర్కిల్ కృష్ణమూర్తి గొంతు.

"సార్! ఇందులో నా తప్పు ఏం లేదు. శాంత నన్ను చూసి నవ్వుతూ వుండేది....అందుకని...."

కృష్ణమూర్తి నవ్వు.

"ఒరేయ్ బ్రహ్మాం."

"సార్!"

"నీ మొఖం ఎప్పుడయినా అద్దంలో చూసుకున్నావురా?"

"సార్"

"అడిగిందానికి సమాధానం చెప్పు."

"చూసుకుంటున్నాను సార్!"

"నీ ముఖం కంటే బురదలో తిరిగే పందిముఖం అందంగా వుంటుందిరా రాస్కెల్. నాలుగు తగిలిస్తే గాని నిజం చెప్పేటట్లు లేవు. ఏయ్ హెడ్డూ వీడికి

నాలుగు కిలోలు వీపుమీద వడ్డించనోయ్!"

"సార్! నన్ను కొట్టకండి సార్! నిజం చెప్తా సార్!"

"ముందే చెప్పేడవగూడదూ?"

"అదంతా ఆ సంధ్య చెప్పేదు మాటలు విని చేశా సార్!"

"సంధ్యా! ఆవిడెవరు?"

"నర్స్ సార్."

"ఆ నర్స్‌తో నీకేం సంబంధం?"

"తెల్సు సార్!

"ఎట్లా తెలుసు?"

"..........."

"చెప్పరా రాస్కెల్."

"సంధ్యది మా వూరే సార్! అందుకని అప్పుడప్పుడూ వాళ్ళింటికి వెళ్తుంటాను సార్!"

"వూరికి నేనా....నీకేం పని వాళ్ళింటికి?"

"సంధ్య అంటే నాకు ఇష్టం సార్!"

"ఐ.సీ...." నవ్వా.

"పెళ్ళి చేసుకోమని అడిగా సార్!"

"ఏమంది?"

"ఇదుగో అదుగో అని వాయిదాలు వేస్తుంది."

"ఆఁ....తర్వాత."

"ఒకసారి మా వీధిలో నాగరాజు ఇంటికి వస్తే చూసి ఎందుకు వచ్చావని అడిగాను. శాంత తన స్నేహితురాలని చెప్పింది. తర్వాత శాంత గురించి చెడ్డగా చెప్పింది. శాంత పెళ్ళికాక ముందే చెడిపోయిందనీ, ఎవరు అడిగినా కాదనదనీ ఏమేమో చెప్పింది సార్. నువ్వెళ్ళి అడిగినా

కాదనరు. వెళ్ళిచూడు ఒకసారి. ఆ వీధిలో వుంటున్నావు ఆమాత్రం తెలియదా అని ఎగతాళి చేసింది సార్! అందు కని ఆ పాడుపని చేశాను సార్!"

శేషగిరి ఆఫ్ చేశాడు.

సంధ్య అవమాన భారంతో తల వంచుకుని కూర్చుంది.

"నాకు తెలుసు అంతా. అయినా మీ నోటినుంచి వినాలనుకుంటున్నాను. చెప్పండి, బ్రహ్మానికి అలా ఎందుకు చెప్పారు?"

"..........."

"శాంత భర్తతో హాయిగా కాపురం చేసుకుంటుంటే చూసి ఓర్వలేక ఎలాగైనా ఆమె జీవితాన్ని పాడు చేయాలని ప్లాను వేశారు. అవునా?"

"లేదు."

"నో .... మీరేమీ చెప్పనక్కర్లేదు. నేనంతా వూహించగలను. నాగరాజుకు మీకూ అతనికి పెళ్ళికాక ముందునుంచీ సంబంధం వుంది. అతనికి పెళ్ళైన తర్వాత ఆ సంబంధం బీటలువారింది. అతను మీకు దూరంగా వుంటున్నాడని బాధ కలిగింది.

ఎలాగో అతని భార్యని స్నేహం చేసుకుని ఇంటికి రాకపోకలు సాగించారు. కొన్నాళ్ళికి శాంత మీ విషయం కనిపెట్టింది. సంసారంలో కలతలు చెలరేగాయి. ఇదే సమయంలో శాంత పుట్టింటికి ప్రయాణమైంది. ఆ సంగతి మీరు బ్రహ్మానికి చెప్పి ఎలాగైనా శాంతని చంపమని పురమాయించారు. వాడు మీ మాట వేదవాక్కులా భావించి శాంతని చంపి పాతిపెట్టాడు."

"లేదుసార్! లేదు. నాకే పాపం తెలియదు...." అంటూ ఏడవసాగింది సంధ్య.

"ఎందుకీ దొంగ ఏడుపులు. చేసిందంతా చేసి ఇప్పుడు విచారిస్తే లాభం లేదు. చేసిన పాపానికి శిక్ష అనుభవించక తప్పదు" అన్నాడు శేషగిరి.

"శాంతని నేను చంపమని బ్రహ్మానికి చెప్పలేదుసార్! నా మాట నమ్మండి. నిజంసార్! ఆమెను చంపితే నాకేం లాభంసార్" ఏడుస్తూనే అంది సంధ్య.

"నీకే లాభంగదా! ఎలాగైనా నాగరాజుని పెళ్ళి చేసుకోవచ్చునని నీ ప్లాన్. అందుకే ఇంతటి దారుణానికి ఒడిగట్టావ్."

"లేదుసార్!...."

"నీ మాయమాటలు నాదగ్గిర కాదు. మర్యాదగా నిజం ఒప్పుకో."

"నిజం సార్!"

"ఏమిటి నిజం?"

"శాంతని చంపమని బ్రహ్మానికి నేను చెప్పలేదుసార్!"

"నాగరాజుని పెళ్ళి చేసుకోవాలని కోరికైనా వుందా?"

"వుంది సార్!"

"దట్సాల్ రైట్. రేపు కోర్టులో సాక్ష్యం చెప్పాల్సి వుంటుంది. మన సంభాషణ రికార్డు చేశాను. గుర్తుంచుకో."

శేషగిరి చరచరా వెళ్ళిపోయాడు.

సంధ్య కుప్పలా కూలిపోయింది పడకకుర్చీలో.

## 8

తనని అరెస్టు చెయ్యడానికి వారంట్‌తో వచ్చిన పోలీసుల్ని చూసి గజగజలాడిపోయాడు నాగరాజు.

"నేనేం చేశాను?" నిలువుగుడ్లు పడిపోయాయి అతనికి.

"ముందు వ్యాన్ ఎక్కండి. అవన్నీ స్టేషన్‌లో

మాట్లాడుకుందాం."

"నేను గవర్నమెంట్ ఎంప్లాయిని. నన్ను అరెస్టు చెయ్యాలంటే మా ఆఫీసర్ పర్మిషన్ కావాలి."

"ఆ రూల్సు మాకు తెలుసు. మర్యాదగా వ్యాన్ ఎక్కండి."

"నేనేం చేశానో చెప్పరేం?"

"ముందు మర్యాదగా వస్తారా రారా! ఏయ్ ఇతన్ని ఎత్తికెళ్ళి వ్యాన్‌లోకి తొయ్యండి."

"అక్కర్లేదు నేనే వస్తాను" అని వ్యాన్‌లోకి ఎక్కి కూర్చున్నాడు నాగరాజు ముఖం ఎర్రగా చేసుకుని.

వాన్ పోలీస్ స్టేషన్ ముందు ఆగింది.

"మీరేనా నాగరాజు?" ప్రశ్నించాడు సర్కిల్.

"యస్సార్."

"మీ భార్య శాంత ఇక్కడ్నుంచి బయల్దేరి పుట్టింటికి చేరలేదనీ, ఆమె వంటిమీద ఇరవై తులాల బంగారం వుందనీ, కొంత వెండిగూడా వుందనీ మీ మామ వెంకయ్య పోలీస్ రిపోర్టు ఇచ్చాడు."

"అవును."

"అనుమానంమీద నిన్ను అరెస్టు చేస్తున్నాం."

"నామీద అనుమానమా? నేను ఆమెకు భర్తని."

"అందుకే అరెస్టు చేస్తున్నాం."

"అంటే నేను ఆమెను ఏదైనా చేసి బంగారం కాజేశాననా?"

"ఏమో? ఎవరికి తెలుసు?"

"అదేమిటిసార్! భార్య నగలు దొంగతనం చెయ్యాల్సిన అవసరం నాకెందుకు? ఒకవేళ అవసరమే వచ్చి అడిగితే నా భార్య ఇవ్వనంటుందా?"

"కేవలం బంగారం కోసమే హత్య చేయనక్కర్లేదు. భార్యపై అనుమానంతో చెయ్యొచ్చు. లేదా పరాయి స్త్రీని పెళ్ళి చేసుకోవాలనే మోజులో ఆమెను అడ్డంకిగా ఫీలై చెయ్యొచ్చును."

"నో.... సార్! అంత దారుణం ఎవరూ చెయ్యరు."

"ఖచ్చితంగా ఎవరూ చెప్పలేరు. భార్యలను చంపిన భర్తల కేసులు లెక్కలేనన్ని చూశాను. నీ వయస్సు నా సర్వీసంత లేదు."

"ఎవరో దుర్మార్గుడు చేస్తే చేసి వుండవచ్చును."

"అయితే నువ్వు మంచివాడివని ఋజువు ఏమిటి?"

"ప్రతిదానికీ ఋజువు ఏముంటుంది సార్?"

"నువ్వు మంచివాడివని ఋజువులేదు. కాని నువ్వు చెడ్డ వాడివని ఋజువు నా దగ్గర వుంది."

నాగరాజు ఆశ్చర్యంగా చూశాడు.

"అవును మిస్టర్! నీకు సంధ్య అనే నర్సుతో సంబంధం వుంది."

నాగరాజు తల నేలకి వాల్చేశాడు.

"వుందా లేదా?"

"పరిచయం వుంది సార్!"

"ఎటువంటి పరిచయం."

"ఆమె మా వూరి అమ్మాయే సార్! ఆమె అన్న నాకు ఫ్రెండ్. అంతేసార్!"

"డోంటాక్ నాన్సెన్స్. డోంట్ యూ నో వాట్ యూ మీన్? వేర్ యూ ఆర్ టాకింగ్?" కళ్ళెర్రజేశాడు సర్కిల్.

నాగరాజుకి చెమట పట్టింది.

కృష్ణమూర్తి కోపం చూసి గుండె దడదడలాడింది.

"మీ వూరు నక్కబొక్కల పాడు. నువ్వు చదివింది గుడివాడలో. సంధ్యది తెనాలి. నర్స్ ట్రైనింగ్ గుంటూర్లో. తెలిసిందా? తెలియకపోతే ఇప్పుడైనా తెలుసుకో."

నాగరాజు ముఖం కళ తప్పింది.

తెల్ల ముఖం వేసి కళ్ళు తేలేశాడు.

"ఇప్పుడు చెప్పు నీకు సంధ్యతో సంబంధం వుంది కదూ?"

నాగరాజుకి నోటివెంట మాట రాలేదు.

అవునన్నట్లు తల వూపాడు.

"నీ భార్య శాంతమీద నీకు అనుమానం వుందికదూ?"

"లేదు సార్! శాంత మంచిది."

"పోలీసుల దగ్గర అబద్ధం చెప్పడం మంచిదికాదు నాయనా? నిజం చెప్పు."

"నిజం సార్! శాంత మంచిదే."

"శాంత మంచిదే అని తెలుసు. నువ్వు చెప్పాల్సింది అదికాదు. శాంత శీలం మంచిది కాదని నువ్వు అనుమానించావా, లేదా?"

"నేనెప్పుడూ అనుమానించలేదు సార్! కావాలంటే మా ఇరుగుపొరుగును ఎంక్వయిరీ చేయించండి. ఎప్పుడైనా శాంతని తిట్టగా, కొట్టగా వాళ్ళు చూశారేమో!"

కృష్ణమూర్తి నవ్వాడు.

"మిష్టర్ నాగరాజూ! అమాయకంగా నటించకు. నీలాంటి వాళ్ళని నా తల్లో వెంట్రుకలంత మందిని చూశాను."

"నిజం సార్!"

సర్కిల్ ఫైల్లోంచి ఒక ఇన్‌లాండ్ లెటర్ తీసి నాగ

రాజుకి ఇచ్చి "చదివి చెప్పు" అన్నాడు.

అది శాంత, తన తండ్రికి వ్రాసింది.

ఆరెన్నెల్ల క్రితం శేషగిరి డ్యూటీమీద కపిల నగరం వచ్చాడు. మరదలు ఆ వూళ్ళోనే వుందిగదా అని చుట్టపు చూపుగా వాళ్ళ ఇంటికి వెళ్ళాడు. అప్పుడూ శేషగిరి హైదరాబాద్ నుంచి వస్తూ చీర, గాజులు తెచ్చి ప్రెజెంట్ చేశాడు శాంతకి.

శేషగిరి వుండగా ఎంతో ప్రేమగా వున్నట్లు నటించాడు నాగరాజు. అతను వెళ్ళిపోయిన తర్వాత భార్యని వేధించాడు. మీ బావకి నీకూ సంబంధం వుందని తిట్టిపోసేవాడు. కట్నం దగ్గర పేచీ వచ్చిందిగాని లేకపోతే అతన్నే చేసుకునే దానివిగా అని ఎత్తిపొడిచేవాడు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. నాకు విడాకులిచ్చి అతనితో వుండు అని మానసికంగా హింసపెట్టేవాడు.

అదంతా ఆమె తన తండ్రికి వ్రాసింది.

అది చదివి అవమానంతో తల వంచుకున్నాడు నాగరాజు.

"ఇప్పుడు చెప్పు? నువ్వూ, నీ ప్రియురాలు సంధ్య కలిసి కుట్ర చేసి శాంతని చంపించారు. అవునా? కాదా?"

"నో....నో....సార్! నాకు ఏమీ తెలియదు సార్!" వణికిపోతూ అన్నాడు నాగరాజు.

"వీడిని లాకప్‌లో వెయ్యండి" అని వెళ్ళిపోయాడు సర్కిల్.

# 9

"సార్! ఫోన్ మీకే!" అన్నాడు హెడ్.

"ఎక్కడ్నుంచి?"

"శేఠ్ చందన్‌లాల్."

శేషగిరి టెలిఫోన్ అందుకుని "హల్లో! శేషగిరి స్పీకింగ్" అన్నాడు.

"……………"

"అలాగా!"

"……………"

"వాడిని మాటల్లో పెట్టి వుంచు. ఇమిడియట్‌గా వస్తున్నాను. ఎంతసేపు? నా కోసం ఏరా ఇంటి ముందు ఎవరైనా కుర్రాడ్ని వుంచు. నేను బులెట్‌లో వస్తున్నాను. ఓ.కే."

శేషగిరి హడావుడిగా బులెట్ తీసుకుని బయల్దేరాడు.

శేఠ్ చందనలాల్ ఇల్లు సికింద్రాబాద్ కింగ్స్‌వేలో వుంది.

పావుగంటలో కింగ్స్‌వేలోకి వెళ్ళాడు.

శేషగిరిని చూసి సెకండ్ ఫ్లోర్‌లో ఒక కుర్రాడు ఎర్రరంగు టవల్‌తో వూపాడు.

అతను బులెట్ రోడ్డు ప్రక్కగా ఆపి పైకి వెళ్ళాడు.

"ఎక్కడ వాడు?" గొంతు తగ్గించి అడిగాడు శేషగిరి.

"గోడౌన్‌లో వున్నాడు సార్!"

"ఎక్కడ?"

"పదండి చూపిస్తాను."

అతను దారి చూపిస్తే శేషగిరి అనుసరించాడు.

రెండు సందులు దాటాక ఒక ఇంటి తలుపు తట్టాడు ఆ కుర్రాడు.

"కౌన్ రే…." లోపల్నుంచి కేక వినిపించింది.

"మైసాబ్! ఇనస్పెక్టర్ సాబ్ ఆయా! జరూరీ కామ్ హై బోలేతో మైలాయా సాబ్!"

"అచ్ఛా!…. ఠైరో…."

కాసేపటికి తలుపులు తెరుచుకున్నాయి.

తెల్లటి బట్టల్లో చందన్‌లాల్ తప్ప ఏమీ కనిపించడం లేదు. అంతా మసక మసకగా వుంది. లోపల బెడ్‌లైట్ మాత్రం వెలుగుతూ వుంది. గదినిండా రకరకాల పార్సెల్స్, గోనె సంచులు వున్నాయి. వాటి మధ్య ఛైర్‌లో కూర్చున్నాడు చందన్‌లాల్. అతని ప్రక్కన చీకట్లో కలిసిపోయిన ఆకారం నిల్చుని వుంది.

"సలాం సాబ్!.... బైఠియే!.... బైఠియే" నూల కాయాన్ని లేపి అతి కష్టంమీద నిల్చుని ఆహ్వానించాడు చందన్‌లాల్.

"ఫరవానై ....తుమ్ బైఠోజీ....ఆప్ బడా ఆద్మీ." అన్నాడు శేషగిరి నవ్వుతూ.

చీకటిలో చూడడానికి అలవాటైన తర్వాత రెండో అతన్ని పరీక్షగా చూశాడు శేషగిరి.

పాతికేళ్ళు పైన వుంటాయి అతనికి. ఖాకీ బట్టల్ని బట్టి మోటారు ఫీల్డుకి సంబంధించి వుంటాడనిపించింది.

"బోలో సాబ్! క్యా హోనా ఆప్‌కో!" వినయంగా అన్నాడు చందన్‌లాల్.

"మై బోలేనా ఆప్‌కో! తుమారీ పాస్ మే చార్, పాంచ్ దిన్‌కే...."

చందన్‌లాల్ జ్ఞాపకం వచ్చినవాడిలా నటించి— "యాద్ హై....సాబ్! తుమ్‌కో పురానీ నెక్లెస్ హోనా బోలే! యాద్ హై సాబ్! మగర్ ఏక్ బీ ఆయానై! అబ్బీ ఆయా ఏక్. దేఖో! నెక్లెస్ నై. చంద్రహార్ హై!" అంటూ రెండు పేటల చంద్రహారం తీసి చూపించాడు చందన్‌లాల్.

శేషగిరి దాన్ని తీసుకుని పరీక్షించాడు.

చతురస్రాకారంలో గొలుసు మధ్యవున్న బిళ్ళమీద వెంకయ్య అని తెలుగు అక్షరాలు కనిపించాయి. అంటే అది శాంతదే.

శేషగిరి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"హానా సాబ్! లేవో సాబ్! ఏ పురానీ హై! అచ్చా మాల్ హై! గ్యారంటీ మాల్!" చందన్‌లాల్ చెప్తూనే వున్నాడు.

"కౌన్ లాయా?"

"యాసిన్ దేఖో!" ప్రక్కనున్న కాకీబట్టల మనిషిని చూపించాడు.

"తుమ్ దోనో పోలీస్ స్టేషన్‌కి ఆనా హై! జరూర్!" గట్టిగా అన్నాడు శేషగిరి.

అతను తప్పించుకుని పోవడానికి పరిగెత్తాడు.

శేషగిరి కాలు అడ్డం పెట్టాడు.

అతను బోర్లా పడిపోయాడు. పైకి లేపి మెడమీద రెండు కొట్టాడు. శక్తి వుడిగిపోయిన వాడిలా వ్రేలబడి స్పృహ తప్పిపోయాడు అతను.

"శుక్రియా శేర్!" నవ్వుతూ అన్నాడు శేషగిరి.

# 10

యాసిన్ చిన్నాన్న కొడుకు అబ్దుల్లా.

కపిలనగరంలో ఎవరెస్టు హోటల్లోనే సప్లయర్‌గా పని చేస్తున్నాడు అబ్దుల్లా.

శేషగిరి కపిలనగరం వచ్చినరోజే ఎవరెస్టు హోటల్ ముందు కిళ్ళీకొట్టుపక్కన నాగరాజుతో మాట్లాడుతూ వుంటే చూశాడు అబ్దుల్లాని. తరువాతి ఎవరెస్టుహోటల్ రెస్టారెంట్‌లో అనేకసార్లు చూశాడు.

అతను నాగరాజుకి ఎలాగో స్నేహితుడయ్యాడు.

ఇద్దరూ బార్ కిగూడ తరచుగా వెళుతూ వుండేవాళ్ళు. నాగరాజుకోసం అప్పుడప్పుడూ ఇంటికి వెళ్ళేవాడు. శాంతగూడ అతనికి పరిచయమైంది. ఆమెను "భాభీ" అని పిలిచేవాడు. తను ఎంతో మంచివాడని ఇతరులు అనుకునేటట్లు ప్రవర్తించడం అతనికి వెన్నతో పెట్టిన విద్య.

మార్చి మూడో తారీఖున శాంత పుట్టింటికి బయల్దేరింది. ఆమె వెళ్ళిన బస్సు మధ్యలో చెడిపోయి నగరం వెళ్ళేసరికి రాత్రి ఎనిమిది దాటింది. అక్కడ ఆమె తమ వూరు వెళ్ళడానికి బస్సు మారాలి. ఆ బస్సు ఏడింటికే వెళ్ళిపోయింది. తిరిగి కపిలనగరం రావడానికయినా బస్ లేదు. ఏం చేయాలో తెలియక దిక్కుతోచని స్థితిలో వున్న శాంతికి నగరం బస్టాండ్ లో అబ్దుల్లా కనిపించాడు.

ఆమెకు ప్రాణం లేచివచ్చింది. జరిగిందంతా చెప్పింది. అబ్దుల్లా ఆమెకేం భయంలేదని ఆమెను తన బంధువు యాసిన్ ఇంటికి తీసుకెళ్ళాడు. యాసిన్ డ్రయివర్. బ్రహ్మచారి. యాసిన్ కోసం అబ్దుల్లా అప్పుడప్పుడూ నగరం వస్తాడు. ఇద్దరూ కలిసి తాగుతారు. ఎవరినైనా కాల్ గరల్ ని రూమ్ కి తీసుకొచ్చి వ్యభిచరిస్తారు.

అందుకు వీలుగా వూరిచివర ఒక రూమ్ తీసుకున్నారు.

అబ్దుల్లా తన భర్తకు స్నేహితుడు కావడాన శాంత అతన్ని మనస్ఫూర్తిగా నమ్మింది.

అతను ఆమెకోసం క్యారేజ్ తో భోజనం గూడా తెప్పించాడు. రాత్రి పదింటివరకూ ఆమెతో మర్యాదగా ప్రవర్తించాడు. ఎటువంటి అనుమానం కలుగనియ్యలేదు.

ఆమె ఎంతో నమ్మకంతో నిద్రపోయింది.

ఆ తర్వాత యాసిన్ వచ్చాడు.

ప్రక్కగదిలో కూర్చుని అర్ధరాత్రివరకూ త్రాగుతూ కూర్చున్నారు.

ఆ తర్వాత ఆమెను ఇద్దరూ కలిసి మానభంగం చేశారు. ఆమె ప్రతిఘటించింది. వాళ్ళు రాక్షసంగా ప్రవర్తించడము వలన ఆమె ప్రాణం పోయింది.

ఆమె నగలు తీసుకొని శవాన్ని చాపలో చుట్టి మైలు దూరానవున్న సముద్రంలోకి విసిరేశారు. ఆమె శవం తేలకుండా చేతులకూ కాళ్ళకూ పెద్ద పెద్ద రాళ్ళను ప్లాస్టిక్ వైర్‌తో కట్టి మరీ పడేశారు.

నెలరోజులవరకూ ఆ నగలు బయట పెట్టలేదు.

యాసిన్ డ్యూటీమీద హైదరాబాదు వెళ్ళినప్పుడు తన స్నేహితుడిద్వారా చందన్‌లాల్‌ని పరిచయం చేసుకున్నాడు. తనొక దొంగనని చెప్పాడు. ఏవైనా దొంగ వస్తువులు తెస్తే కొంటావా? అని అడిగాడు. ధరలో మూడువంతులు ఇస్తానని చందన్‌లాల్ హామీ ఇచ్చాడు.

శేషగిరి దొంగవస్తువులు కొనేవాళ్ళు అందరికీ శాంత నగల వివరాలు చెప్పి, తనకి తెలియచెయ్యమని కోరాడు.

చందన్‌లాల్ యాసిన్ తెచ్చిన చంద్రహారాన్ని చూసి శేషగిరికి ఫోన్ చేసి చెప్పాడు.

చంద్రహారం వాళ్ళ నేరాన్ని పట్టి ఇచ్చింది.

—: ఐపోయింది :—

# నలుగురు గూండాలు

## టెంపోరావ్

ఫైవ్ స్టార్ హోటల్ సీవ్యూ ముందు హాల్లోని సోఫాలో కూర్చున్నాడు పీటర్స్. విశాలమైన హాలు. దూరంలో రిసెప్షన్ కౌంటర్ వెనక అరడజనుమంది యువతులు బిజీగా వున్నారు.

పీటర్స్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. తనీ హోటల్లో దిగి వారంరోజులు దాటింది. కానీ తను ఆశించినదేదీ యింతవరకూ కాలేదు. త్వరలో తను మరో చౌకబారు హోటలికి మారిపోవాలి.

పీటర్స్ కింగ్ సైజు సిగరెట్ను పెదిమల మధ్యవుంచి, అగ్గిపెట్టెకోసం జేబులు వెతకసాగాడు. తటాలున ఏదో లైటర్ వెలిగింది. అతని సిగరెట్ అంటుకుంది. లైటర్ పట్టుకున్న వ్యక్తివంక అతడు సీరియస్గా చూశాడు.

యువకుడు. పచ్చగా, అందంగా వున్నాడు. సూటులో వున్నాడతను. అతడు తనకు వుపయోగపడొచ్చు.

"సిగరెట్ ప్లీజ్," అన్నాడు పీటర్స్.

ఆ యువకుడు సిగరెట్ తీసుకొని వెలిగించాడు. పొగ వదులుతూ పీటర్సు వంక చూశాడు.

"నా పేరు మోహన్" అన్నాడతను.

"ఐయామ్ పీటర్స్," పరిచయం చేసుకున్నాడతను.

"మీరు ఒంటరిగా కూర్చున్నారు. అందుకే యిక్కడి కొచ్చాను" అన్నాడు మోహన్.

"గుడ్, ఐ లైక్ కంపెనీ," అన్నాడు పీటర్స్.

బయట మెర్సిడిస్ కారు ఆగింది. ఒక స్త్రీ కిందకు దిగింది. హోటల్ మేనేజర్ భట్ పరిగెత్తుకెళ్ళి ఆమెకు నమస్కరించాడు. ముగ్గురు హోటల్ నౌకర్లు కారులోని ఆమె సామానులను తీసుకొన్నారు. పీటర్సు, మోహన్ కూర్చున్న సోఫా పక్కనుంచి ఆమె కదుల్తోంది.

"సూట్ నంబర్ 88 మీకోసం రిజర్వ్ చేసి వుంచాం, మిసెస్ బెనర్జీ," అన్నాడు హోటల్ మేనేజర్.

"ఫైన్," అందావిడ.

పీటర్సు ఆమెవంక సూటిగా చూశాడు. ఆమెచాలా ధనవంతురాలై వుండాలని పీటర్స్ క్షణంలో గ్రహించాడు. ఆమె వయస్సు నలభైఅయిదుపైన వుంటుంది. కాని ఆమె బాగా మేకప్ చేసుకొంది. ముప్ఫయ్యేళ్ళ స్త్రీలా చూసేవాళ్ళకు కనిపిస్తోంది. ఎంత వయసొచ్చినా డబ్బు వయస్సును తగ్గించగలదు.

ఆమె లిఫ్టులో పైకి వెళ్ళిపోయింది. హోటల్ మేనేజరు భట్ వెనక్కి తిరిగివస్తూ పీటర్స్ పక్కనే ఆగాడు. పీటర్స్ అతనికి నమస్తే చెప్పి ఆవిడ్ని గురించి అడిగాడు.

"ఆమె మిసెస్ బెనర్జీ. సంవత్సరం క్రితం ఆమె భర్త చనిపోయాడు. ఆమెకు యీ దేశంలో ఎన్నో ఫ్యాక్టరీలున్నాయి. ఆమె ఆస్తి నూరుకోట్లకు పైన వుంటుంది,"

అన్నాడు భట్ సగర్వంగా.

"పెద్దవాళ్ళు మీ హోటల్లోనే దిగుతారు," అన్నాడు పీటర్స్.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్" అని భట్ వెళ్ళిపోయాడు.

పీటర్స్ మెదడు తీవ్రంగా ఆలోచిస్తోంది. మిసెస్ బెనర్జీ తల్చుకుంటే తన కంపెనీ విజయవంతంగా సాగుతుంది. కాని ఆమెను ఎలా పట్టుకోవడం?

పీటర్స్ చూపు పక్కనకూర్చున్న మోహన్ మీదకు వెళ్ళింది. అతడి వంక చూస్తూంటే ఏదో టార్చిలా పీటర్స్ మెదడులో మెరిసింది.

"మిస్టర్ మోహన్, మీరు యెక్కడుంటున్నారు? ఇదే హోటల్లోనా?"

"నో!" అన్నాడు మోహన్.

పీటర్స్ నవ్వాడు. మోహన్ వంక చూశాడు.

"మీరు బిజీగా లేరుగా?"

"ఎందుకలా అడుగుతున్నారు?" ప్రశ్నించాడు మోహన్.

"వీలయితే మీరు నాతో డిన్నర్ సేవిస్తే సంతోషిస్తాను. నేను యిదే హోటల్లో వుంటున్నాను. రూమ్ నెంబర్ 33," అన్నాడు పీటర్స్.

మోహన్ మరో సిగరెట్ను పీటర్స్ పాకెట్ నుంచి తీసుకొని వెలిగించాడు. "నేను నా ఫ్రెండ్ కోసం చూస్తున్నాను. ఏ క్షణంలోనయినా అతడు రావచ్చు" అన్నాడు మోహన్.

పీటర్స్ సోఫాలోంచి లేచాడు. తన సిగరెట్ పాకెట్టును సోఫాలో మర్చిపోయినట్లు వదిలేశాడు.

"మిస్టర్ మోహన్, మీ ఫ్రెండ్‌తో మాట్లాడాక నా గదికి రండి. మీకోసం ఎదురుచూస్తూ వుంటాను."

"ప్రయత్నిస్తాను," అన్నాడు మోహన్.

పీటర్స్ వెళ్ళిపోయాడు. సోఫాలో వున్న సిగరెట్ పాకెట్‌ను మోహన్ తీసి జేబులో దాచుకున్నాడు. సోఫాలో కూర్చుని నలువైపులా చూశాడు. తనకోసం యెవరో రావడం అబద్ధమని అతడికి తెలుసు. పాకెట్ లోంచి మరో సిగరెట్ తీసి అతడు వెలిగించాడు.

అరగంట గాటాక అతడు లిఫ్ట్‌లో పైనున్న ౪౩ గదికి వెళ్ళాడు.

సోఫాలో కూర్చుని స్కాచ్ విస్కీ తాగుతున్న పీటర్స్ అతడివైపు నవ్వుతూ చూశాడు.

"కమాన్, మై ఫ్రెండ్. జాయిన్ ఇన్ డ్రింక్స్?" అన్నాడతను.

ఒక గ్లాసులో విస్కీ పోసి, సోడా కలిపి పీటర్స్ అతడికి అందించాడు.

"చియర్స్!" అని మోహన్ తాగడం ప్రారంభించాడు.

నిమిషాలు గడిచిపోతున్నాయి. ఇద్దరూ బాగా తాగారు. "మిస్టర్ మోహన్, మీరు ఏం చేస్తున్నారు?" అడిగాడు పీటర్స్.

"ప్రస్తుతం ఏ పనిలోనూ లేను" అన్నాడు మోహన్.

"నా కంపెనీ తరఫున మీరు పనిచేయచ్చు" పీటర్స్ అన్నాడు.

"ఏం చెయ్యాలో చెప్పండి."

"నేనీ మధ్యనే టూరిస్టు హోమ్స్ ప్రయివేట్ లిమిటెడ్ స్థాపించాను. కనీసం పదిలక్షలుంటేగాని నా

స్కీము జయించదు. మీరు నా కంపెనీ షేర్ల నమ్మాలి. పదిలక్షలు పెట్టగల్గిన వ్యక్తిని మీరు కల్సుకోవాలి."

"పదిలక్షలు ఎవరు పెట్టగలరు?" అన్నాడు మోహన్ ఆశ్చర్యంగా.

పీటర్స్ సిగరెట్ వెలిగించాడు.

"ఎవరు అంత మొత్తం పెట్టగలరా అని నేనూ ఆలోచిస్తూన్నాను. కాని యివాళ మిసెస్ బెనర్జీని చూశాక ఆమె పెట్టగలదనే నమ్మకం నాకు యేర్పడింది. మీరు ఆమెను కల్సుకోవాలి. ఆమెచేత నా కంపెనీలో డబ్బు పెట్టించాలి" అన్నాడు పీటర్స్.

"అంత సులువైన పనికాదు," అన్నాడు మోహన్.

గ్లాసులోని విస్కీని పీటర్స్ పూర్తిగా తాగేశాడు.

"మిస్టర్ మోహన్, నేను హోటల్ మేనేజర్ భట్‌తో మాట్లాడాను. మిసెస్ బెనర్జీకి మగవాళ్ళంటే పిచ్చి. మిమ్మల్నిచూస్తే ఆమె మీకోసం కొంగ జపం చేస్తుంది"

మోహన్ మాట్లాడలేదు. విస్కీ తాగి సిగరెట్ వెలిగించాడు.

"మిస్టర్ మోహన్, ఆమెభర్త మరణించాడు. ఆమె దగ్గర చెప్పలేనంత డబ్బువుంది. రాత్రిళ్ళు ఆమె ఒంటరిగా పడుకోలేదు! మగతోడు కావాలి," అన్నాడు పీటర్స్.

"చూద్దాం," అన్నాడు మోహన్.

"చూద్దాం అంటేకాదు. మీరు ఆమెను ఆకర్షించడానికి ప్రయత్నించాలి. అందుకోసం నేనన్ని విధాలా సహాయపడతాను," అన్నాడు పీటర్స్.

"ఏ విధంగా?"

"నీకు నెలకు వెయ్యిరూపాయలు జీతం యిస్తాను. ఆమె నా కంపెనీలో డబ్బుపెడితే నీకు యాభయివేలు కమీషన్‌గా యిస్తాను," అన్నాడు పీటర్స్ ఏకవచనం లోకి దిగుతూ.

మోహన్ కాస్సేపు ఆలోచించాడు.

"ఆమెకోసం నేను ప్రయత్నించాలంటే కనీసం రెండు మూడువేలు నాకు కావాలి. నేనెంతో వున్నవాడిలా ఆమెముందు నటించాలి," అన్నాడు మోహన్.

పీటర్స్ తన బాగ్ తెర్చి రెండువేలు తీసి మోహన్‌కి యిచ్చాడు.

"ఈ డబ్బు తీసుకో. చెయ్యవలసినదంతా నువ్వు చెయ్యి."

మోహన్ డబ్బును పాంటు జేబులో దాచుకున్నాడు.

"ఐ విల్ ట్రై!" అన్నాడు మోహన్.

"ఇంత డబ్బిచ్చాక నువ్వు జయించాలి. ప్రయత్నిస్తానంటే లాభంలేదు," అన్నాడు పీటర్స్.

"మిస్టర్ పీటర్స్, నా సామర్థ్యంకొద్దీ కృషి చేస్తాను" అన్నాడు మోహన్.

## 2

మిసెస్ జెన్కిన్స్ హోటల్ ముందున్న మెర్సిడీస్ కారులో ఎక్కింది. కారు స్పీడుగా వెళ్ళిపోయింది.

"ఎక్కడికెళ్ళాలమ్మా?" అడిగాడు డ్రయివర్.

"హోటల్ జీరోకి పద," అందామె.

హోటల్ జీరో కాంపౌండ్‌లో కారు ఆగింది. ఆమె దిగి లోపలకు వెళ్ళింది. పైనున్న రూఫ్ గార్డెన్ రెస్టారెంట్‌లోకి వెళ్ళి ఒంటరిగా ఒక కుర్చీలో కూర్చుంది. రూఫ్ గార్డెన్ అఖండంగా వుంది.

నలువైపులా పూలకుండీలు. గోబీ పుష్పాలవైపు ఆమె ఆనందంగా చూసింది. ఆమె ఆలోచిస్తోంది. తన భర్త బెనర్జీ చనిపోయి సంవత్సరం అయింది. కావల్సినంత డబ్బు తన చేతుల్లో వుంది. కాని తనకు సుఖంలేదు. జీవితం భారంగా సాగుతోంది.

రెస్టారెంట్ బాయ్ ఆమె పక్కకొచ్చాడు.

"ఏం కావాలి, మేడమ్?" అడిగాడతను.

ఆమె అతడివైపు చూసింది. అతడి వయస్సు యిరవైపైన వుంటుంది. మనిషి అందంగాలేడు.

"చికెన్ బిర్యానీ!" అందామె.

బాయ్ వెళ్ళిపోయాడు.

ఆమె ఒంటరిగా కూర్చుంది. ఒక యువకుడు ఆమె టేబుల్ వైపు ఠీవిగా నడుస్తూ వచ్చాడు. ఆగి ఆమెవైపు చూశాడు, నవ్వుతూ.

అతడి పళ్ళు ముత్యాల్లా మెరుస్తున్నాయి. చాలా అందంగా వున్నాడతను.

"మేడమ్, ఇక్కడ కూర్చోవచ్చా?" అన్నాడతను.

"ప్లీజ్, సిట్" అందామె.

ఆమె కెదురుగా కుర్చీలో కూర్చున్నాడతను.

"ఐయామ్ మోహన్!" అన్నాడతను.

"ఐయామ్ మిసెస్ బెనర్జీ! నా పేరు కమల," అన్నదామె.

"మిసెస్ బెనర్జీ కంటే కమల పేరు బాగుంది" అన్నాడతను.

"కమల నా అసలు పేరు. ఆ పేర్తోనే నువ్వు పిలవచ్చు," అందామె.

"థాంక్స్," అన్నాడతను.

రెస్టారెంట్ బాయ్ మళ్ళా వచ్చాడు. అతడు ఆర్డరిచ్చాడు.

ఇద్దరూ తింటూ మాట్లాడుకో సాగారు.

"నువ్వేం చేస్తున్నావు?" అడిగిందామె.

"టూరిస్టు హోమ్ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీలో పని చేస్తున్నాను," అన్నాడతను.

"గుడ్," అందామె.

"మీరు యెక్కడికెళ్ళాలి? నా కారులో మిమ్మల్ని తీసుకెళ్తాను," అన్నాడతను.

"అలాగే, నీ కారులోనే వస్తాను," అందామె.

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"మిస్టర్ మోహన్, నన్ను 'మీరు' అనొద్దు. ఏకవచనంలో నాతో మాట్లాడు," అందామె.

గంట తర్వాత బాయ్ బిల్లు తెచ్చాడు. అతడు బిల్లు చెల్లించాడు. ఆమెతో అతడు బయటకు నడిచాడు. అతడి ఫియట్ కారులో ఆమె ముందుసీటుమీద కూర్చుంది. అతడు కారుని పోనిచ్చాడు. ఆమె ఆలోచిస్తోంది. తన డ్రయివర్ చివరకి తన హోటల్ కి వస్తాడు!

ఫియట్ కారు వేగంగా కదుల్తోంది.

"నువ్వెక్కడి కెళ్ళాలి?" అన్నాడతను.

"హోటల్ సీవ్యూ," అందామె.

"గ్రేట్ హోటల్," అన్నాడతను.

అతడామెను ముట్టుకోడానికి ప్రయత్నించలేదు. పెద్దమనిషిలా కారును పోనిచ్చి సీవ్యూ కాంపౌండ్ లో ఆపాడు. ఆమె కిందకి దిగింది.

"నేను సూట్ నెంబర్ 88లో వున్నాను. నా సూట్ కి రాకూడదూ?" అందామె.

"సారీ, నాకు పనుంది. శేపొస్తాను," అన్నాడతను.

విచారంగా ఆమె అతడికి బై బై చెప్పింది. షియట్ కారు వెళ్ళిపోయాక ఆమె హోటల్ లోపలకు వెళ్ళింది.

హోటల్ ముందుహాల్లో కూర్చున్న పీటర్స్ ఒంటరిగా వెళ్తూన్న ఆమెవంక నవ్వుతూ చూశాడు.

# 3

మోహన్ తలుపుమీద తట్టాడు.

"కమిన్!" అర్చాడు పీటర్స్.

అతడు లోపలకు వెళ్ళి తలుపుమూశాడు. పీటర్స్ సోఫాలో కూర్చొని దినపత్రిక చదువుతున్నాడు.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు మోహన్.

"గుడ్ మార్నింగ్, కూర్చో! నీ కోసమే చూస్తున్నాను."

మోహన్ పక్క-సోఫాలో కూర్చుని టీపాయిమీదున్న సిగరెట్ పాకెట్ లోంచి సిగరెట్ తీసి వెలిగించాడు. పొగ వదులూ అతడివంక చూశాడు.

"ఆమెను కలుసుకున్నాను" అన్నాడు మోహన్.

"చూశాను!" అన్నాడు పీటర్స్ క్లుప్తంగా.

క్షణకాలం గదిలో నిశ్శబ్దం తాండవించింది.

"మన కంపెనీ విషయం మాట్లాడావా?"

"ఆ విషయం మొదటే ఎత్తితే ఆమె నన్ను దగ్గరకు రానివ్వదు" అన్నాడు మోహన్.

"మనకు కావలసింది డబ్బు, ఆమెకు దగ్గరవడంకాదు!"

"మిస్టర్ పీటర్స్, నా ప్లాన్ ప్రకారం నేనంతా చేస్తాను. మీరు నన్ను తొందరపెట్టకూడదు!"

"ఆల్ రైట్, గో ఎహెడ్!"

మోహన్ అతడివైపు సూటిగా చూశాడు.

"నాకు మరో రెండువేలు కావాలి."

"నా దగ్గర నోట్లను ముద్రించే మిషన్ లేదు! నేను నీ కిచ్చినది పూర్తయేలోపల నువ్వు అంతా సాధించాలి."

"ఐయామ్ సారీ, అది వీలుపడదు! థీయేటర్ కారుకు గారేజుకు రెండువందలు అద్దె యివ్వాలి. కారు నాకు అద్దె కిచ్చిన కంపెనీ వాళ్ళకు అయిదురోజుల అద్దె ముందుగా యిచ్చాను. నా పాత బాకీల వగైరా తీర్చాక ప్రస్తుతం నా దగ్గర వందరూపాయలుంది. ఇవాళ ఆమెను కల్సుకో వాలి. ఎక్కడెక్కడికో ఆమెను తీసుకెళ్ళాలి!"

పీటర్స్ చిరాకుగా అతడివైపు చూశాడు.

"ఆమెను గదికెళ్ళి కల్సుకో! అప్పుడు డబ్బు ఖర్చు వుండదు. నీ దగ్గరున్న వందరూపాయలు చాలు."

"అయితే నేను పని మానుకుని నా హోటల్ కి పోవాలి!"

గాభరాగా పీటర్స్ అతడివంక చూశాడు.

"తొందరపడకు. మరో వెయ్యి యిస్తాను. దానితో పని కానీ!"

"యింపాసిబుల్."

పీటర్ సోఫాలోంచి లేచి గాడ్ రెజ్ బీరువా దగ్గరకు వెళ్ళాడు. కాసేపట్లో తిరిగొచ్చి రెండువేలు మోహన్ కి యిచ్చాడు.

"మళ్ళా డబ్బుకోసం యీ గదిలోకి రావద్దు!" అర్చాడు పీటర్స్.

మోహన్ తీయగా నవ్వాడు.

"మిస్టర్ పీటర్స్, నేను జయిస్తే మీ చేతుల్లోకి పది లక్షలు వస్తాయి. నా పని సఫలం కావడానికి పెట్టుబడి లేకుండా ఏ ప్రయత్నమూ ఫలించదు!" అన్నాడు మోహన్.

"అదంతా నాకు తెలుసు! పని తొందరగా కానీ! నేనీ హోటల్ కి వచ్చి చాలారోజులైంది. హోటల్ బిల్లు నన్ను తినేసుంది!"

"డోంట్ బాదర్" అని మోహన్ సోఫాలోంచి లేచాడు.

"మళ్ళా ఎప్పుడు కనిపిస్తావు?"

మోహన్ పకపకా నవ్వాడు.

"డబ్బు కావలసినప్పుడు."

"మిస్టర్ మోహన్, బి సీరియస్! వ్యాపారంలో జోక్స్ ఐ డిస్ లైక్!" అన్నాడు పీటర్స్ చిరాకుగా.

గుమ్మందాకా వెళ్ళి మోహన్ వెనక్కు తిరిగి పీటర్స్ వైపు చూశాడు. పీటర్స్ పొట్టిగా, లావుగా, నల్లగా వున్నాడు. అతడి కళ్ళు ఎర్రగా మెరుస్తున్నాయి. కళ్ళు చూడగానే అతడు తాగుబోతని అందరూ వూహిస్తారు. బట్టతల.

"మిస్టర్ పీటర్స్, మీలా నేను సీరియస్ గా వుంటే యీ పనిలో జయించలేను. నవ్వుతూ, పాడుతూ వుంటే గాని మిసెస్ బెనర్జీని నేను ఆకర్షించలేను!" అని మోహన్ తలుపు తెర్చుకుని బయటకు వుషారుగా వెళ్ళి పోయాడు.

## 4

మిసెస్ బెనర్జీ స్నానం చేసి, బాగా ముస్తాబై పడగ్గది లోని అద్దం ముందు నిలబడి తన ప్రతిబింబాన్ని చూసుకో సాగింది.

మోహన్ ఆమెకు జ్ఞప్తికొచ్చాడు. చాలా అందమైన యువకుడు. అతడికి పెళ్ళయిందో లేదో తను కనుక్కో వాలి. గతరాత్రి ఆమెకు నిద్రపట్టలేదు. రెండు గంటల

దాకా ఆమె మేలుకొనే వుంది. టేప్ రికార్డర్ ని ఆన్ చేసి పాటలు వింటూ కూర్చుండిపోయింది. రెండు తర్వాత ఆమెకు తెలియకుండానే నిద్రపట్టేసింది.

తనతో చెప్పినట్లు మోహన్ మళ్ళీ వస్తాడా? తనని కల్సుకుంటాడా? తనను గురించి ఆమె ఏమీ అతడితో చెప్పనందుకు మిసెస్ బెనర్జీ విచారించింది. పాపం, అతడు హోటల్ బిల్లుకూడా చెల్లించాడు. మళ్లీ అతడు కనిపించ దేమో!

గదిలో వున్న టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని ఆత్రంగా అందుకుంది.

"హలో, మిసెస్ బెనర్జీ స్పీకింగ్!" అందామె.

"నేనమ్మగారూ, పేర్రాజుని" అందో కంఠం అటువైపునుంచి.

క్షణకాలం నిరాశతో ఆమె గది నలువైపులా చూసింది. పేర్రాజు! మద్రాసులో తన కంపెనీల రీజనల్ మేనేజర్. అతడంటే ఆమెకు పరమ అసహ్యం. కంపెనీల విషయాలు చెప్పి బోరుకొడ్తాడు.

"పేర్రాజుగారూ, నాతో మాట్లాడాలా?" అందామె.

"ఆ వుద్దేశంతోనే హోటల్కి వచ్చాను. రిసెప్షన్ హాల్లోంచి మీతో మాట్లాడుతున్నాను. కంపెనీ విషయాలు ఎన్నో చర్చించాలి!"

"నేను నిన్నే వచ్చాను. అలసటగా వుంది. మీరు ఆఫీసుకు వెళ్ళండి. ఇవాళో, రేపో నేను అక్కడికొస్తాను" అందామె.

"మస్కట్ కాంట్రాక్ట్ మనకు వచ్చింది. ఈ కాంట్రాక్ట్ మనకు వచ్చేందుకు నేను చాలా ప్రయాస్నిం

చాను. మస్కట్ వెళ్ళి అక్కడ వుండి అంతా సాధించాను. ఈ కాంట్రాక్ట్ విలువ యాభై కోట్లు!"

"గుడ్ వర్క్! అంతా నేను ఆఫీసుకొచ్చి మాట్లాడుతాను, బై బై" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

పేరాజు షెమికల్ లాంటి వ్యక్తి. వింటూ వుంటే అలా చెపూనే వుంటాడు.

మరోసారి తన రూపాన్ని అద్దంలో చూసుకుని ఆమె సోఫాలో కూర్చుంది.

మోహన్ రూపం ఆమె మెదడులో తిరుగుతోంది. ఆమె తన వాచ్ వైపు చూసింది. టైమ్ పది దాటింది. మోహన్ ఎక్కడుంటున్నాడో తను కనుక్కోలేదు. నిజం చెప్పాలంటే అతడు తన సమీపంలో వున్నంత సేపూ ఆమె ఈ లోకంలో లేదు. తీయటి అతడి మాటలు వింటూ ఆమె పూర్తిగా మర్చిపోయింది.

వెళ్ళిపోతూ మోహన్ అన్న ఆఖరి మాటలు ఆమెకు బాగా గుర్తున్నాయి. మిసెస్ బెనర్జీ ఆలోచించడం మాని టీపాయ్ మీదున్న అమెరికన్ ప్లేబాయ్ పత్రికను తిరగేస్తూ కూర్చుంది. ఆ పత్రిక హిందూదేశంలో దొరకడం కష్టం. ఒక స్మగులర్ ఆ పత్రికను ఎన్నేళ్ళగానో ఆమెకు సప్లయి చేస్తున్నాడు.

రంగురంగుల బొమ్మలవయిపు ఆమె చూస్తోంది. కాని ఆమె మనస్సు పత్రికమీద లేదు. మోహన్ రూపం పత్రికలోంచి ఆమెకు గోచరిస్తోంది.

గదిలోని టెలిఫోన్ మ్రోగింది. మిసెస్ బెనర్జీ అమాంతంగా సోఫాలోంచి లేచి, ఏదో ఆలోచనతట్టి తిరిగి సోఫాలో కూర్చుండిపోయింది. తన కంపెనీల రీజనల్ మేనేజర్ పేరాజు యింకా రిసెప్షన్ హాల్లోంచి వెళ్ళి

పోయుండడదు. ఆ జడ్డు మనిషి తనకు మళ్ళా ఫోన్ చేసి వుంటాచ్చు. తను రిసీవర్ ఎత్తకపోతే, ఏదో పనిలో వుందని భావించి అతడు వెళ్ళిపోతాడు. శని విరగడవుతుంది.

తన భర్త బెనర్జీ ఆమెకు జ్ఞాపకొచ్చాడు. అతడు దేశ వ్యాప్తంగా యిన్ని కంపెనీలు స్థాపించి అన్నింటినీ ఎలా చూసేవాడో! టెలిఫోన్ యింకా మ్రోగుతూనే వుంది. రిసీవరెత్తి పేర్రాజును గట్టిగా తిట్టాలి. మళ్ళా ఫోన్ చెయ్యవద్దని చెప్పాలి.

సోఫాలోంచి లేచి ఆమె రిసీవర్ని అందుకుంది.

"హలో!" అంది విసుగ్గా.

"అయామ్ మోహన్" అందొక కంఠం తీయగా.

ఆమె గుండె దడదడ కొట్టుకుంది. ఆమె వళ్ళు ఒణుకుతోంది.

"నీకోసమే ఎదురు చూస్తున్నాను" అంది.

"నన్ను క్షమించాలి. నేను ఈవేళ నీ దగ్గరికి వస్తానన్నాను. కాని రాలేను. మా కంపెనీ పనితో బిజీగా వున్నాను."

వెధవ కంపెనీలు! ఈ కంపెనీల పనుల్లో యిరుక్కుని మానవులందరూ బానిసలయి పడుంటున్నారు.

"మోహన్, నువ్వెక్కడున్నావు?" అడిగిందామె.

"ఒక హోటల్లోంచి నేను నీతో మాట్లాడుతున్నాను."

"మోహన్, ఆ హోటల్ పేరు చెప్పు. నేనక్కడికొస్తాను. నీతో మాట్లాడాలి."

"ఇది చాలా చిన్న హోటల్. ఇక్కడకు నువ్వు రావద్దు."

"హోటల్ బయట నువ్వు నిలబడు. నేనొస్తాను."

"అయితే తొందరగా రా. ఈ హోటల్ ముందు

రోడ్డులో వుంది. పేరు నెహ్రూ హోటల్. పేవ్ మెంట్ మీద నిలబడి నీకోసం ఎదురుచూస్తూ వుంటాను."

"వెంటనే వస్తున్నా. వెయిట్ ఫర్ మి" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

హేండ్ బాగ్ పట్టుకుని ఆమె బయటకు నడిచింది. నడవలో డ్రైవర్ ప్రత్యక్షమయ్యాడు. ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"మస్తాన్, నాకు కారక్కర్లేదు. నువ్వు యిక్కడే వుండు" అని ఆమె లిఫ్ట్లో కిందకు వెళ్ళిపోయింది. రిసెప్షన్ హాల్లోంచి బయటకు వెళ్తూ ఆమె నలువైపులా చూసింది. హోటల్ మేనేజర్ భట్ వినయంగా ఆమె వైపు పరుగెత్తుకొచ్చాడు.

"మిసెస్ బెనర్జీ, మీ కారు తెప్పించనా?" అడిగాడతను.

"నో ప్లీజ్, టాక్సీలో వెళ్తాను" అందామె.

ఆమెకంటె ముందు భట్ బయటకు పరుగెత్తాడు. హోటల్ మోజాయిక్ మెట్లు ఆమె దిగేసరికి అందమైన టాక్సీ సిద్ధంగా వుంది. టాక్సీ వెనక తలుపును భట్ తెరిచి పట్టుకున్నాడు. ఆమె సీటుమీద కూర్చోగానే భట్ తలుపు మూశాడు.

టాక్సీ గేటువైపు దూసుకుపోయింది. ఆమె యిరువైపులా చూసింది. కారులో కూర్చున్న పేరాజు రూపం ఆమెకు కనిపించింది. ఆమె కోపంగా తలను పక్కకి తిప్పేసుకుంది. ఈ జిడ్డుగాడింకా యిక్కడే వున్నాడు.

"డ్రైవర్, మౌంట్ రోడ్డులోని నెహ్రూ హోటల్ కి పద."

"అలాగేనమ్మా!" అన్నాడు డ్రయివర్ వినయంగా.

# 5

హోటల్ ముందు ఆగిన టాక్సీలోంచి ఆమె దిగింది. ఎంతని డ్రయివర్ని అడిగింది. ఐదు రూపాయలు అన్నాడతను.

హేండ్ బాగ్ లోంచి పదిరూపాయిల నోటు తీసి అతడి కిచ్చింది.

"వుండమంటే వుంటానమ్మా!" అన్నాడు డ్రయివర్.

వెళ్ళిపొమ్మని ఆమె డ్రయివర్ కి సౌజ్ఞ చేస్తూ నలువైపులా చూసింది.

పేవ్ మెంట్ మీద కొంచెం దూరంలో మోహన్ నిలబడి వున్నాడు.

టాక్సీ వెళ్ళిపోయాక ఆమె అతడివైపు నడిచింది.

"నీ కారెక్కడ?" ప్రశ్నించిందామె.

సమీపంలోవున్న ఫియట్ వైపు అతడు చూపించాడు.

"కారులో పోదాం. పద" అందామె.

ఆమె ముందుసీటులో కూర్చుంది. మోహన్ కారును పోనిచ్చాడు. ఓరగా అతడామెవంక చూశాడు. ఆమె ధరించిన దుస్తులు చాలా ఖరీదైనవి. విదేశీ సెంటు సువాసన అతడివైపు కొడ్తోంది. లిప్ స్టిక్ తో ఆమె పెదిమలు ఎర్రగా మెరుస్తున్నాయి. ఆమె మెళ్ళోని డైమండ్ నెక్లెస్ ధగధగ మెరుస్తోంది.

"దూరంగా, యీ పిచ్చిలోకానికి దూరంగా పోదాం" అందామె.

"కంపెనీ పని మాని ఆలా తిరిగితే నా వుద్యోగం పోతుంది!" అన్నాడతను నవ్వుతూ.

"నీ వుద్యోగం పోతే బాధపడేవాళ్ళు చాలామంది వున్నారా?"

"ఎక్కువమంది లేకపోవచ్చు! మా వూళ్ళో అమ్మ మాత్రం వుంది. ఆమెకు ప్రతినెలా వంద పంపాలి!"

ఆమె సంతోషించింది. అతడికింకా పెళ్ళికాలేదు.

"అంతేనా?" అందామె.

"నా స్వంత ఖర్చు వుందిగా! బ్రహ్మచారిగా జీవించే వాడికి ఖర్చు ఎక్కువ!" అన్నాడు మోహన్.

"నీకు చాలామంది గర్ల్ ఫ్రెండ్స్ వున్నారా?"

అతడు ఫక్కున నవ్వాడు.

"సాధారణంగా ఆడవాళ్ళకు నేను దూరంగా వుంటాను. నిన్ను చూడగానే ఎందుకో మాట్లాడాలనిపించింది."

"నాలో అంత ఆకర్షణ వుందా?" అడిగిందామె వుషారుగా అతడివంక చూస్తూ.

అతడు కారును మెల్లిగా పోనిస్తూ ఆమెవైపు ఓరగా చూశాడు.

"చిన్నతనంలో ఒకమ్మాయి నాతో ఆడుతూ వుండేది! బతికి వుంటే ఆమె అచ్చంగా నీలాగే వుండేది. ఆమె పేరు కూడా కమల!"

"ఆమె కేమైంది?"

"ఒకరోజు స్కూల్ నుంచి వస్తూ బస్సుకిందపడి మరణించింది!ఆనాడు నేను చూసిన ఆమె శవం యింకా గుర్తుంది!"

"బాడ్ లక్!" అందామె.

"అటుపైన నేనెవరితోనూ స్నేహం చెయ్యలేదు. నిన్ను చూస్తూంటే ఆ అమ్మాయి నాకు గుర్తొస్తోంది. మీ యిద్దర్కీ పోలికలు బాగా వున్నాయి!"

"ఆమె నాకంటె చిన్నది, నేను పెద్దదాన్ని!"

అతడు తీయగా నవ్వాడు.

"కమలా. నువ్వు నా కళ్ళకు యువతిలా కనబడుతున్నావు! వయస్సు నీ దరిలికి రాలేదు!" అన్నాడతను.

"నిజంగా?"

అతడు కారును ఆపాడు. బీచ్ లోపల రోడ్డు మీద కారాగివుంది. దూరంలో సముద్రం, సమీపంలో ఎవ్వరూ లేరు. అతను పక్కకు తిరిగి కూర్చొని ఆమె కళ్ళలోకి చూశాడు.

ఆమె కనురెప్పలు చిల్లించింది. అతడిని తన వైపుకు లాగడానికి కళ్ళతో, చిరునవ్వుతో ప్రయత్నించింది. అతడు అలా చూస్తూనే వున్నాడు.

"ఏమిటలా చూస్తున్నావు?" అడిగిందామె.

"నువ్వు చాలా అందంగా వున్నావు!"

ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఆడదాని అందం ఆరాధించే పురుషుడి కళ్ళల్లో వుంది! ఒకనాడు తను కోల్పోయిన కమలను అతడు తనలో చూస్తున్నాడు.

తటాలున ఆమె అతడి చెయ్యి పట్టుకుని నిమిరింది. సిగ్గుపడ్తూ అతడు ముఖాన్ని పక్కకు తిప్పుకున్నాడు.

"ఇక పోదామా?" అడిగాడు.

"ఎక్కడకు!"

"నిన్ను నీ హోటల్ ముందు దింపి, నేను నా కంపెనీ పని చూసుకుంటాను" అన్నాడతను.

"ఇవాళ సెలవు తీసుకో!"

"నో ప్లీజ్. సాయంత్రం మా బాస్‌ను కల్సుకొని చేసినదంతా చెప్పాలి."

ఆమె అతడి చెయ్యిని మళ్ళీ నిమిరింది.

"మోహన్, నీ పని అయినాక నా సూట్‌కి రా. నా గదిలో యిద్దరం డిన్నర్ చేద్దాం."

"చూస్తాను."

"చూస్తాననంటే కాదు, చేస్తాననాలి."

అతడామె ముక్కును వేళ్ళతో పట్టుకుని మెల్లిగా నొక్కాడు.

"అలాగే వస్తాను. ఎప్పుడు రావాలి?"

"ఎప్పుడైనా సరే, నీ యిష్టం."

"తొమ్మిదింటికి వస్తాను."

అతడు కారును పోనిచ్చాడు. హోటల్ సీవ్యూకి ఫర్లాంగు దూరంలో అతడిని కారాపమని ఆమె దిగి, రోడ్డు వారగా వున్న టాక్సీలో ఎక్కింది. కారులోంచి దిగి మోహన్ టాక్సీ దగ్గరకు వెళ్ళాడు.

ఆమె అతడి వంక ఆప్యాయంగా చూసింది.

"ఇది మంచి పద్ధతి! అనవసరంగా పుకార్లు పుట్టించడం నా కిష్టంలేదు. తొమ్మిదింటికి వస్తావుగా?"

"ష్యూర్" అన్నాడతను.

టాక్సీ కదిలింది. మోహన్ తన కార్లో కూర్చుని తలుపు మూసి, సిగరెట్ వెలిగించాడు. మిసెస్ బెనర్జీ తనకు బానిసవుతోంది! త్వరలో ఆమె తనకు లొంగుతుంది. ఆమెకు తను సులువుగా చిక్కిపోకూడదు. ఆమెను ఇంకా యింకా ఊరించాలి. ఆమె ఆకల్ని రెచ్చగొట్టాలి.

మోహన్ తన కారును హోటల్ భారత్‌కి పోనిచ్చి కాంపౌండ్‌లో ఆపి, కిందవున్న తన గదికి వెళ్ళాడు. చిన్న గది. చౌకబారు హోటలు.

అతను మంచంమీద పడుకుని ఆమెను గురించి ఆలోచించసాగాడు. పీటర్స్ ఆశించినట్లు ఆమె పదిలక్షలు పెట్టి అతడి కంపెనీలో షేర్లు కొంటుందా? ఎంత ఆలోచించినా జవాబు అతడికి తట్టలేదు.

# 6

మిసెస్ బెనర్జీ సూట్‌లో లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. ముందు విశాలమైన హాలు. వెనక పడగ్గది. దాని పక్కనే బాత్‌రూమ్.

హాల్లోని సోఫాలో ఆమె కూర్చుంది. టేప్ రికార్డర్ నుంచి సినిమా పాటలు వినబడుతున్నాయి. ఆమె టీపాయ్ వైపు చూసింది. స్కాచ్ విస్కీ బాటిల్, గ్లాసులు వున్నాయి.

ఎవరో తలుపును తట్టారు. హోటల్ బాయ్ వినయంగా ఆమెవైపు చూశాడు. గదిలో యుడీకోలోన్ సువాసన అన్నివైపులా వ్యాపించింది. అన్ని గదుల్లోనూ ఆమె యుడీకోలోన్ స్ప్రే చేయించింది.

"నేనివాళ గదిలోనే డిన్నర్ తీసుకొంటాను. తొమ్మిది తర్వాత నేను చెప్పాక యిద్దర్కి డిన్నర్ తేవాలి" అందామె.

"అలాగే, మేడమ్" అని బాయ్ వెళ్ళిపోయాడు.

మోహన్ని గురించి ఆలోచిస్తూ ఆమె టైమ్ చూసింది. ఎనిమిది అయింది. టైమ్ కదలడం లేదనిపించింది.

మోహన్ తన గదికొస్తాడు. గదుల్లో వాళ్ళిద్దరూ తప్ప మరెవ్వరూ వుండరు. అతడిమీద తన ప్రేమను ప్రదర్శించే అవకాశం ఆమెకు పూర్తిగా వుంటుంది.

టెలిఫోన్ మ్రోగింది. తను డిన్నర్‌కి రానని చెప్పడానికి మోహన్ ఫోన్ చేస్తున్నాడేమో! భయంతో వెళ్ళి రిసీవర్న అందుకుంది.

"హల్లో!" అంది.

"నేను షేరాజుని! మీతో అర్జంటుగా మాట్లాడాలి. మీరు ఆఫీసుకు వస్తారనుకున్నాను. రాలేదు" అన్నాడతను.

"మీరెక్కడున్నారు?"

"హోటల్ రిసెప్షన్ హాల్లో."

"పేర్రాజుగారూ, మీరు వెంటనే యింటికి వెళ్ళిపోండి. నేనిప్పుడు ఎవరితోనూ మాట్లాడలేను."

"ఈ నెలలో మా అమ్మాయి పెళ్ళుంది. నాకు ఇరవై వేలు కావాలి. దాన్నిగురించి మాట్లాడ్డానికి వచ్చాను."

ఆమె టైమ్ చూసింది. 8-45 అయింది. పేర్రాజును వెంటనే బయటకు పంపేయాలి!

"రేపు ఆఫీసుకొచ్చి ఆ డబ్బువిషయం నేను చెప్తాను" అందామె.

"రేపు పొద్దుట నేను డ్రాఫ్ట్ తీసి మొగపెళ్ళి వారికి కొంత డబ్బు పంపాలి. మీరు ఆఫీసుకొచ్చేసరికి బ్యాంకి టైమ్ అయిపోవచ్చు" అన్నాడు పేర్రాజు.

"ఎంత పంపాలి?"

"పదివేలు."

"పదివేలు డ్రా చేసి తీసుకోండి. రేపు అంతా మాట్లాడుదాం."

"థాంక్స్, మిసెస్ బెనర్జీ. రేపు మీరు వస్తారుగా?"

"వస్తాను."

"ఎన్నింటికి?"

జిడ్డు పేర్రాజు! ఆమె విసుక్కుంది.

"ఏదో టైమ్‌లో వస్తాను. పదివేలు తీసుకోమన్నానుగా!" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

ఆమె సోఫాలో కూర్చుంది. పేర్రాజును గురించి భర్త చెప్పిన మాటలు ఆమెకు జ్ఞాపకొచ్చాయి. ఏదో చెప్పి పేర్రాజు లక్షపైన కంపెనీనుంచి తీసుకొన్నాడు. ఇప్పుడు

మరో పదివేలు! అతడితో రేపు యిదంతా మాట్లాడాలి!

టైమ్ తొమ్మిదైంది. ఆమె సోఫాలోంచి లేచి పడక గదిలోకి నడిచింది. డబుల్ కాట్ మీద ఫోమ్ బెడ్. పైన వెల్ వెట్ దుప్పటి. మెత్తటి తలగడలు. ఆమె గది నలు వైపులా చూసింది. ఏర్ కండిషండ్ గది. గది స్వర్గంలా వుంది. మొజయిక్ ఫ్లోర్ మెరుస్తోంది.

ఎవరో తలుపును తట్టారు. ఏర్ కండిషండ్ హాల్లోకి ఆమె పరుగెత్తింది. ఆత్రంగా తలుపు తెర్చింది. హోటల్ మేనేజర్ భట్ బయట నిలబడి వున్నాడు, నవ్వు ముఖంతో.

"మీరు గదిలో డిన్నర్ చేస్తారని తెలిసింది. ఎవరో వస్తున్నారని విన్నాను. స్పెషల్ ఐటమ్స్ ఏమైనా కావాలా?"

"స్వీట్స్, ఫ్రూట్స్ వగైరా పంపండి."

"యిన్ యువర్ సర్వీస్, మిసెస్ బెనర్జీ" అని భట్ వెళ్ళిపోయాడు.

ఆమె తలుపుమూసి, హాల్లోని సోఫాలో చతికిలబడింది. టైమ్ చూసింది. తొమ్మిదీ పది కావస్తోంది. ఇంకా మోహన్ రాలేదు!

కాస్సేపట్లో ఎవరో తలుపును వేళ్ళతో తట్టారు. ఆమె తలుపు తెర్చి బయట నవ్వు ముఖంతో నిలబడివున్న మోహన్ వైపు వుద్రేకంతో చూసింది.

"కమిన్ మోహన్," అందామె.

అతడు గదిలోకొచ్చాక ఆమె తలుపు మూసింది. ఏర్ లాక్ క్లిక్ మంది. అతడికి సోఫా చూపించి ఆమె కూర్చోమని పక్కనే చతికిల బడింది.

ఆమె గుండె వేగంగా కొట్టుకొంటూంది. ఆమె

నవ్వుతూ అతని వంక చూసింది.

"సారీ, ఆలస్యమైంది. మా బాస్ నన్ను ఒకంతట వదల్లేదు."

"డోంట్ బాదర్!" అని ఆమె కిలకిల నవ్వింది.

మోహన్ చూపు ఆమెమీద కేంద్రీకృత మయింది. మిసెస్ బెనర్జీ పల్చటి షిఫాన్ చీర ధరించింది. లోపలి సాటిన్ పావడా అతనికి కనిపిస్తోంది. లోకట్ జాకెట్ నుంచి ఆమె స్తనాలు కొద్దిగా కనిపిస్తున్నాయి. ఆమె జుత్తు నల్లగా మెరుస్తోంది. జుత్తును ఆమె అందంగా సిగ చుట్టుకొంది. నుదురుమీద ఎర్రటి తిలకం. సిగ చుట్టూ మల్లెపూలు.

"నువ్వు ఎన్నింటికి తింటావు?"

"రోజూ పది దాటుతుంది."

"హేవ్ సమ్ డ్రింక్స్," అని ఆమె స్కాచ్ బాటిల్ వైపు చెయ్యి చూపించింది.

అతడు స్కాచ్ విస్కీని రెండు గ్లాసుల్లో పోశాడు. ఆమె రిఫ్రిజిరేటర్ నుంచి మూడు సోడాబుడ్లు తెచ్చి టీపాయ్‌మీద పెట్టింది. అతడు గ్లాసుల్లో కొంచెం సోడా పోశాడు.

ఇద్దరూ గ్లాసులను అందుకున్నారు.

"చియర్స్," అందామె.

"చియర్స్," అన్నాడతను.

"కంపెనీకోసం నేను కొద్దిగా తీసుకొంటాను. విదేశాలలో వున్నపుడు యిది నాకు అలవాటైంది," అన్నదామె.

"విదేశాలలో అందరూ తాగుతారు!" అన్నాడతను.

"నువ్వు విదేశాలకు వెళ్ళావా?" ప్రశ్నించిందామె.

"సింగపూరు వెళ్ళి వచ్చాను. ఇప్పుడు మా బాస్ నన్ను మస్కాట్ కి పంపుతానంటున్నాడు."

"మస్కాట్ యెడారిలాంటి దేశం. అక్కడికెళ్ళి ఏం చేస్తావు?"

"మస్కాట్ సుల్తానుకి మా కంపెనీ షేర్లు అమ్మాలి. పదిలక్షల వరకూ అతడు మా కంపెనీలో పెట్టొచ్చు."

"అంతదూరం వెళ్ళడం వృథా! డబ్బున్నవాళ్ళు మన దేశంలోకూడా వున్నారు," అందామె.

"మా బాస్ యెంతచెప్పినా వినడు. ఈ దేశంలో ధనవంతులున్నారని నేనంటే వాళ్ళచేత డబ్బు పెట్టించ మంటాడు."

"మీ కంపెనీ చేసేదేమిటి?"

"మా కంపెనీ అందమైన కాటేజస్‌ను సముద్రపు ఒడ్డున నిర్మిస్తుంది. ప్రతి కాటేజ్ లోనూ డ్రాయింగ్ రూమ్, పడగ్గది, బాత్ రూమ్ వుంటాయి. డాబామీదకు మెట్లు వుంటాయి. మొత్తం రెండువందల కాటేజ్ లు నిర్మించాలని మా ప్లాను. దీనికోసం మద్రాసుకు నలభై మైళ్ళ దూరంలో గోల్డెన్ శాండ్స్ అనే మూడువందల గ్రౌండ్స్ స్థలాన్ని మా కంపెనీ కొంది."

"బాగుంది, ప్రొసీడ్" అందామె.

అతడు రెండు గ్లాసుల్లోనూ మళ్ళా విస్కీపోసి, సోడా కలిపాడు. ఆలోచిస్తూ ఆమె గ్లాసు అందుకొంది. ఇద్దరూ నిషాలోనిండి స్వర్గాన్ని చూడొచ్చు. మోహన్ రాత్రికి యిక్కడే వుండాలి.

"ఆ కాటేజస్‌లో వుండేవాళ్ళకు ఒకపెద్ద హోటలును మా కంపెనీ స్థాపిస్తుంది. అన్నిటికీ సౌకర్యంగా వుంటుంది. సమీపంలో ఒక స్నేక్ పార్కు, మినీ జూ

పెట్టాలని మా ఆశ. అనేకనుండి విదేశీ టూరిస్టులు యీ కాటేజస్‌ను అద్దెకు తీసుకుంటారు. రోజుకు అద్దె వంద రూపాయలు. 200 నదులమీదా అద్దెరూపంలో రోజుకు యిరవై వేలు వస్తుంది. నెలకు 6 లక్షలు. షేర్లు కొన్న వాళ్ళకు బాగా లాభాలు వస్తాయి."

"ఫైన్ స్కీమ్," అందామె.

అతడు సిగరెట్ వెలిగించాడు.

"ఒక కాటేజ్ నేను తీసుకుంటాను. నునిద్దరం అక్కడ హాయిగా వుండొచ్చు," అందామె.

అతడు ఫక్కున నవ్వాడు.

"ఎవరేనా కొనేముందు కాటేజ్‌లను నిర్మించాలి. అది చెయ్యాలంటే పదిలక్షలు పెట్టుబడి కావాలి!"

ఆమె ఆలోచిస్తూ అతడివంక చూసింది.

"మీరు కాటేజస్ కట్టే స్థలం యెక్కడుంది?"

"మహాబలిపురానికి రెండు కిలోమీటర్ల దూరంలో."

"ఆ స్థలాన్ని మనం వెళ్ళి ఒకసారి చూద్దాం" అందామె.

"ఎందుకు?"

"ఆ స్థలం నాకు నచ్చితే మీ కంపెనీలో డబ్బు నేనే పెడ్తాను. అప్పుడు డబ్బుకోసం నువ్వు మస్కట్ దాకా వెళ్ళనక్కరలేదు. అంతదూరం నువ్వెళ్ళడం నా కిష్టం లేదు," అందామె.

అతడామెవైపు ఆప్యాయంగా చూశాడు.

"ఇంతవరకూ మా కంపెనీ విషయాలు మాట్లాడుతూ కాలం వ్యర్థంచేశాం. ఐయామ్ సారీ!" అన్నాడు మోహన్.

"బాగా చెప్పావు," అని ఆమె గ్లాసుల్లో మళ్ళా విస్కీపోసి సోడా కలిపింది.

పది దాటిందాకా యిద్దరూ తాగుతూనే వున్నారు. ఆమె వుషారుగా లేచి సోఫాలోంచిలేచి రిసీవర్ని ఎత్తింది. తన గదికి వెంటనే డిన్నర్ పంపమని రిసెప్షన్ గుమస్తాతో చెప్పింది.

"యస్ మేడమ్," అన్నాడతను.

రిసీవర్ పెట్టేసి ఆమె అతడి దగ్గరగా కూర్చుంది. తటాలున చేతుల్తో అతడిని చుట్టేసింది. అతడి కళ్ళలోకి చూసింది. అమాంతంగా అతడి పెదిమలను ముద్దెట్టుకుంది.

సిగ్గుపడ్తూ అతడు కొంచెం దూరంగా జరిగాడు. అతడి ఒళ్ళో తలవాల్చి ఆమె వెల్లకిలా పడుకొని మోహన్ వేపు చూసింది.

"కమలా, మనం తొందరపడకూడదు. దేవతలా నిన్ను పూజిస్తాను. సాధారణ మానవుల్లో చెలరేగే కోర్కెలు మనలో తలెత్తకూడదు. నువ్వు నే నారాధించే దేవతవి," అన్నాడతను వుద్రేకంతో.

ఆ క్షణంలో అతనొక అమాయకుడిలా ఆమె కళ్ళకు కనిపించాడు. అనుభవంలేని యువకుడు! ఎన్నడూ ఆడదాని చెంతకు వెళ్ళని అమాయకుడు!

మోహన్ మళ్ళా స్కాచ్విస్కీని గ్లాసుల్లో పోసి, సోడా కలిపాడు. అంతమంచి విస్కీ తనకు మళ్ళా దొరకదు. దొరికినప్పుడు తనివితీరా తాగాలి.

"ఇంక నేను తాగను," అందామె.

"నీకోసం పోసేశాను."

"రెండు గ్లాసుల్లోదీ నువ్వేతాగు" అందామె.

ఆమె ఎంగిలి గ్లాసులోని విస్కీని అతడు గడగడ తాగేశాడు. ఆమె గాభరాగా అతడివంక చూసింది.

ఎవరో తలుపు తట్టారు. ఆమెవెళ్ళి తలుపు తెర్చింది

చక్రాలున్న డైనింగ్ టేబుల్ని హోటల్ బాయ్ హాలు లోకి తోసుకొచ్చాడు. పదినిమిషాల్లో టేబుల్ని సరిగ్గా అమర్చి, కుర్చీలువేసి బాయ్ ఆమెవంక చూశాడు.

"నువ్వు వెళ్ళొచ్చు," అందామె.

హోటల్ బాయ్ వెళ్ళిపోయాడు. ఆమె తలుపును మూసింది. టీపాయ్ మీదున్న ఖాళీగ్లాసులవంక చూసింది. అతనిని నెమ్మదిగా చేతుల్లోకి తీసుకుని కౌగలించుకుంది.

ఇద్దరూ పొడుగాటి సోఫామీద పడ్డారు. చేతుల్లో చుట్టేశాడు. బాగా తాగడం అలవాటైన అతడిమీద విస్కీ ప్రభావం యెక్కువగాలేదు.

"కమలా, యూ ఆర్ లవ్లీ," అన్నాడతను.

"తిందాం పద," అందామె.

ఇద్దరూ డైనింగ్ టేబుల్ కుర్చీలలో పక్కపక్కనే కూర్చున్నారు. టేబిలుమీదున్న పదార్థాలను చూడగనే అతడి నోరు వూరింది. ఆమె అతడి ప్లేట్లో వడ్డించింది.

"లెటస్ డైన్," అందామె నవ్వుతూ.

## 7

పొద్దుట యెనిమిదింటికి ఆమెకు మెలుకువ వచ్చింది. పరుపుమీద మోహన్ లేడు. తెల్లారుజామున అతడు తన సూట్లోంచి మెల్లిగా బయటపడి వుంటాడు.

పరుపుమీద దొర్లుతూ ఆమె మోహన్ గురించి ఆలోచించ సాగింది. చాలా హుషారయిన యువకుడు! అతడు తన కిచ్చినంత సుఖాన్ని యింతవరకూ యెవ్వరూ యివ్వలేదు. గతరాత్రి జరిగినదంతా ఆమెకు శాశ్వతంగా జ్ఞాపకముంటుంది.

గదిలోని టెలిఫోను మ్రోగింది. ఆమె రిసీవర్ని అందుకొంది.

"హలో!" అంది.

"కపిలా, నువ్వు యిప్పుడే లేస్తావనుకోలేదు," అన్నాడు మోహన్.

ఆమె సంతోషంగా నవ్వింది.

"ఎప్పుడు వెళ్ళిపోయావు?" అడిగిందామె.

"నాలుగింటికి."

"నన్ను లేపలేదే?"

"నువ్వు హాయిగా నిద్రపోతున్నావు. లేపడానికి మనసొప్పలేదు."

"మోహన్, క్రితం రాత్రి చాలా హాయిగా గడిచింది. ఈ జీవితమంతా అలా సాగితే యెంతో బాగుంటుంది!" అందామె.

"అలా సాగించడానికి మనం ప్రయత్నిస్తే జయిస్తాం" అన్నాడు మోహన్.

కాసేపు యిద్దరూ నిశ్శబ్దంగా వుండిపోయారు.

"బ్రేక్ ఫాస్టు అయిందా?"

"ఇంకా పళ్ళు తోముకోలేదు," అందామె నవ్వుతూ.

"గోల్డెన్ శాండ్స్ చూడ్డానికి యెప్పుడు వెళ్దాం?"

"అవును. మనం వెళ్ళాలి. పదింటికి నేను కారులో వస్తాను. నువ్వు యెక్కడుంటావో చెప్పు," అందామె.

"నేను నీ హోటల్ కు ఫర్లాంగు దూరంలో వున్న ఖాదీ భండార్ ముందు వుంటాను."

"ఆల్ రైట్! సరిగ్గా పదింటికి అక్కడికొస్తాను. నా కార్లో గోల్డెన్ శాండ్స్ కు వెళదాం" అందామె.

"ఆల్ రైట్, బై బై" అని అతను రిసీవర్ పెట్టేశాడు.

రిసీవర్ పెట్టేసి ఆమె టైమ్ చూసింది. వేగంగా

పక్కనున్న బాత్‌రూమ్‌లోకి పరుగెత్తింది....

పదింటికి కారులో బయలుదేరింది.

మెర్సిడిస్ కారొచ్చి అతడిపక్కనే ఆగింది. తలుపు తెరుచుకుని అతడు ముందు సీటుమీద కూర్చున్నాడు. ఆమె కారును పోనిచ్చింది. స్వయంగా ఆమె కారు నడుపుకుంటూ వచ్చినందుకు అతను సంతోషించాడు.

“మోహన్, ఎలా వెళ్ళాలో నువ్వే చెప్పాలి,” అందామె.

“కారును మౌంట్‌రోడ్డుకు ముందట పోనీ. అక్కడ నుంచి యెలా వెళ్ళాలో చెప్తాను.”

ఆమె హుషారుగా కారుని పోనిస్తోంది. ఆమె నడిపే విధానాన్నిబట్టి కారు డ్రయివింగ్‌లో ఆమె ఆరితేరినదని అతడు గ్రహించాడు. కారు సైదాపేటవైపు దూసుకుపోతోంది. ఆమె అతడిచెయ్యిని పట్టుకుంది.

“మోహన్, ఐ లవ్ యు! నీకోసం ఏదైనా చేస్తాను” అందామె.

అతడామెవైపు దీనంగా చూశాడు.

“నాదగ్గర డబ్బుంటే అదంతా నీ కిచ్చేసేవాడిని,” అన్నాడతను.

“నాకు కావలసింది డబ్బుకాదు, ప్రేమించే హృదయం!”

“అది ఎప్పుడో నీదయిపోయింది.”

మెర్సిడిస్ కారు శరవేగంగా వెళ్తోంది. రోడ్డుమీద జనసంచారం లేదు. ఒక చింతచెట్టు కింద ఆమె కారును ఆపింది. అతడిని కౌగిలించుకొని ముద్దెట్టుకొంది. దూరం నుంచి కారుహారన్ వినపడింది. మళ్ళా ఆమె కారును పోనిచ్చింది.

గోల్డెన్ శాండ్స్! కారులోంచి యిద్దరూ దిగారు. ఆమె నలువైపులా చూసింది. ఎక్కడ చూసినా పొదలు! దూరంలో సరుగుడు చెట్లు. పొదల మధ్యనుంచి ఆమె ముందుకు నడిచింది. కొంచెం దూరంనుంచి సముద్రపు హోరు వినిపిస్తోంది. ఆమె అటువైపు నడిచింది. ఇసుకలో నడుస్తూ సముద్రపు ఒడ్డుకు చేరుకొంది.

అక్కడ నిలబడి పరీక్షగా చూసింది. ఇరోషన్! సముద్రం భూమిని తిని ఆక్రమించుకుంటోంది. గోల్డెన్ శాండ్స్ ప్రదేశంలోకి సముద్రపు నీరు కొన్ని సమయాల్లో జొరపడొచ్చు.

ఆమె అతడివైపు తిరిగింది.

"మీ బాస్ యీ స్థలాన్ని కొన్నాడా?"

"ఎప్పుడో కొనేశాడు."

ఆమె మౌనంగా కారువైపు నడిచింది. స్టీరింగ్ వెనక కూర్చుంది. అతడు పక్కనే కూర్చుని తలుపుమూశాడు. ఆమె కారును పోనిచ్చింది.

రోడ్డమ్మట కారు కదుల్తోంది. ఆమె ఓరగా అతడి వంక చూసింది. "మోహన్, యీ కంపెనీలో నువ్వెంత కాలంనుంచి పని చేస్తున్నావు?"

"రెండు నెలలనుంచి."

"పదిలక్షల విలువగల షేర్లు అమ్మితే మీకేమి టొస్తుంది?"

"వెయ్యి జీతంతో నాకు ఉద్యోగం వుంటుంది. యాభైవేలు నాకు కమీషన్ కంపెనీ యిస్తుంది."

"ఈ ప్లాన్ ఫలించదు. ఇక్కడ కాటేజస్ నిర్మించడం మూర్ఖత్వం. సముద్రం ముందుకొచ్చి గోల్డెన్ శాండ్స్ అంతా జలమయం కావచ్చు. మీ బాస్ యీ

ప్రదేశాన్ని చూపించి ప్రజల్ని మోసం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. నువ్వీ వుద్యోగం వదిలేయి. నేను మరో ఉద్యోగం యిప్పిస్తాను," అందామె.

"చూద్దాం," అన్నాడతను.

"మీ బాస్ పేరు?"

"పీటర్స్."

"అతడు ఎక్కడుంటున్నాడు?

"నువ్వున్న సీవ్యూ హోటల్లోనే."

"ఎలా వుంటాడతను?"

"పొట్టిగా, నల్లగా, లావుగావుంటాడు. బాల్డ్ హెడ్."

"హోటల్ డైనింగ్ హాల్లో అతడిని చూశాను. అతడిని గురించి పూర్తి సమాచారం నేను కనుక్కుంటాను," అందామె.

ఖాదీబండార్ ప్రాంతంలో ఆమె కారును ఆపింది. అతను దిగాడు. ఆమె అతడివంక నవ్వుతూ చూసింది.

"నాకు ఫోన్ చెయ్యి. మళ్ళా కలుసుకుందాం," అందామె.

మెర్సిడిస్ కారు పోయాక అతడు తన ఫియట్ కారు వైపు నడిచాడు. ఆమెలో అంతమార్పు ఎలా వచ్చింది? ఆమె తనను అనుమానిస్తోందా? తన్నింత సులువుగా వదిలి ఆమె ఎందుకెళ్ళిపోయింది?

మోహన్ తన ఫియట్ కారువైపు నడిచాడు. ఆలోచిస్తూ కారులో కూర్చుని తలుపు మూశాడు. తన కోర్కె తీరాక ఆమె తనని వదిలేయడానికి ప్రయత్నిస్తోందా?

## 8

పీటర్స్ అతడివంక సీరియస్‌గా చూశాడు.

"సిడ్జాన్! నిన్నరాత్రి నువ్వామె గదిలో పడు

కొన్నావు! ఆమె పూర్తిగా నీ బానిసైందా?"

"మేం చేసేదంతా స్పయ్‌లా చూస్తున్నారా?"

"అది ప్రస్తుతం అనవసరం. ఆమె డబ్బు పెడ్తోందా?"

మోహన్ సిగరెట్ వెలిగించాడు.

"పెడ్తుందని ఆశించాను. కాని చివరకి మన ప్లాన్ బోల్తా కొట్టింది. గోల్డెన్ శాండ్స్ ప్రాజక్ట్ ఫలించదని ఆమె అంటోంది. ఆమె నాతో వచ్చి ఆ స్థలాన్ని చూసింది.... ప్రజలను మీరు మోసం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారని అందామె. మీగురించి అంతా కనుక్కుంటానంది."

పీటర్స్ గాభరాగా కుర్చీలోంచి లేచాడు.

"యూ ఫూల్! ఆమె నాగురించి కనుక్కోడం మన కంపెనీకి మంచిది కాదు!" అని పీటర్స్ ఆలోచిస్తూ అతడి వంక చూశాడు.

"గతరాత్రి జరిగినదంతా చెప్పు!"

మోహన్ చెప్పాడు. పీటర్స్ మౌనంగా విన్నాడు. తను ఏదో చెయ్యాలి. మిసెస్ బెనర్జీ ధనవంతురాలు. ఆమె ఏమైనా చెయ్యగలదు. పీటర్స్ సూటిగా అతడివంక చూశాడు.

"మోహన్, త్వరలో ఆమె నిన్ను మర్చిపోతుంది. అన్నం తినేసిన విస్తరిలా నిన్ను రోడ్డు పక్కన పారేస్తుంది. ఒక విధంగా వెళ్తే మనకామె డబ్బునిస్తుంది. అది మనం పంచుకుని పారిపోవచ్చు!"

"ఏం చేద్దాం?"

"నిన్ను ఎత్తుకుపోయి ఒకచోట దాచేస్తాను. ఐదు లక్షలిస్తే నిన్ను వదిలేస్తానని చెప్తాను. ఆమె కోర్కె యింకా పూర్తిగా తీరలేదు. ఈ సమయంలో నీకోసం

ఆమె డబ్బు యిస్తుంది. అది యిద్దరం పంచుకుందాం. వెంటనే యీ పట్నం విడిచి పోదాం!"

"గుడ్ ఐడియా!" అన్నాడు మోహన్.

మోహన్‌కి వుద్యోగమంటే పరమ అసహ్యం. జీవితం హాయిగా సాగాలి, శ్రమపడకుండా!

"నేను ఆలోచించి ప్లాన్ తయారుచేస్తాను. అలా చేద్దాం" అన్నాడు పీటర్స్.

"ఆల్ రైట్! కాని ఆమెకు ప్రమాదం రాకూడదు."

"ఎవ్వరికీ ప్రమాదం రాదు" అన్నాడు పీటర్స్.

## 9

ఆతడి ఒళ్ళో తల పెట్టుకుని ఆమె అతడివంక చూస్తోంది. మోహన్ విస్కీ తాగుతున్నాడు.

"మోహన్, పీటర్స్‌గురించి తెల్సుకున్నాను. రెండేళ్ళ క్రితం డిగ్ వెల్స్ అని అతడో కంపెనీ పెట్టాడు. పల్లె ప్రజల నుంచి యిరవై వేలు వసూలు చేసి మాయమయ్యాడు. ఆరు నెలలు జైల్లో వుండి యీ మధ్యనే విడుదలయ్యాడు. ఇప్పుడు పెద్ద పెట్టున ప్రజలను మోసగించడానికి ప్రయత్నిస్తున్నాడు" అందామె.

అతడు ఆశ్చర్యపోయాడు.

"ఇదంతా నీకెలా తెలిసింది?"

"మాకో సబ్సిడరీ యిన్వెస్టిగేటింగ్ కంపెనీ వుంది. ఎవర్ని గురించైనా వాళ్ళు కొన్ని గంటల్లో తెల్సుకో గలరు" అందామె.

"నా గురించికూడా తెల్సుకొన్నావా?"

"నేను తెల్సుకుంటున్నానుగా, స్వయంగా" అని ఆమె లేచి అతడిని ముద్దెట్టుకొంది.

మోహన్ ఆమెవైపు ప్రేమతో చూశాడు.

"నేనా కంపెనీలో వుద్యోగం మానేశాను" అన్నాడతను.

"గుడ్ వర్క్" అందామె.

డిన్నర్ ముగించి, యిద్దరూ పడగదిలోని డబుల్ కాట్ మీద పడుకున్నారు. డిమ్ గ్రీన్ లైట్ వెలుగుతోంది.

"మోహన్, నువ్వెప్పుడూ నాతోనే వుండాలి" అందామె.

"నిన్ను వదిలి నేను వుండలేను" అన్నాడు మోహన్.

"మనం రిజిస్టర్ మేరేజి చేసుకుందాం" అందామె.

మోహన్ షాక్ తిన్నాడు. మాట్లాడలేదు. ఆమె చెయ్యిని మెల్లిగా నిమిరాడు.

అంతలో ఏదో అలికిడైంది.

డిమ్ లైట్ కాంతిల్లో దయ్యాల్లా కనిపిస్తూన్న ముగ్గురు వ్యక్తులవైపు ఆమె గాభరాగా చూసింది. ముగ్గురూ మాస్కులు ధరించారు.

"మేడామ్, నువ్వు కదిలితే ప్రమాదం!" అరిచాడు ఒకతను.

మోహన్ని బంధించి వాళ్ళు అతడిని లాక్కుపోయారు. కాస్సేపట్లో ముందు తలుపు క్లిక్మంది.

ఆమె హాల్లోకి పరుగెత్తింది. తలుపు తెర్చి నడవ పొడుగునా చూసింది. నడవలో ఎవ్వరూ లేరు. వాళ్ళు లిఫ్ట్లో కిందకు వెళ్ళారేమో!

తలుపుమూసి ఆమె సోఫాలో కూర్చుండిపోయింది. వాళ్ళు లాక్కుపోతుంటే మోహన్ తనవైపు విసిరిన గాభరాచూపు ఆమెకు గుర్తుకొచ్చింది. వాళ్ళు మోహన్ని ఎందుకు ఎత్తుకుపోయారు? అతడిని వాళ్ళు ఏం చేస్తారు?

ఆమె టైమ్ చూసింది. ఒంటిగంట దాటింది. తనిప్పుడు

ఏమీ చెయ్యలేదు. తెల్లారాక మోహన్ని కాపాడ్డంకోసం తను ప్రయత్నించాలి!

టైమ్ రెండు దాటింది. నిద్రబట్టక ఆమె పరుపుమీద యిటూ, అటూ దొర్లుతోంది. టెలిఫోన్ మ్రోగింది.

ఆమె రిసీవర్ని ఎత్తింది.

"హలో!" అందామె.

"మిసెస్ బెనర్జీ, మోహన్ మా దగ్గర క్షేమంగా వున్నాడు. అతడి కంఠం వింటావా?" అని ప్రశ్నించాడతను.

"వింటాను!" అందామె.

అటువైపు నుంచి మోహన్ అరుపులు వినపడ్డాయి.

"కమలా, వీళ్ళు నన్ను చిత్రవధ చేస్తున్నారు! ప్లీజ్ నన్ను రక్షించు" అని అతను ఏడ్వసాగాడు.

"మిసెస్ బెనర్జీ, విన్నావా?" అంది అటువైపు కంఠం.

"మిస్టర్ నీకేం కావాలి?" అడిగిందామె.

"ఇతడు నీ ప్రియుడని నాకు తెలుసు. అతడు నీకు కావాలంటే ఐదు లక్షలు మాకు చెల్లించాలి. అప్పుడు అతడిని వదిలేస్తాం."

ఆమె క్షణకాలం ఆలోచించింది.

"అంత డబ్బు యివ్వడానికి నాకు టైమ్ కావాలి."

"కొన్ని గంటల్లో తెల్లారుతుంది. సాయంత్రం ఏడు లోపల నాకు డబ్బు కావాలి."

"మిస్టర్, అలాగే యిస్తాను. అతనికి ఏ ప్రమాదమూ రాకూండా చూడు. అతడిని హింసించకు!"

"మిసెస్ బెనర్జీ, ఏ రూపంలో ఇతన్ని మీ గదిలోంచి తీసుకుపోయామో, అదే రూపంలో అతడిని వదిలేస్తాం."

"నేను డబ్బు ఎలా యివ్వాలి?"

"రేపు ఫోన్ చేసి చెప్తాను. పోలీస్ రిపోర్టిస్తే ఇతని ప్రాణానికి ప్రమాదం!" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

ఆమె రిసీవర్ని పెట్టేసి కాస్సేపు ఆలోచించింది. పాంట్, స్లాక్ వేసుకొంది. తలమీద కాప్ పెట్టుకుని, బాగ్ లో వున్న పిస్టల్ని పాంట్ జేబులో దాచుకుని బయటకు నడిచింది. తలుపు మూసింది. ఏర్ లాక్ క్లిక్ మంది.

ఆమె నడవమ్మట నడిచింది. నడవ లైట్లు డిమ్ గా వెలుగుతున్నాయి. నడవ మధ్యలో మేడమెట్లు వున్నాయి. మెట్లకు యిటువైపున లిఫ్ట్ వుంది. రాత్రిళ్ళు పన్నెండు తర్వాత లిఫ్ట్ వుండదు. అందరూ మెట్లమ్మట పైకి వెళ్ళవలసిందే!

వాళ్ళు వెళ్ళగానే తను బైటకెళ్ళి చూసింది. లిఫ్ట్ లో వాళ్ళు వెళ్ళుండరు. మెట్లవైపు వెళ్ళుంటే వాళ్ళు ఆమెకు కనిపించి వుండేవారు. వాళ్ళు ఏమయ్యారు? సమీపంలో వున్న ఏ గదిలోకయినా వెళ్ళారా?

ఆలోచిస్తూ ఆమె మెట్లమ్మట కిందకు దిగింది. కింద నున్న హాలులోకి ప్రవేశించింది. హాలులో ఎవ్వరూ లేరు. రిసెప్షన్ వెనక ఒక యువకుడు మాత్రం కునికిపాట్లుపడ్తూ కూర్చున్నాడు. ఆమెను చూసి అతను వులిక్కిపడుతూ లేచాడు.

"ఐయామ్ మిసెస్ బెనర్జీ," అంది.

"మేడమ్, ఏంకావాలో చెప్పండి."

"పీటర్స్ ఏ గదిలో వుంటాడు?"

"సాయంత్రం ఆయన గది ఖాళీచేసి వెళ్ళిపోయాడు"

"ఆయన వెళ్ళాక యీ హోటల్లో ఎవరెవరు గదులు తీసుకున్నారు?"

అతడు బుక్ చూసి ఆవిడవంక తిరిగాడు.

"ఇద్దరు తీసుకున్నారు మేడమ్."

"వాళ్ళను వర్ణించగలవా?"

"ఒక విదేశి స్త్రీ, ఆమెకూతురు గది తీసుకున్నారు. పొట్టిగా, లావుగావున్న గడ్డంవ్యక్తి గది తీసుకున్నాడు."

"వాళ్ళు ఏ గదుల్లో వున్నారు?"

"అతడు నంబర్ 82లో వున్నాడు. ఆవిడ 22నంబరు గదిలో వుంది."

ఆమె తీవ్రంగా ఆలోచించింది. అతడివంక నవ్వుతూ చూసింది. జేబులోంచి యాభై రూపాయలనోటు తీసి పట్టుకుంది.

"గడ్డంవ్యక్తి గదిలో నిద్రపోతూంటాడు," అంది.

అతడు తలాడించాడు.

"అతడి గదికి మరో కీ మీ దగ్గరుంటుందిగా?"

"అది ఎవ్వరికీ యివ్వకూడదు."

చేతిలోని నోటును ఆమె కౌంటరుమీద పెట్టింది.

"నీకు ప్రమాదం లేకుండా నేను ఆ గదిలోకి వెళ్ళి వస్తాను. ఈ డబ్బు నీది" అంది.

అతడు నోటును దాచుకున్నాడు.

"చప్పుడయితే అతడు లేవచ్చు" అన్నాడు గుమస్తా.

"చప్పుడు చెయ్యను" అంది.

అతనిచ్చిన తాళంచెవిని తీసుకొని మెట్లమ్మట పైకి వెళ్ళింది. తన సూట్ సమీపంలో వుంది రూమ్ నెంబరు 82. గదిముందు నడవలో నిలబడి యిరువేపులా చూసింది.

తాళం చెవిని తిప్పి, తలుపును తోసుకుని మెల్లిగా లోపలకు వెళ్ళింది.

గదిలో లైట్ డిమ్‌గా వెలుగుతోంది. ఎదురుగావున్న బెడ్ వైపు చూసింది. ఎవరో గాఢనిద్రలో వున్నారు. అటువైపుకు తిరిగి నిద్రపోతున్నాడు.

ఆవిడ మెల్లగా మంచం దగ్గరకు నడిచింది. చడీ చప్పుడు లేకుండా అటువైపుకువెళ్ళి నిద్రపోతున్న వ్యక్తి వైపు చూసింది.

ఆవిడ వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. మెల్లిగా తలుపు లాగింది. ఏర్ లాక్ క్లిక్కుమంది. రిసెప్షన్ గుమస్తాకు తాళంచెవిని యిచ్చేసి, ఆమె తన సూట్‌కు గబగబా నడిచి వెళ్ళిపోయింది.

# 10

మధ్యాహ్నం రెండింటికి టెలిఫోన్ మ్రోగింది. ఆమె రిసీవర్ని అందుకొంది.

"హలో, మిసెస్ జెనర్జీ." అంది.

"డబ్బు రెడీగా వుందా?"

"ఉంది."

"పోలీసు రిపోర్టు యివ్వలేదుగా?"

"పోలీసు సహాయంకోసే ఆలవాటు నాకులేదు."

"గుడ్! చీకటిపడ్డాక యేడింటికి సీవ్యూ హోటల్ పైడాబా మీదకు వెళ్ళు. అక్కడ యెవ్వరూ వుండరు. డబ్బున్న బాగ్‌ను ఓవర్ హెడ్ టాంకు మూతపైన పెట్టి వెళ్ళిపో. మోహన్ గంటలో నీ గదికొస్తాడు."

"అలాగే."

"నన్ను మోసంచేస్తే మోహన్ చస్తాడు."

"ప్లీజ్ మోహన్ని చంపొద్దు," అంది.

"నేను చెప్పింది చేస్తే అతను చావడు," అని అటు వైపు వ్యక్తి రిసీవర్ని పెట్టేశాడు.

ఆమె షేర్రాజుకు ఫోన్ చేసింది.

"హలో," అన్నాడతను.

"షేర్రాజుగారూ, మిసెస్ బెనర్జీ! నాకు నలుగురు గూండాలు అర్జంటుగా కావాలి. నలుగురూ సూట్లలో పెద్దమనుషుల్లా వుండాలి. వాళ్ళను ఆరింటికి నా సూట్ కి పంపండి."

"అలాగే పంపుతానమ్మా" అన్నాడు షేర్రాజు.

ఆమె రిసీవర్ని పెట్టేసింది.

టైమ్ ఆరు కావస్తోంది. మిసెస్ బెనర్జీ గ్లాసులో విస్కీ పోసుకుని సోడా కలుపుకుని తాగేసింది. ఎవరో తలుపును తట్టారు. ఆమె వెళ్ళి తలుపు తెరిచింది. నలుగురు వ్యక్తులు లోపలకు వచ్చారు. ఆమెకు నమస్కరించారు.

"ఆ సోఫాలలో కూర్చోండి. ఏం చెయ్యాలో తరువాత చెప్తాను" అంది.

"అలాగేనమ్మా," అన్నారు వాళ్ళు.

ఆమె పడగదిలోకి వెళ్ళిపోయింది.

సరిగా ఏడింటికి ఆమె బాగ్ పట్టుకొని గదిలోంచి బయటకు నడిచింది. పదినిమిషాలలో తిరిగి తన గదికి వచ్చింది.

సోఫాల్లో కూర్చున్న గూండాలకు ఆమె సౌంజ్ఞ చేసింది. ఆమె వెనకనే వాళ్ళు కదిలారు. రూం నంబరు 82 ముందు ఆగింది. తలుపు దగ్గరగా మూసివుంది. తలుపు తోసి ఆమె లోపలకు వెళ్ళింది.

సోఫాలో కూర్చుని విస్కీ సేవిస్తున్న మోహన్ ఆమెను చూసి వులిక్కిపడ్డాడు. అతడికెదురుగా సోఫాలో

కూర్చుందామె.

"మోహన్, అతడికి డబ్బిచ్చేశాను. సువ్విక్కడున్నావని నాతో చెప్పి అతడు వెళ్ళిపోయాడు." అబద్ధమాడిందామె.

మోహన్ నోటమ్మట మాట పెగల్లేదు.

"నిన్ను తీసుకెళ్ళడానికి వచ్చాను," అంది.

తలుపుమూసి అక్కడ నిలబడిన నలుగురివైపు చూశాడతను.

"వాళ్ళెవరు?"

"నా మనుషులే!"

"ఆ మోసగాడికి డబ్బెందుకిచ్చావు?"

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"అందులో సగం నీ కొస్తుందనే నమ్మకంతో."

బయట బూట్ల చప్పుడైంది. నలుగురు గూండాలతో ఆమె బాత్ రూమ్‌లోకి దూరింది. తలుపును కొద్దిగా తెర్చి వుంచింది.

పొట్టిగా లావుగావున్న గడ్డం వ్యక్తి కోపంగా లోపలకొచ్చాడు. "మోహన్, ఆమె నాతో అబద్ధం చెప్పింది. ఏడు గంటలకు బాగ్ పట్టుకొని నా గదిముందునుంచి వెళ్ళడంచూసి డబ్బు పట్టుకెళుతోందని అనుకున్నాను. పైకెళ్ళి చూస్తే బాగ్ లేదు. మన ప్లాన్ మిస్ ఫైర్ అయింది. నేను నీకిచ్చినదంతా వేస్టెడ్" అర్చాడతను.

ఆమె గదిలోకొచ్చింది. వెనకనే గూండాలు నిలబడ్డారు.

"మిస్టర్ పీటర్స్, నువ్వు దగాకోరువని నాకు తెలుసు. నువ్వు, మోహన్ కలిసి నన్ను చీట్ చెయ్యాలనుకొన్నారు. ఇన్ని కంపెనీలను నడిపే మిసెస్ బెనర్జీని

మోసం చెయ్యడం అంత సులువయిన పనికాదు" అంది వ్యంగ్యంగా.

పీటర్స్, మోహన్ మౌనంగా వుండిపోయారు.

"మిస్టర్ పీటర్స్, పోలీసు రిపోర్టివ్వనని నీతో అన్నాను. కాని మీలాంటివాళ్ళని శిక్షించాలి!" అని గూండాలవైపు చూసింది.

ధీమాగా గుమ్మంవైపు నడిచింది. వెనుదిరిగి మళ్ళా గూండాలవైపు చూసింది.

"వాళ్ళిద్దర్నీ బాగా చితక్కొట్టండి. అరవకుండా జాగ్రత్త పడండి. మీరు చెయ్యవలసిన పని అంతే. పని పూర్తయ్యాక మీరు వెళ్ళిపోవచ్చు!" అని ఆమె తలుపును తెర్చింది.

"కమలా, నన్ను కొట్టించకు ప్లీజ్!" అర్చాడు మోహన్.

"షటప్ రాస్కెల్!" అని ఆమె బయటికెళ్ళి తలుపును గట్టిగా మూసింది.

ఏర్‌లాక్ క్లిక్ మంది.

—:ఐపోయింది:—

# పొగమంచు

సీరియల్



ముద్దా సురేష్

# (రెండవ భాగము)

రెండుగోడల అంచులు, పొడుచుకువచ్చిన శిలలతోనూ, చెట్లవేళ్ళతోను నిండుకుని వున్నాయి.

అవతలివైపు గోడను చేరుకోవటం,

అదీ—అతిత్వరగా—చేరుకోవడం మాత్రమే సమస్య.

ఏదో ఆలోచన వచ్చి, అతనిని ఎవరో ఛెళ్ళున కొరడాతో కొట్టినట్లయింది.

రెండుగోడలుగా చీలిపోయిన భూమి మళ్ళీ దగ్గరకి అతుక్కుపోతే!?

అడకత్తెరలో పోకచెక్కలా....

తల విదిలించాడు రాణా.

త్వరగా ఏదో చేయాలి!

పగులులో చిక్కుకుపోయిన తన కారు మాత్రమే అవతలివైపు వెళ్ళడానికి బ్రిడ్జిలా సహాయపడగలదు.

ఒకటి.... రెండు.... గెంతులు....అంతే!

తను అవతలివైపు వుంటాడు.

ఆ ప్రయత్నం చాలా ప్రమాదకరమైనది....

కాని మరో మార్గమేదీ?

దడదడలాడే గుండెలతో, నెమ్మదిగా కారు పైకప్పు మీద అడుగుమోపాడు రాణా.

ఇట్సాల్ రైట్.

అది కదలడంలేదు.

తన బరువునంతా కారు పైభాగంమీద మోపాడు రాణా యింకా—అదే గోడనుపట్టుకు వేలాడుతూ.

సున్నితమైన కారు టాప్ మీద తన కాలు జారితే!??

అతని వెన్నెముకలోంచి చలి పుట్టుకొచ్చింది. మొండి ధైర్యంతో, రాణా. అవతలి గోడను వదిలిపెట్టి, కారు

టాప్ మీంచి ఘొంగున అవతలికి గెంతాడు. అంతే!

అప్పటిదాకా గోడను ఆనుకునివున్న కారు, పట్టుసడలి క్రిందికి కూలిపోసాగింది, రాణాని వెంట తీసుకుపోతూ!!

క్రిందికి జారిపోతూ, గాభరాగా, అవతలి గోడను చేతులతో తడిమాడు రాణా.

అదృష్టవశాత్తు అతని చేతికి బలమైన వేరు తగిలింది.

ఆ వేరుకు వేలబడుతుండగా కారు దడదడా శబ్దం చేస్తూ అగాధంలో కూలిపోయింది.

రాణా చెమటతో తడిసి ముద్దయ్యాడు.

కారు కూలిపోతున్న శబ్దానికి ఉలికిపడి పసిపాప క్రిందికి చూసింది.

అంతే! వ్రేలాడుతున్న రాణాని చూసి—భయంగా కేకలు పెట్టసాగింది....

ఆమెకాళ్ళకి తగిలిన మట్టిపెళ్ళలు చెదిరిపోయి కెర టాల్లా క్రిందికి దొర్లసాగాయి.

"భయ్యా....భయ్యా...."

ఆమె వికృతంగా ఏడ్వసాగింది.

నిరాధారంగా వ్రేలాడుతున్న తన కాళ్ళకి గోడలో వున్న ఓ గట్టిరాయి తగలడంతో నిట్టూర్పు విడిచాడు రాణా, బరువును దానిపై మోపుతూ.

దుమ్ముతో కలుషితమైన గాలిని ఊపిరితిత్తుల్లోకి నింపు కుంటూ పాపవైపు చూసాడతను.

"బేబీ!" అరిచాడు రాణా "ఘబ్రావ్ మత్. అలాగే పట్టుకుని వుండు. నీ దగ్గిరకి వస్తున్నాను."

తన మాటలు ఆమె వినిపించుకుందో, లేదో అతనికి తెలీదు. ఆమె ఎంతోసేపు అలా చావుకీ, బ్రతుక్కీ మధ్య వ్రేలాడలేదన్న విషయం మాత్రం తెల్సు రాణాకి.

అతను చేతులతో ఆధారంకోసం తడుముకుంటూ, ఏటవాలుగా, గతుకులుగా చీలివున్న ఆ గోడపైకి మెల్లగా ప్రాకసాగాడు.

ఆమెకు ఎనిమది అడుగుల దూరంలో వుండగా, రాణాకి గట్టి రాతినేల తగిలింది కాళ్ళకి ఆధారంగా.

బహుశా, ఉపరితలం నుండి సహాయం రావచ్చు. చీలికలో చిక్కుకుపోయిన వారిని రక్షించడం కోసం ఎవరో ఒకరు ప్రయత్నించక మానరు.

పసిపాపను చేరుకునే మార్గంకోసం ఆతురతగా వెతికాడు రాణా.

ఆమె నిలబడ్డ మట్టిపొరకు నాలుగడుగుల క్రిందుగా, గోడలో సన్నని లోతైన చీలిక క్రిందకంటూ వుంది.

రాణా, పాదాల్ని బలంగా ఆ చీలికలో గుచ్చుతూ అటూ ఇటూ వున్న రాళ్ళను చేత్తో పట్టుకుంటూ పాప నిలబడ్డ చోటుకు చేరసాగాడు.

పాప, తలదించి అతనికేసి బెదిరిపోతూ గాభరాగా చూసింది....

దుమ్ముకొట్టుకుపోయిన తన ముఖాన్ని చూసి ఆమె భయపడ్తోందనుకున్నాడు రాణా.

"బేబీ! ఇంకేం ఫర్వాలేదు. కదలొద్దు. నిన్ను జాగ్రత్తగా బైటికి చేరుస్తాను. ఓ.కే.? కదలకు!"

ఆమె బిత్తరపోతూ అతని ఆకారాన్ని చూస్తూ కాళ్లు విదిలించసాగింది కదిలే ప్రయత్నంలో.

"కదలక!" అర్చాడు కోపంగా.

అంతే! ఏడుస్తున్న ఆమె చేతిపట్టు సడలింది.

కెవ్వున అరుస్తూ గాలిలో జారిపోతున్న ఆమె, గౌనుని ఒక చేత్తో పట్టుకున్నాడు రాణా.

తటాలున ఆమెని భుజంమీదకి లాక్కున్నాడు. ఆ హఠాత్పరిణామానికి జడిసిపోయిన పాప వికృతంగా ఏడ్వసాగింది....

రాణా అలాగే నిలబడిపోయి, ఆమెను ఓదార్చసాగాడు.

రెండు నిమిషాల తర్వాత పాప ఏడుపు తగ్గింది.

రాణా సూచన పాటిస్తూ ఆ పాప అతని మెడచుట్టూ చేతులు వేసి, నడుంచుట్టూ కాళ్లు పెనవేసి అతన్ని అల్లుకుపోయింది.

"వెరీగుడ్, కొన్ని నిముషాల్లో చూడు నిన్ను యెలా పైకి చేరుస్తానో" అన్నాడు రాణా, తనకులేని ధైర్యాన్ని ఆమెకి యిస్తూ.

రాణాకి అకస్మాత్తుగా మెదడులో శూన్యం ప్రవేశించింది. అలసట తగ్గి ఓపిక తిరిగి ప్రవేశించినట్లయింది. ఊపిరి సాధారణ స్థాయిలోకి వచ్చింది.

వీపుమీద పాప రోదన సన్నగా వినబడుతోంది.

రాణా పైకి చూశాడు సూర్యకాంతి వైపు....చావగా మిగిలివున్న వాళ్ళని రక్షించడానికి యింకా యెవరూ ముందుకు రాలేదు.

తను చావుని తప్పించుకున్నాడు.

దేనినుండి??

దాని నేమనాలి?

ఆ ప్రశ్న రాణా మెదడులో సమ్మెటదెబ్బలా తగలసాగింది....

యాక్సిడెంటా?

భూకంపమా?

భారతదేశంలో భూకంపాలు చాలా తక్కువ.

భూకంపాలు ఏర్పడినా, అవి చాల తక్కువ సేపు....

దీన్ని యేమనాలి?

భూమి యిలా రెండు చెక్కలుగా విడిపోడాన్ని....

ఇలాంటిది ఏ దేశంలోనయినా జరిగిందా?

ఇంపాసిబుల్!

అసహజం!

నమ్మరానిది!!

కాని.... కాని.... తన కళ్లెదురుగా జరిగింది.

ఎందుచేత?

ఈ మారుమూల ప్రదేశంలో నే యెందుకు జరగాలి? ఖుల్నా ప్రాంతంలో జరుగుతున్న మిలటరీ ప్రయోగాలు దీనికి కారణమా?

వాళ్ళు భూగర్భంలో బాంబులు ప్రయోగాలు చేయడము వల్ల....యిలా జరిగిందా?

కాని ఆ ఆలోచన అసహజంగా తోచింది రాణాకు. ప్రజలు మసిలే ప్రాంతాలలో బాంబు ప్రయోగాలు యెందుకు జరుపుతారు?

మానవ సంచారంలేని—ఎడారి ప్రాంతం బోలెడంత ఉండగా.

అయినా అనుమానం పోలేదు రాణాకు .... సరిగ్గా అప్పుడే....

కాళ్ళదగ్గర యేదో కదలికను గ్రహించాడు రాణా.

మొదట అది క్రిందకు రాలుతున్న దుమ్మూ ధూళి అనుకున్నాడు. కాని అది అగాధంలోంచి పైకి వస్తున్నట్లు గ్రహించాడు.

గింగిరాలు తిరుగుతూ పొగ పైకి వస్తోంది.... మేఘంలా వున్న ఆ పొగ కొంచెం పసుపుఛాయలో వున్నట్లుంది.

కాని క్రింద చీకటివల్ల రాణాకు నిర్ధారణ కాలేదు

మెల్లగా, గెట్టింపవుతున్న, ఆ విచిత్రమైన మేఘం....

క్రమంగా.... ఆ అగాధమంతటినీ కమ్ముకోసాగింది....

అతని ఛాతీని ముసురుతూ, ఆ విచిత్ర మేఘం పసిపాప ను తిమ్మించి పైకి కదలసాగింది.

భూగర్భంలో పొగ యేమిటి?

పాప అకస్మాత్తుగా దగ్గసాగింది.

ఆమె తలయెత్తి, పొగకేసి విచిత్రంగా చూసింది.... పాపను మెల్లగా పైకెత్తాడు రాణా, తన తలకు సమానస్థాయిలో.

అప్పటికి ఆ పొగమంచు అతని ముక్కు పుటాల్ని సోకింది.... ఆదోరకం వాసన వేస్తోంది ఆ పొగ.

అతను గోడ బొరియలోంచే వంగిచూశాడు దానివైపు

ఏమిటది?

పొగ యెలా వచ్చింది?

గాస్ అనుకోవాలా?

కాదేమో. గాస్‌కి సాధారణంగా రంగు వుండదు.

కాని అది మేఘంలా దట్టంగావుంది. దానికో ఆకారము ఉంది....

పసుపురంగుగా వుంది.... వాసన కొంచెమే అయినా పదునయిన వాసన.

అయోమయంగా ఆలోచిస్తోన్నాడు రాణా.

అండర్ గ్రౌండ్ విడిపోవడంవల్ల ట్రాప్ అయిన ఆకి పదార్థమేదో బయటపడి వుండాలి. ఇప్పుడు దారి ఏర్పడ్డ చేత, అది బయటికి ప్రయాణిస్తూ వుండాలి.

ఆ మేఘం అతని తలమీద ఉంటున్నాడు. దానిగుండ బయటికి చూడ్డం కష్టంగావుంది రాణాకి.

ఏదో అనుమానంవచ్చి కంపించిపోయాడు రాణా.

ఇంతకుముందు జరిగిన దారుణంకంటె ఈ పాగమంచు మరీ ప్రమాదకరమైనదేమో?

"రక్షించండి."

"కోయీ హై ఉధర్?"

"ఎవరక్కడ?"

రాణా పొలికేక. ఆ అగాధంలో ప్రతిధ్వనించింది అవహేళనగా.

....ప్చ్....జవాబులేదు.

"పాపా! మనం పైకి వెళ్తున్నాం. నన్ను గట్టిగా పట్టుకో...." అన్నాడు రాణా నిర్ధారణగా.

"నాకు.... నాకు.... భయ్యా కావాలి.... బాలూ...."

"నాకు తెలుసమ్మా. కానీ మమ్మీ, డాడీ నీకోసం బయట ఎదురు చూస్తూ వుంటారు. నామాట వినాలి మరి...."

తల్లిదండ్రులు జ్ఞాపకం రాగానే ఆమె, కన్నీళ్ళతో అతని భుజంమీద ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్వ సాగింది.

ఆమెను ఓదార్చుతూ హెచ్చరికచేసి మెల్లగా పైకి కదిలాడు రాణా.

వీపుమీద కొత్తగా ఏర్పడ్డ బరువుతో,

రాణా భయం భయంగా పైకి పాకుతుండగా పసుపు రంగుపొగ, అతని ముఖాన్ని పూర్తిగా కమ్మేసి, గింగుర్లు తిరుగుతూ, నెమ్మదిగా వున్న ఉపరితలంవైపు ప్రయాణించ సాగింది........

❀ ❀ ❀

"రక్షించండి!"

అన్న రాణా పొలికేక పైన వున్న కొంతమందికి విన బడింది....ఆ భయంకరమైన అగాధంలో కూలిపోయిన వాళ్ళెవరూ బ్రతికి బైటపడే అవకాశంలేదని నిశ్చయించుకున్న ప్రజలకి రాణా ఆర్తనాదం, ఆశ్చర్యాన్ని కలిగించింది.

అంతకు ముందే, తన పిల్లలకోసం పిచ్చాడిలా ఏడుస్తూ ఓ యిన్‌స్పెక్టర్, సగం కూలిపోయిన యిళ్ళనీ, శిథిలమైన పాపుల్నీ, అగాధపు టంచుల్నీ కలయతిరిగాడు. తర్వాత తెగించి—ఓ తాడు సహాయంతో లోపలికి దిగాడుకూడ.

కాని అతనికి ఎవరూ కనబడలేదు.

లోపల ఏమీ కనబడలేదు—అంధకారం తప్ప—

నిరుత్సాహంగా బైటికి వచ్చిన ఇన్‌స్పెక్టర్‌కి అప్పుడే వినబడింది రాణా ఆర్తనాదం!

తాడు నడుంకి బిగించి, మళ్ళీ లోపలకి దిగాడు ఇన్‌స్పెక్టర్, అక్కడి ప్రజల సహాయ సహకారాలతో.

రెండు నిముషాలయింది....

వారంతా ఊపిరి బిగపట్టి చూస్తున్నారు....

మూడు....

నాలుగు....నిముషాలు బరువుగా గడిచాయి....

అయిదో నిముషం తర్వాత ఒగురుస్తూ బైటపడ్డాడు యిన్‌స్పెక్టర్, చేతిలో స్పృహతప్పిన పాపతో!

అతను నేలపై పాపను పడుకోబెట్టాడు.

డాక్టర్‌ని పిల్చుకురమ్మని కంగారుగా జనానికి చెప్పి, కన్నీళ్ళతో, ఆతురతగా పాప మొహాన్ని ముద్దులతో ముంచేసాడు.

ఉలిక్కిపడి ఇన్‌స్పెక్టర్ మళ్ళీ వెనక్కి వెళ్ళాడు.

తాడు సహాయంతో మళ్ళీ లోనికి దిగాడు.

ఈసారి అతను ఓ వ్యక్తిని సాయంచేస్తూ బైటికి తీసు
కొచ్చాడు—ఆ గాఢంలోంచి.

ఆ వ్యక్తి ముఖంనుండి, కాళ్ళదాకా మట్టి కొట్టుకుని
పోయి వున్నాడు.

దుమ్ము కొట్టుకుపోయి భయంకరంగా కనబడుతున్న
ఆ వ్యక్తి కేకలు పెడుతూ, వేగంగా అరుస్తున్నాడు....

"నన్ను పోనీండి! అక్కడే బాగుంది నాకు! హహ్హహ"
అంటూ హఠాత్తుగా, అతను వెనక్కి తిరిగి రివ్వున
ఆ గాఢం వేపు పరిగెత్తాడు....

నలుగురు గ్రామస్థులు మెరుపులా కదిలి అతన్ని బలంగా
ఒడిసి పట్టుకున్నారు.

పిచ్చివాడైన ఆ వ్యక్తే రాణా!

* * *

చీలికలోంచి పుట్టుకొస్తున్న ఆ విచిత్రమైన పొగని,
గ్రామ ప్రజలు తిలకించారు, ఆశ్చర్యంగా.

దొంతర్లు దొంతర్లుగా వెలువడుతోంది ఆ పొగ....

ఆ పొగ మధ్యగా చిన్నగా ఏదో మెరుస్తోంది! సూర్య
రశ్మి దానిగుండా ప్రసరించడంవల్ల అలా మెరుస్తోందని
భావించారు వారంతా.

వేగంగా ఆ పొగ పైకిలేచి ఆకాశంవేపు ప్రయాణిస్తూ
దట్టమైన, పసుపు పచ్చని మేఘంగా మారిందది!

ఏదో బాంబు ప్రేలిన తర్వాత ఏర్పడే పొగలా
వుందది.

ఆ గాఢంలో మిగిలివున్న పొగ, కుక్కగొడుగు ఆకా
రంలో పైకి లేస్తూ, పసుపు మేఘంలో కల్సిపోయి ఆకా
శంలో ప్రయాణించసాగింది....

ఆ శిథిలమైన గ్రామానికి దూరంగా....

గాలి, ఆ మేఘాన్ని దూరంగా నెట్టివేయగానే అందరూ ఆ విషయం గురించి తాత్కాలికంగా మర్చిపోయారు.

§ § §

స్వామి కేశవానంద్ జీ—బరువెక్కిన హృదయంతో, తల దించుకుని పొలాలమ్మట అడుగులేస్తున్నారు....

ఆజానుబాహువైన విగ్రహం ఆయనది....

శాంత గంభీరవదనం....

కాషాయ వస్త్రాలు ధరించాడు....

ఆ చుట్టుప్రక్కల గ్రామీణ ప్రజలు, ఆయన ఉపన్యాసాలు విని తన్మయులౌతూంటారు....

అర్ధనిమీలిత నేత్రాలతో, ఆయనతోపాటు భజన గీతాలు ఆలాపిస్తూ, ఐహిక దుఃఖాల్ని మరుస్తుంటారు....

ఆయన సన్నిధి వారికి ఓదార్పు....

స్వామీజీ అంటే వారికి భక్తి, గౌరవం....ప్రాణం! సదా నిర్మలాకాశంలా ప్రశాంతంగా వుండే ఆయన మోములో, ఆ రోజు విషాదపు మబ్బులు ముసురుకుని వున్నాయి....

పక్క గ్రామంలో జరిగిన దారుణ సంఘటన ఆయన్ని కలవర పెడుతోంది....

దాన్నిగురించే తీవ్రంగా ఆలోచిస్తున్నాడాయన.... వారం రోజులుగా, అక్కడి భూకంపం గురించి, వార్తా పత్రికల్లో పడుతోంది....

కాని ఈ రోజుల్లో ఒకరి బాధలు, మరొకరు పట్టించుకొనే దెవరు?

ప్రక్క గ్రామ ప్రజలు, తన గ్రామవాసులకి-పొరుగువారు.

భారత దేశంలో మిగతా ప్రజలకి—వాళ్ళు మరోచోట నివసించే పౌరులు మాత్రమే.

ఒకరి సమస్యను పట్టించుకోనే తీరిక ఎక్కడిది ఈనాటి మానవుడికి?

ఎవరి జీవితం వారిది....

ఎవరి సమస్యలు వారివి....

ఈరోజు సంతోషిమా ఆలయంలో ఆ విషయంపైనే తను ఉపన్యసించబోతున్నాడు.

స్వామీజీ అకస్మాత్తుగా తలెత్తి చూసాడు.

తను—ఓ విచిత్రమైన పొగమంచులోకి నడిచినట్లు గ్రహించాడు.

పొగమంచు, ఈ కాలంలో సహజమే.

కాని యిది యిలా వుందేమిటి?

దట్టంగా.... వెడల్పుగా....

తన ముఖంమీద పోతున్నప్పుడు మరీ దట్టంగా....

దృష్టి కనబడనీయకుండా....

ఓ విచిత్రమైన వాసనకూడా?—

సంతోషిమాతా!

ఆలయంలో నీ సేవలకు జాగు అవుతుందేమో?

సూర్యోదయించి యింత సేపైనా, ఇంకా పొగమంచేమిటి?

తలెత్తి, పైకి చూసాడు స్వామీజీ.

సూర్యుడి ఉనికి బలహీనంగా కనబడుతోంది, ఆయన్ని చుట్టుముట్టిన దట్టమైన పొగమంచులోంచి.

గుడ్డిగా ముందుకు నడవసాగాడు స్వామీజీ.

తను నడిచే మార్గం సరైనదో కాదో తెలియదు అతనికి.

"సంతోషిమా! నేను దారి తప్పాను" గొణుక్కున్నాడు స్వామీజీ, ఎదురుగా తనవైపే వస్తున్న నల్లని ఆకారంవైపు చూస్తూ.

ఆ ఆకారం తనంత ఎత్తుగా లేదు....

బలంగా లావుగా వుంది....

ఏవిటది?

నిశ్శబ్దంగా వస్తోంది తనవైపే....

యిప్పుడు?

ఓహ్! భగవాన్! మరో ఆకారం....యింకొకటి.... మరోటి వాటిని కల్సింది....తనమీదకే వస్తున్నాయి.

స్వామీజీ భయంగా చూస్తూ వెనక్కి నడవసాగాడు.

అతని నోరు, తెరుచుకుంటూ మూసుకుంటోంది శబ్దం లేకుండా....

అతను వేగంగా నడవసాగాడు వెనక్కి తిరక్కుండా.

క్రమక్రమంగా ఎక్కువౌతున్న తన పైకి వస్తున్న ఆ ఆకారాలమీంచి దృష్టి మళ్ళించడానికి భయంగా వుంది....

ఉన్నట్టుండి అతను వెనక్కి దేనికో గుద్దుకున్నాడు... స్వామీజీ తూలిపడిపోతూ వెనక్కి చూసాడు-భయంగా.

అతన్ని గుద్దుకున్న నల్లటి ఆకారం అతనివేపే సూటిగా చూస్తోంది....

నవ్వాడు స్వామీజీ!

కళ్ళలో నీళ్ళు నిలిచేదాకా పగలబడి నవ్వాడు.

తన పిరికితనానికి, తనే ఆశ్చర్యపోతూ విరగబడి నవ్వాడు.

తను గేదెల మందలోకి నడిచాడు!! అంతే!

స్వామీజీ మామూలు మనిషి కావడానికి అయిదు

నిముషాలు పట్టింది.

ఆ గేదెల యజమాని భైరవ్.

వాడు పగలబడి నవ్వుతాడు, తానీ అనుభవాన్ని చెప్పి నప్పుడు.

నేలమీద ఎగురుతున్నట్టు ఆ గేదెలు అలా కనబడ్డంతో ఆశ్చర్యంలేదు.

పొగమంచు విపరీతంగా వుంది!

గేదెల కాళ్ళు తనకు కనబడలేదు.

అవును. తనో గుణపాఠం నేర్చుకున్నాడీ రోజు.

తెలియనిదేదైనా, భయంకరంగా వుంటుంది, వాస్త వానికంటే.

స్వామీజీకి మరో అయిదు నిముషాలు పట్టింది పొగ మంచునుండి బైటపడి, ఆలయాన్ని దారి వెతుక్కో డాన్కి.

ర ర ర

ఆకుల చప్పుడు విని, కాలా చటుక్కున పొదల వెనక దాక్కున్నాడు.

మనిషా?

జంతువా?

తను చాలా జాగ్రత్తగా వుండాలి. అనుకున్నాడు కాలా.

మాజీ మిలటరీ మేజర్ విశ్వనాథ్ తోట అది.

ఆ తోటలో రకరకాల పక్షుల్నీ, జంతువుల్నీ పెంచు తాడు విశ్వనాథ్. నెమళ్ళు, పావురాలు, కోళ్ళు, మొద లైన వెన్నో.

ఒకసారితను, పావురాల్ని దొంగిలిస్తూ దొరికిపోయాడు. అప్పుడు మేజర్ విశ్వనాథ్ తనని ఈడ్చుకుంటూ లాక్కెళ్ళి

యింట్లో కొట్టిన కొరడా దెబ్బల తాలూకు మచ్చలు ఇంకా తన వీపుమీద వున్నాయి. మరోసారి తోటలో అడుగు పెడితే పోలీస్ స్టేషన్ కి అప్పగించి, చితగ్గొట్టిస్తానన్నాడు.

కాని ఈసారి తను ఆ ముసలాడికి దొరకడు. క్రిందటి సారి తోటలో ఎక్కువసేపు తిరుగుతూ వుండడంవల్ల దొరికిపోయాడు.

ఈ రోజు విశ్వనాథ్ మేడలో హడావుడిగా వుంది. పట్నంనుంచి కార్లు వస్తున్నాయి. ఏదో పార్టీ వున్నట్టుంది.

అందుకే తన చేతిలో వున్న నెమలిపిల్లతో సంతోషించలేదు కాలా.

ఆ నెమలి పిల్లని పాతిక రూపాయలకి అమ్ముకోవచ్చు కాని తాను ఆ సమాను దొంగతనానికి రావడం ప్రమాదం. అందుకే యింకో దాన్ని దేనినైనా చేజిక్కించుకుని పారిపోవాలి.

తోట యజమానిని తిట్టుకుంటూ, పొదల్లోంచి గుడ్లగూబలా బైటికి చూశాడు కాలా.

అంతే!

అతని ఒళ్ళు జలదరించింది.

అవును!

అక్కడేదో వుంది.

మనిషి కాదు.

మరో నెమలిపిల్ల అక్కడ దాక్కుని ఉందేమో?

చప్పుడు చేయకూడదు.

బెదిరిపోతుంది.

ఆ ముసలి వెధవ తోటలో యిలాంటివి ఎన్నో వున్నాయి.

పది నిమిషాల పాటు నిశ్చలంగా అలాగే వుండి

పోయాడు కాలా.

ఉలికిపడి వెనక్కి చూసాడు కాలా.

విచిత్రమైన పొగ—తనను మునుపటిలా కప్పేసిందని గ్రహించి విసుబోయాడు.

కాలాకి ఎంతో ఆశ్చర్యమేసింది. ఆ తోటలో అలాంటి పొగమంచుని ఎప్పుడూ చూడలేదతను.

ఏది ఏమైనా అవతలి పొదలో వున్న జంతువు బైటికి వచ్చేవరకూ—కదలకూడదని నిశ్చయించుకున్నాడు.

రెండు నిముషాలయింది....

అప్పటికే నేలమీది ఆ విచిత్ర మేఘం అతన్ని దాటుకుంటూ అవతలి పొదవైపు కదిలింది—తేలుకుంటూ.

సరిగ్గా అప్పుడే—

ఆ పొదలోంచి ఏదో చర్రున పారిపోయిన అలికిడి....

"ఛ లేగయీ సాకీ!" కసిగా తిట్టుకుంటూ పైకి లేచాడు కాలా.

అసహనంగా నేలను తన్నాడు.

చేతిలోని బంధించబడ్డ నెమలిపిల్ల వైపు ఓసారి చూసాడు.

ఏదీ లేనిదానికంటే, దొరికినదాంతో సంతృప్తిపడ్డం ఉత్తమం—

కాలా వెనక్కి తిరిగాడు.

పొగ మంచులోంచి నడుచుకుంటూ వెళ్ళాడు. బైటికి దారి అతనికి బాగా తెలుసు.

పొగమంచు అతన్ని ఏమీ చేయలేదు.

కళ్ళకు గంతలుకట్టినా తనదారి తాను వెతుక్కో గలడు.

(ఇంకావుంది)

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగడం సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును. •



# ప్రేమలో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## ఏడడుగుల బంధం?

సినీ హాస్యనటుడు రమణారెడ్డిలా సన్నంగా వున్న ఓ కాలేజీ విద్యార్థి ఆంజనేయులు, సూర్యకాంతంలా లావుపాటిగ వున్న తన క్లాసుమేటు సుకుమారిని, ప్రేమించాడు. ఆమెకూడ అతన్ని ప్రేమించింది.

ఇద్దరూ పెళ్ళిచేసుకుందుకి యిష్టపడ్డారు. కాని తండ్రి ఒప్పుకోవాలి. ఆమెకు తండ్రిదగ్గర భయం!

సుకుమారి తండ్రి కోటేశ్వరరావు పలుకుబడీ, డబ్బూ వున్నవాడు. తండ్రిని వెళ్ళి అడగమని చెప్పి పంపించింది.

ఆంజనేయులు అతనిదగ్గరకు వెళ్ళి "సార్! మీ అమ్మాయిని నేమ గాఢంగ ప్రేమించేసాను. ఆమెకూడ నన్ను గాఢంగ ప్రేమించేసింది. ఇక మీదే ఆలస్యం. మా యిద్దరికి మీరు పెళ్ళి చేసేయ్యాలి." అని అడిగాడు స్టైల్‌గా.

అతడాంజనేయుల్ని ఎగాదిగ జూసాడు. సుకుమారికూడ తండ్రి ప్రక్కనచేరి, ఆంజనేయుల్ని క్రీగంటతో చూస్తున్నది.

"చేస్తాను, చేస్తాను. కాని పెళ్ళికి ముందు నువ్వో పని చేయాలి."

"చెప్పండి, సార్! నిప్పులో దూకమన్నారా? హుస్సేన్ సాగర్ యీది రమ్మన్నారా?"

"అదేం అక్కర్లా! కాని మా అమ్మాయి సుకుమారిని ఎత్తుకొని ఏడడుగులు వేయాలి. జాగ్రత్త! మా అమ్మాయి కింద పడకూడదు."

ఆంజనేయులు ఆ మాట విని గతుక్కుమన్నాడు. ఎదురుగా గున్న ఏనుగులా భారీవిగ్రహంతో ఉన్న సుకుమారిని తాను ఎత్తుకోగలడా?

ఒకవేళ ఎలాగోలాగ కష్టపడి ఎత్తుకున్నా ఆ బరువుకి తాను తట్టుకోగలడా. పోనీ ఏదో విధంగ మోసి రెండడుగులైనా వేయగలడా. వేసినా ఆ సుకుమారి బరువుకి నిలద్రొక్కుకోలేక తాను కిందపడి తనమీద ఆమె పడితే? గోవిందా....గోవింద. ఆ పద్దంతో తనపని గోవిందే! పెళ్ళిమాట దేముడెరుగు. బ్రతికుంటే బలుసాకు తిని బ్రతకొచ్చు! ఆంజనేయులు ఊపిరి పీల్చుకొని "వస్తా సార్! మీ అమ్మాయివైపు ఇక కన్నెత్తి చూడను." అంటూ ఒకే పరుగున వీధిలోకొచ్చి పడ్డాడు.

"చూసావా, అమ్మా! ఆ మాత్రం బరువు (నీ) మోయలేనివాడు వివాహమయ్యాక ఇంటి బాధ్యతలు (బరువు) పట్టించుకోక యిలాగే పిరికివాడై పారిపోతే, నీ జీవితం ఏంగాను. అంచాత ప్రేమ, ప్రేమ అంటూ ఇలాంటి ఉత్త ప్రగల్భాలు పలికే కుఱ్ఱకుంకల మోజులోపడక బుద్ధిగా చదువుకో!" అంటూ ఆయన కూతుర్ని మందలించాడు.

—అందవిల్లి కొండలరావు, పార్వతీపురం.



